# భగవన్నామ సంకీర్తన



అనఘానందేంద్ర సరస్వతీ స్వామి.

నీపేరెరిగియు దలంపనివారు అధోగతులు పొందుదురు. బ్రహ్మ
భగవన్నామమును వినినను స్మరించినను పాపము లుండవు.

నారదుడు

కలిలో హరినాముకంటె వేరుగతి లేదు. ముమ్మాటికి లేదు. శ్రీవేదవ్యాసులు
హరికీర్తనమువలన చండాలుడు ముక్తినొందును. శుకుడు
రామా ! నీకంటె నీనామమె గొప్పది. ముల్లోకావాసులందరినితరింపజేయును.

హనుమంతుడు

సంసారసింధు తరుణమునకు సంకీర్త నామృతరసమె శరణ్యము.

చైతన్యులు

కలిలో నామము కామితముల నొసంగు కల్పకము.

తులసీదాసు

క్రతువులకంటె, యోగముకంటె తీర్థ సేవనముకంటె నామస్మరణము శ్రేష్ఠతమము

శ్రీజ్ఞానేశ్వరజీ.

సంకీర్తనము సర్వవిధములగు భేదములను,కలహములను రూపుమాపును.

శ్రీసమర్థరామదాసుజీ.

హరికీర్తనలవలన అంతశ్శుద్ధి కలుగును.

శ్రీఏకానాథజీ.

నామసంకీర్తనము సకల కలుషనాశనము.

శ్రీసనాతనగోస్వామి.

నామస్మరణము కామ, క్రోధ, లోభ, మోహ, మదాదులను మనస్సునుండి తొలగించి వేయును.

మీరాబాయి

శ్రీరామ నామము నుచ్చరించని నోరెందులకు ? వాని జన్మమెందులకు ? వాడెట్లు పుట్టెనో అట్లే గిట్టుచున్నాడు.

కబీరు

శ్రీరామనామమును స్మరించి తరింపని వారు కలరా ? లేదు. ఎవ్వరునులేరు.

సూరదాసు

నామస్మరణమేకాదు. శ్రవణముకూడ సంసారార్ణవతారకమే.

శ్రీహరిదాసజీ

నోరునొవ్వంగ హరికీర్తన నుడువని వారి పుట్టుక తల్లుల కడుపు చేటు.

పోతన

ఇలలో సాటిలేని నామమునకు వెలకట్టి అమ్మినవారు కొన్నవారు రౌరవాది నరకముల వాతపడుదురు.

అవధూతేంద్ర సరస్వతిస్వామి

"శ్రీరామరక్ష సర్వజగద్రక్ష

# భగవన్నామ సంకీర్తన

జయతు - జగన్మంగళం - హరేర్నామ

"కలౌ కల్మషచిత్తానాం పాపద్రవ్యోప జీవినాం।.
విధిక్రియా విహీనానాం గతి ర్గోవింద కీర్తనమ్॥"



కూర్పులు : [illegible]

# ఈ భాగ్యమెన్నటికో ?

జయతు - జగన్మంగళం - హరేర్నామ

శ్లో ॥ నయనం గలదశ్రుధారయా । వదనం గద్గదరుద్ధయాగిరా
వులకై ర్నిచితం వవుః కదా । తవ నామగ్రహణే భవిష్యతి.



ఓ ప్రభూ! ని నామమును స్మరించుచుండగా నాకన్నులనుండి ఆనందాశ్రువు లెప్పుడు జాలువారునో కదా! ఆనందము తలమున్కలై గొంతున డగ్గుత్తిక ఎన్నడు ప్రాదుర్భవించునో కదా! నా శరీర మెన్నడు పులకించునో కదా!

చైతన్యులు.

# గమనిక

**హరే రామ హరే రామ రామ రామ హరే హరే ।**
**హరే కృష్ణ హరే కృష్ణ కృష్ణ కృష్ణ హరే హరే ।।**

- కలిసంతరణోపనిషత్తు.

ఈ కలిసంతరణ నామ మహామంత్రమును గురించి ప్రస్తుతము దేశమున ఒకవిధమైన ప్రచారము జరుగుచున్నది. "ఈ మంత్రము ఉపనిషత్తులోనిదనియు, ద్విజులు తప్ప ఇతరులుచ్చరింప రాదనియు," కొందరి యూహ. కాని అనంతములైన



భగవన్నామములన్నియు నుపనిషత్ప్రతి పాదితములే - మంత్రముతో ప్రణవము గాని, స్వాహా స్వధాలు గాని యున్నపుడే మంత్రశబ్ద వాచ్యములు. అట్టివి యెన్నడును సంకీర్తనగా నుచ్చరింపరాదు. గురూపదేశము మంత్రము గుప్తముగా నుండవలయును. అట్టి మంత్రమును సంకీర్తనగా ఉచ్చరించుట గురుద్రోహము.

మంత్రద్రోహము, ఆత్మ ద్రోహము- కేవల భగవన్నామము సంకీర్తనచేయుట కెట్టి నియమము లేదని శాస్త్రములు ఘోషించుచున్నవి

"వర్ణాశ్రమ వయోదీక్షా శిక్షాది నియమో నహి,
సాధారణం ధనం విద్ధి ....... ........ ......." అనియు కలదు.

కాగా సంకీర్తనా రూపమున భగవన్నామమును గానము చేయుటకు సర్వులకు అధికారము గలదు.

వంగదేశమున ఈ కలిసంతరణ మంత్రమును "హరే కృష్ణ" యని మొదలిడి చేయుదురు. నామదృష్ట్యా అదియు సముచితమే. "హరే రామ" యని గురూపదేశము గాదు. పారాయణ గాదు. కాని - కొందరు సాంప్రదాయ సంకుచిత దృష్టితో "హరే రామ" యని జేయగూడదు. "హరే కృష్ణ" యనియే జేయవలెననియు, "హరే రామ" శూద్రుల కధికారము లేదనియు ప్రచారము జేయుచున్నారు. ఈ యభిప్రాయము చూడ, 'స్వార్థమునకై అన్యమత మవలంబించి ప్రచారము చేయునటుల' నున్నది.

శ్రీ శంకరభగత్పాదులవారు వివిధ ఉపనిషత్తులలోని మంత్రములను శ్లోకరూపముగా అనేక గ్రంథములలో ప్రతి పాదించియున్నారు. ఇట్టితరి "హరే రామ" నామమంత్రమును సంకీర్తనా రూపమున గానముచేయుట యెంత మాత్రము అశాస్త్రీయముగాదు. సర్వులు నిస్సందేహముగా "హరే రామ" జేయవచ్చును. కలిసంతరణోపనిషత్సారములో "సర్వవర్ణ సామాన్యోఽయం మంత్రః" అనియు కలదు.

ప్రస్తుతము లోకమున కొందరు 'పంచాక్షరమంత్రమును' 'హరేరామ' 'శ్రీరామ జయరామ' నామములతోను ప్రణవమునుజేర్చి సంకీర్తనప్రచారము జేయుచున్నారు. ఇదిమాత్రము అసాంప్రదాయమైన విషయము. పూర్వము పెద్దలుగూడ ప్రణవాదులను సంకీర్తనలలో ప్రయోగించలేదు. కాన అట్టి మంత్రములు సంకీర్తనలో ప్రవేశపెట్టుటెంతమాత్రము కూడదు. కొందరు "హరే రామ" ఉపనిషత్తులలోనిది గాన నామముగా గూడజేయరాదు. అట్లుచేసిన పతితుల గుదురని జెప్పుచున్నారు. కాని అట్లు చెప్పుట ఆత్మద్రోహము.

- వాసుదేవ   (signature)

# ప్రస్తావన

మానవ జన్మము దుర్లభము. ఈ జన్మలో మనము దీనిని ఆహార నిద్రాభయ మైథునాదులకు పశువులవలె వినియోగించి, తరుణోపాయము చూచుకొనకుండినఁ జేతదొఱికిన నిధిని బోఁగొట్టుకొన్నట్లు కాఁగలదు. ఈ మానవ జన్మము మరల వచ్చునను నమ్మకము మనకు లేదు. కావున నీ జన్మమునందే తరించు నుపాయమును వెదుకు కొనవలయును. మన మీజనన మరణ సంసారము నుండి తరించుటకు జనన మరణ రహితుఁడును, శాశ్వతుడు నగు భగవంతుని ఆశ్రయింపవలయును.

భగవంతుని ఆశ్రయించుటకు మార్గ మెద్ది? కొందఱు నిష్కామ కర్మముద్వారా ఆరాధించుచుందురు. కొందఱు భక్తిమార్గమునను, మఱి కొందఱు జ్ఞానమార్గమునను. అన్యులు ప్రపత్తిమార్గమునను ఆయన నారాధించుచుందురు. ఏమార్గము ననుసరించినను ఆయనను బొందవచ్చును. పైన చెప్పిన నాలుగు మార్గములలో ప్రాణరూపముగ నున్నది భగవన్నామము. భగవన్నామము లేక కర్మయోగములేదు. కర్మయోగములో ఆచమనము భగవన్నామమేకదా! కర్మయోగములో నేదైన లోపము జరిగిన 'కృష్ణ కృష్ణ' యనిన నాలోపము పోవుచున్నది. కావున కర్మయోగమునకు భగవన్నామమే ప్రాణము. జ్ఞాన యోగములందు 'అహం బ్రహ్మాస్మి' 'అహంబ్రహ్మ' శబ్దములను, 'సోఽహం' అను శబ్దమును, 'తత్త్వమసి' అను శబ్దములను ఓంకారమున భగవన్నామములే. ఇఁక భక్తి యోగము విషయమునఁ జెప్పవలసిన పనియే లేదు. ప్రపత్తియోగములోఁ జేయవలసినది భగవన్నామమునే. నైచ్యానుసంధానముతో భగవన్నామమునే చేయవలెను. చైతన్యులవా రిట్లనిరి -

**శ్లో ॥ తృణాదపి సునీచేన తరోరపి సహిష్ణునా ।**
**అమానినా మానదేన కీర్తనీయో సదా హరిః ॥**

గడ్డిపోచకంటే నీచుఁడుగా నహం కారరహితుఁడుగను. చెట్టుకంటె నోర్పుగలవాఁడుగను (చెట్టును నరికినవాఁడు అలసిపోఁగా వానికిని చల్లనినీడ నొసంగును. పండ్లచెట్లను రాళ్ళతోబాదిన తినుమని మంచిపండ్ల నొసంగును.) అవమానము చేసిన వానికి మర్యాద చేయువాడుగనుండి హరిని కీర్తింపవలయును.

కొందఱు భగవన్నామము పాపములను బోఁగొట్టునేకాని ముక్తి నీయదనియు దీనినే వేదాధికారములేని స్త్రీలు, శూద్రులు గ్రహింపవలసినదియే కాని బ్రాహ్మణ క్షత్రియ వైశ్యుల కనవసర మనియుఁబలుకుచుందురు. అది చాలా పొరపాటు. శాస్త్ర మేమి చెప్పుచున్నదో చూడుఁడు;—

శ్లో ॥ బ్రాహ్మణాః క్షత్రియాః వైశ్యాఃస్త్రియాశూద్రాంత్యజాతయః
యత్ర తత్రాను కుర్వంతో, విష్ణో ర్నామానుకీర్తనమ్.
సర్వపాప వినిర్ముక్తాస్తేపి యాంతి పరాం గతిమ్ ॥

బ్రాహ్మణులు, క్షత్రియులు, వైశ్యులు, స్త్రీలు, శూద్రులు, అంత్యజాతులు విష్ణునామకీర్తనమును జేసినచో సర్వపాపముల నుండియు విడివడి వారును పరమగతికిఁ బోవుదురు,

బ్రతికి యున్ననాళ్ళు ప్రణవజపమును జేసినను (ఇది ద్విజసన్న్యాసులకే అధికారము కలదు), యజుర్వేదములోని శతపథ రుద్రీయమును బారాయణము చేసినను (ఇది అందరకును సాధ్యము కానిది), కాశీపురమందు వరుణ అసినదుల మధ్యనున్న పంచక్రోశ పట్టణములో నివసించి (మరణించి) నను (ఇది ద్రవ్యసాధ్యము అదృష్టముతోఁగూడినది), సిగ్గును వీడి నిరంతరము కలిమలమును హరించు శ్రీవిష్ణునామమును స్మరించితిమా మోక్షప్రాప్తి కలుగుట కేవిధమగు సందేహమును లేదు. ఇందులో నాల్గవదగు భగవన్నామస్మరణ సంకీర్తనము సమస్త వర్ణములవారికిని, సమస్త ఆశ్రమములవారికిని, బాలురకును, వృద్ధులకును, పురుషులకును, స్త్రీలకును అధికారము కలదియు. సులువైనదియు, శీఘ్ర ఫలము నొసంగునదియు సాధనయోగ్యమైనదియునై యున్నది.

భగవన్నామ సంకీర్తనస్మరణములకు భావము మిక్కిలి సహాయము చేయగలదు. కావున నామ సంకీర్తనము చేయునపుడు భావము వచ్చుట భావయుక్తమగు కీర్తనములతోఁ గీర్తించుటవలనఁగలుగును. కావున భావయుక్తమగుకీర్తనములిందుఁ జేర్పబడినవి. మధురగానము చేతను, సంకీర్తనము చేతను ఆంధ్రదేశమంతటను భగవన్నామ ప్రచారము చేసిన పూజ్యులు శ్రీ అవధూతేంద్ర సరస్వతీ స్వామివారిచే ఇందలి నామకీర్తన, స్తోత్రములు గానము చేయబడినవి.

# కలౌకేశవలకీర్తనాత్

**శ్లో ॥ పరివదతు జనో యథా తథావా । ననుముఖరో న వయంవిచారయామః**
**హరిరస మదిరామదేవ మత్తా । భువి విలుఠామ నటామ నిర్విశామ ॥**

శ్రీహరి కీర్తనయందలి రుచి తెలిసిన భక్తుని మాటలివి. శ్రీహరికీర్తనమే మధ్యమట - దానిని (త్రావి మత్తెక్కి వారు నేలమీదఁబడి దొరలు చుందురట - నృత్యమొనరింతురట - లోకమేమనుకొన్నను వారు లెక్క సేయరట.

**"హసత్యథో రోదితి రౌతి గాయ । త్యున్మాద వన్నృత్యతి లోకబాహ్యః!"**

అని భాగవతకర్త పలుకులు. శ్రీహరి కీర్తనయందు రుచి తెలిసిన వాఁడు నవ్వును - ఏడ్చును - అఱచును - పాడును - ఉన్మత్తునివలె లోక బాహ్యుడై నృత్యమొనరించును - అని దీని భావము.

ఇట్టి మాలటు వినినను, చదివినను నిజముగా నట్టిస్థితి సంభవమా ? అను సందేహము కలుగును. మానవుని మనస్సు చాలా చిత్రమైనది. ఉల్లి పాయకంటె అందు పొరలెక్కువ. పైపొరలో విశ్వాసము - లోపలి పొరలోఁదనకే తెలియని యొక యవిశ్వాసపు కాలిమ - ఇది దాని తీఱు. కాగా మాకుఁదీనియందు విశ్వాసమున్నదని చెప్పువారిలోకూడ లోలోపల నీ యవిశ్వాసమును లోపలి పొరలలోఁగూడ కూలం కషముగ చొప్పింప గలిగిన పైన చెప్పినస్థితి కలిగి తీరును.

మంచిదే: కాని మాకు ఈ లోకమునందే కామినీ, కాంచనముల ద్వారా అపారములైన సుఖములు లభించుచుండగా ఆ పిచ్చిగంతులకై మేమేలె పాటుపడవలెను? అందులో సుఖమేమున్నది? అని మానవ మాత్రుని ప్రశ్న.

"మానఁవుడు కామనీకాంచనములవలని సుఖము నంతో యింతో అనుభవించుచునే యున్నాఁడు. అంతమాత్రమున సుఖమన్న నిదే యను కొనరాదు. ఇంతకు మించిన సుఖముకూడ ఉన్నది." - అన్నదే పురాణముల యొక్క మహాపురుషులయొక్క ఘోష. పిండికలిపిన నీళ్ళు త్రాగి సంతృప్తుఁడైన వానిని జూచి గోదుగ్ధములు చక్కెర కలిపినవి త్రాగించవలెనని వారి యాశ. కాని యీ మూర్ఖుఁడైన మానవుఁడు విశ్వసింపఁడు - నోరు తెఱువఁడు. "ఓ అయ్యా! నీవు కామినీ కాంచనములవలని సుఖమును అనుభవించి యున్నావు - శ్రీహరిని

హృదయమున నిలిపి సంతతము హరినామస్మరణ చేయుచుండుము - దీనివలన నీకు అపూర్వ సుఖానుభూతి కలుగును" అని పురాణములు పదే పదే ఘోషించు చున్నవి.

ఆ పురాణములు చెప్పినట్లు మానవుఁడు నడచుకొనడుగాని అయాసుఖములను మాత్ర మాసించును. కాని అదెట్లు సాధ్యము? అందుచే తగినంత ప్రయ్నముచేసి మనస్సును భగవదభిముఖము గావించి భగవన్నామము నందు నిష్ఠయలవరచుకొనుట ఎంతయు నావశ్యకమై యున్నది. మనస్సు భగవన్నామనిష్ఠమైన భగవన్నామము చెవిలోఁబడినంతనే శరీరము పులకరించుట - చెమట పట్టుట - కన్నుల నుండి సంతతము ధారగా నీరుకారుట మున్నగు లక్షణములు వాని కవే జన్మించును. అందువలననే భాగవతములో -

**శ్లో॥ తదశ్మసారం హృదయం బతేదం । యద్గృహ్యమాణై ర్హరినామధేయైః**
**నవిక్రియే తాథ యదా వికారో నేత్రేజలం గాత్రరుహేషుహర్షః ॥**

శ్రీహరినామము విననంతనే పులకరింపని గుండె గుండె కాదు.. ఱాయి అట. పులకరించెనో లేదో నీకెట్లు తెలిసెనయ్యా? అంటే "రోమోద్గమము, హర్షాశులు" కానరావా? అన్నారు.

మంచిదే ! కాని భగవత్ప్రాప్తి కనేక సాధనములుండగా దీనినే ఏల అవలంబింపవలెను? అని కొందఱు శంకింతురు.

కాని కలియుగమున మానవుఁడు తరించుట కింతకంటె నుత్తమమగు సాధనము కానరాదు. క్షణము చిత్తమును నిలుపఁజాలని నేటిమానవుఁడు కృతయుగ తపస్వివలె ధ్యానమెట్లు చేయగలడు? నిత్యమును మనకవసరములగు వస్తువులే పరిశుద్ధములైనవి లభింపని యీ కాలమున బహు సామాగ్రి సంపాదనమునగాని నెరవేరని యజ్ఞములను నిర్వర్తించుటెట్లు? ఉన్న అడవులు చాలవరకు నఱకివేయఁబడగా మిగిలినవి ప్రభుత్వము యొక్క అనుమతిలేక ప్రవేశించుటకైన నశక్యములై యుండగా కందమూలములను దినుచు చెట్టునీడను గూర్చుండు టెట్లు సాధ్యమగును? ఇఁక యోగాభ్యాసమున్నది, ఒకప్పుడూరూర మహాయోగులున్న యీ దేశమున యోగవిద్య పూర్తిగా సన్నగిల్లినది. ఆ విద్య నుపదేశించుగురువేడీ? ఒకవేళ నట్టి గురువు లభించినను చిత్తచాంచల్యమును క్షణకాల మరికట్టజాలని.

పొట్టపని చూచుకొనుటకే ప్రొద్దుచాలని నేటిమానవుడెట్లు యోగము నభ్యసించును? అందుచే మనకు మిగిలిన సాధన మొక్కటియే. అది కేశవకీర్తనము.

"పంచదార, పంచదార" యని యెన్నిసార్లు స్మరించినను పంచదార మనయొద్దకు వచ్చుచున్నదా? "రామ, రామ" యని నీవెంత యఱచినను రాముఁడు నీ యొద్ద కెట్లు వచ్చును? అని కూడ కొందఱు సందేహమును వెలిబుచ్చుదురు.

"పంచదార, పంచదార" యని యెన్ని మారులఱచినను పంచదార మనయొద్దకు రాదు. కారణమది జడపదార్థమగుట. కాని రాముఁడట్లుకాదే! ఈ లోకమునందలి సమస్త చైతన్యమునకు మూలకందమైనవాడు రాముడు. పరులు మనలను బిలువకున్నను వారి మాటలయందు మనపేరు వినవచ్చిన మనమేమి చేయుచున్నాము? నన్ను పిలిచితిరా? యని యడుగుట లేదా! సాధారణ ప్రాణులమైన మనమే యిట్లు చేయుచుండ సర్వాంతర్యామియై చైతన్య స్వరూపి యగు రాముఁడు దివారాత్రములు తన్ను పేరెత్తి, ఎలుగెత్తి పిలుచువాని యొద్ద కెట్లు రాకుండగలడు?

మనస్సు కోతి వంటిది. అది నానా విషయముల యందు పరిభ్రమించు చుండును. అట్టియెడ "రామ! రామ!" యని నోటితో నెంత యఱచినను లాభమేమి? అని నాలుక చప్పరించువారును లేకపోలేదు.

మన మన్నముఁ దినుచు నన్నమునే ధ్యానించుటలేదు. ఏవో అనేక విషయములను దలబోసికొనుచున్నాము. ఏమరియుండియే అలవాటు ననుసరించి భుజించుచున్నాము. అట్లయినను మనకుఁ గడుపు నిండుచున్నది. అన్నసారము వంట బట్టుచున్నది. అట్లే కేవలము నోటితో బలికినను భగవన్నామము పాపనాశకము పుణ్యవర్ధకమునై వర్తిల్లును.

**శ్లో ॥ హరిర్హరతి పాపాని దుష్టచిత్తైరపి స్మృతః ।**
**అనిచ్ఛయాపి సంస్పృష్టో దహత్యేవహి పావకః ॥**

తెలియక నిప్పునుఁ దాకిన చేయికాలుట మానునా? అట్లే హరినామము స్మరణమాత్రమునఁ బాపములను నశింపఁ జేయును.

ఏమైనను నిది అల్పప్రజ్ఞు లవలంబింపవలసిన సాధనము. భగవన్నామమే భగవంతునిఁ బ్రాపింపఁజేసిన శంకరుల యద్వైత వేదాంత మంతయు నేమి

కావలెను? "అహం బ్రహ్మాస్మి" అన్న మహావాక్యమేమి కావలెను? అను వారును గలరు.

మంచిదే ! భజగోవింద శ్లోకముల నెవరు రచించిరి?

**శ్లో ॥ భజగోవిందం భజగోవిందం గోవిందంభజ మూఢమతే ।**
**సంప్రాప్తే సన్నిహితేకాలేనహినహిరక్షతిడుకృఞ్ కరణే ॥**

అని శంకరులే కదా ప్రబోధించిరి! విష్ణు సహస్రనామములకు శంకరులే వ్యాఖ్యానము రచించిరి.

**శ్లో॥ మత్స్యాదిభి రవతారై రవతారవతా సదావసుధామ్ ॥**
**పరమేశ్వర పరిపాల్యో భవతా భవతాపభీతోఽహమ్ ॥** - షట్పది.

మత్స్యాది అవతారములచే లోకమును గాపాడిన ఓ పరమేశా ! సంసార భీతితుఁడనగు నన్నుఁ గాపాడుము - అని శంకరులేకదా ప్రార్థించిరి అందుచే శంకరుల యద్వైతము భగన్నామమును నిషేధింపలేదు. నామనిష్ఠ నలవరచుకొన్న వాని కద్వైతమును సిద్ధించును.

**శ్లో ॥ శ్రీ కృష్ణ చరణాంభోజం సత్యమేవ విజానతామ్ ।**
**జగత్ సత్యమసత్యం వా నేతరేతి మతిర్మమ ॥**

శ్రీ కృష్ణుని చరణారవిందములనుఁ దెలిసికొన్నవానికి జగత్తు మిథ్యయైనను గాకున్నను గలుగు నష్టము లేదు. ఆ శ్రీకృష్ణ చరణారవిందములనుఁ బ్రాపింపఁ జేయు సులభసాధనము భగవన్నామము మన యుచ్ఛ్వాసనిశ్వాసములు నామముతో నిండవలెను. మన నెత్తుట భగవన్నామము పరువెత్తవలెను. మన నాడీ మండలమున భగవన్నామము స్పందింపవలెను. ఇట్టి స్థితి నందుకొనినవాఁడు లోకము సేవగించు కొనును. - "హరిరస మదిరామదేన మత్తా ధువి విలుఠామ నటామ నిర్విశామ" - యని వర్తించును.

జయతి జగన్మంగళం హరేర్నామ

# నామాపరాధములు

నామసంకీర్తన చేయుటకు ముందుగ నామాపరాధముల వివరము తెలిసికొనుట ముఖ్యము.

ఒక్కమారు నామోచ్చారణ చేయుటవలననే మహాఫలము కలుగునని శాస్త్రము శాసించుచుండగ అనంతకాలము నామోచ్చారణ చేసినను ఫలము సిద్ధింపకుండుట అనుభవములో కనుపించుచున్నది.

మనకు తెలిసియు, తెలియకుండగ నామాపరాధము జరుగుచుండుటయే ఇందుకు కారణము. ఈ నామాపరాధములను వివరముగా తెలిసికొని హృదయమున జీర్ణింపచేసుకొని విశ్వాసముతో, ఆర్తితో భగవన్నా మోచ్చారణ చేసిన దానిఫలము తప్పక కలుగును. నామాపరాధములు పదివిధములు.

1. సత్పురుషనింద :- సత్పురుషులవలననే నామము లోకమున ప్రచారము నొందును. కాన సత్పురుష నిందను నామము సహించదు.

2. శివకేశవులయందు భేదదృష్టి :- శివకేశవుల నామగుణములను భేద బుద్ధితో చూచుటయు నామమునకు అహితము చేయుటే యగును.

3. గురునింద - గురువును, ముఖ్యముగ నామోపదేశము చేసిన గురువును నిందించుటయు నామాపరాధమే యగును.

4. శ్రుతిశాస్త్రనింద :- భారతీయ జీవితవిధానమునకు ఆధారభూతములగు వేదములను, ధర్మశాస్త్రములను నిందించుట మహాపరాధము.

5. నామమునందు అర్థవాదకల్పన:- శాస్త్రములందు వర్ణితమైన భగవన్నామ మహిమను సత్యము కాదనియు. ప్రశంసామాత్రమే యనియు తలచుట అర్థవాద మనబడును. ఇది మిక్కిలి భయంకరమైన అపరాధము.

6. కామబలము నూతగగొని పాపవృత్తి కలిగియుండుట :- హింస, ద్యూతము మొదలగు దుష్టకార్యముల నాచారించుచు నామస్మరణవలన సర్వపాపములు తొలగునని తలచుట మహాపరాధమగును. ఇటువంటివారు వ్రతనియమాదుల చేతను పవిత్రులు కాజాలరు.

7. ధర్మవ్రతాదులయందును, నామమునందును సామ్యదృష్టి:- దాన, ధర్మ, వ్రత, హోమాది శుభకర్మలతో నామమును సమానమని తలచుట నామాపరాధము.

8. విముఖుని యెదుట నామోపదేశము :- విముఖుడు, శ్రద్ధాహీనుడు వినుచుండగ నామోపదేశమును చేయుటయు నామాపరాధమే.

9. నామమునందు ప్రేమలేకుండుట:- నామమహాత్మ్యము వినినను నామమునందు ప్రేమలేకుండుటయు అపరాధమగును.

10. అహంకార మమకారములను పరమపురుషార్థములని తలచుట:- అహంకార మమకారాదులనే పరమపురుషార్థములుగ భావించి నామస్మరణ చేయుచుండుటయు నామాపరాధమగును.

## నామాపరాధములకు ప్రాయశ్చిత్తము

**శ్లో ॥ నామాపరాధయుక్తానాం నామాన్యేవ హరం త్యఘమ్,**
**అవిశ్రాంత ప్రయుక్తాని తాన్యేవార్థ కరాణిహి.**

నామాపరాధ మొసరించినవారల సమస్త దురితములను, నామమే హరించును. కాన నిరంతర నామస్మరణచేతనే సర్వపాపములు తొలగిపోవును.

**శ్లో ॥ ఋగ్వేదో హి యజుర్వేదః సామవేదోఽప్యథర్వణః**
**అధీతా స్తేన యేనో క్తం హరి రిత్యక్షరద్వయమ్.**

ఋగ్వేద, యజుర్వేద, సామవేద, అథర్వణ వేదముల నధ్యయన మొనర్చిన ఏ ఫలము గలుగునో, ఆ ఫలము, "హరి" యను రెండక్షరముల నుచ్చారణ వలన గలుగును. నాలుగు వేదముల యధ్యయన ఫలము భగవన్నామము వలన గలుగునని తాత్పర్యము.

# విషయసూచిక

శ్రీ శంకర గురుభ్యోనమః

# భగవన్నామ సంకీర్తన

## 1.ప్రార్థన

**అగజానన పద్మార్కం గజానన మహర్నిశమ్,**
**అనేకదం తం భక్తానా మేకదంత ముపాస్మహే.**

నారాయణ సమారంభాం (శ్రీ) శంకరాచార్య మధ్యమామ్,
అస్మదాచార్య పర్యంతాం వందే గురుపరంపరామ్ ॥

కలౌ కల్మషచిత్తానాం పాపద్రవ్యోప జీవినామ్,
విధిక్రియా విహీనానాం గతిర్గోవింద కీర్తనమ్ ॥

సర్వదా సర్వకాలేషు యేఽ పి కుర్వంతి పాతకమ్,
నామసంకీర్తనం కృత్వా యాంతి విష్ణోః పరంపదమ్ ॥

నమోఽస్తు నామరూపాయ నమోఽస్తు నామజల్పినే,
నమోఽస్తు నామశుద్ధాయ నమో నామమయాయచ ॥

## 2. గురువందనము

జయగురు జయగురు సచ్చిదానందగురు
సచ్చిదానందగురు సచ్చిదానందగురు '

| | | | |
|---|---|---|---|
| అఖండఅద్వయ గురు | ॥ జయ ॥ | అమృత అమరగురు | ॥ జయ ॥ |
| అజ అవినాశి గురు | ॥ జయ ॥ | అగుణ సగుణ గురు | ॥ జయ ॥ |
| అజ్ఞాన తిమిర నాశి | ॥ జయ ॥ | అధమ తారణ గురు | ॥ జయ ॥ |
| గురుహి పరమగతి | ॥ జయ ॥ | గురునామ మహామంత్ర | ॥ జయ ॥ |
| గుణాతీత గుణాకర | ॥ జయ ॥ | గురుర్బ్రహ్మా గురుర్విష్ణు | ॥ జయ ॥ |
| గురుర్దేవో మహేశ్వర | ॥ జయ ॥ | గోతీత గోవింద గురు | ॥ జయ ॥ |
| నిర్వికార నిరంజన | ॥ జయ ॥ | నిరాకార నిరాభాస | ॥ జయ ॥ |
| నిత్యానంద నిరామయ | ॥ జయ ॥ | నిర్మల నిజస్వరూప | ॥ జయ ॥ |
| పతితపావన గురు | ॥ జయ ॥ | పాపహరణ గురు | ॥ జయ ॥ |
| పాతకేర్గతి గురు | ॥ జయ ॥ | పురుషోత్తమ గురు | ॥ జయ ॥ |

| | | | |
|---|---|---|---|
| ప్రణవ స్వరూప గురు | ॥ జయ ॥ | భవరోగ మహావైద్య | ॥ జయ ॥ |
| సకల సాధన గురు | ॥ జయ ॥ | సనాతన స్వయంజ్యోతి | ॥ జయ ॥ |
| సర్వ సర్వగత గురు | ॥ జయ ॥ | సాక్షి ఉపద్రష్ట గురు | ॥ జయ ॥ |

గురుమహరాజ్ గురుమహరాజ్ గురుదేవో సద్గురుమహరాజ్

## 3. గురుచరణం గురుచరణం

గురుచరణం గురుచరణం సద్గురు చరణం భవహరణం

| | | | | | |
|---|---|---|---|---|---|
| " | " | " | శ్రీగురు | " | " |
| " | " | " | హరిగురు | " | " |
| " | " | " | జయగురు | " | " |
| " | " | " | పరమగురు | " | " |

తరణి కులాబ్ధిసోము భవ తారకనాము ప్రసన్నకామునిన్
సరస గుణాభి రాము హరి జానకి రాముని ముక్తిధామునిన్
అరిజన భీమ విక్రము సదా స్మరణించు పరాక్కు రాముని
చరణము లంటి భక్తిమనసా గురుపాదము లాశ్రయింపుమా ॥గురు ॥

ముదమున పారిజాత తరు మూలముల నందు అతి సూక్ష్మరూపుడై
హృదిరఘువీర నామమును ఎపుడు జపించుచు రామభక్తులం బ
దలక బ్రోవుచు నుందుఘను వాయు తనూజుని దీధిలాసు
నీయదలు దలంచి భక్తి కుమతి గరుపాదములాశ్రయింపుమా ॥గురు॥

నరుడని చూచినావో గురువును కృతార్థత నొంద జాలవు
ఈశ్వరుడని చూచినావో అలబ్రహ్మపదార్థమెరుంగ వచ్చు
నీ సరియగు లక్ష మొక్కటి యెచాలును సాధనలెల్ల గూర్చు
ఈశ్వరుడనినమ్మి భక్తి మనసా గురుపాదమూలాశ్రయింపుమా॥ గురు ॥

రామగుణాభిరామ రఘురామ పరాక్రమ భీమ జానకీరామ
ప్రపన్నరామ బుధరంజితనామ సుధామ రామశ్రీరామ
దురంత దుర్భర వికామ సుకామ ప్రపన్నకామ నిక్కామ
యటంచు భక్తి మనసా గురుపాదము లాశ్రయింపుమా ॥ గురు ॥

శంకర పార్వతి హృదయశంకర శంకరా భక్త పావన శంకర ఘోర
దుఃఖ భవసాగర తారక చంద్రశేఖరా శంకరా లోక భీకర

విచాకర సంహార దేవదేవ ఓ సంకటనాశయ టంచు
భక్తి మనసా గురుపాదము లాశ్రయింపుమా ॥ జయ గురు ॥

అంబ మ దంబ దుర్గా జగదంబ పరాంబ ఉమా త్రిశక్తి మూలంబ
భవానీ శంకర కళా భ్రమరాంబ చిదంబరార్ధ దేహంబ జడాజడంబ
లలితా త్రిపురాంబ భవాని అంబా దుర్గాంబా యటంచు
భక్తి మనసా గురుపాదము లాశ్రయింపుమా ॥ జయగురు॥

శరణు పరాత్మర శరణు సహచరాచర విశ్వరూపుడా శరణు
గురూత్తమ శరణుశౌరి విరంచిశివ స్వరూపుడ శరణు
త్రిమూర్త్యతీత భవసాగర తారక దేవదేవ నీ చరణు
దిక్కటంచు భక్తి మనసా గురుపాదములాశ్రయింపుమా ॥ గురు॥

మో హాంధకార హరణం గురుణైవ కార్యం
నా న్యైశ్చ సాధ్యమితి వక్తి శృతిశ్చమాతా
మద్వత్తమః ప్రహరణం విధునైవ కార్యం
ఋక్షైర్నసాధ్య మతఏవ గురుం భజామః ॥ గురు ॥

గురుచరణం గురుచరణం సద్గురుచరణం భవహరణం
దత్తాత్రేయ గురుచరణం, సదాశివేంద్ర గురుచరణం
శంకర చరణం గురుచరణం, శ్రీగురుచరణం భవహరణం
గురుమహరాజ గురుమహరాజ గురుదేవా సద్గురుమహరాజ ॥ గురు ॥

లోకత్రయే గురు పదస్సహి గౌరవత్వ । మస్తి ప్రసిద్ధ మపరస్య లఘుత్వమేవ
లోకే గురుర్లఘురితి ద్వయమస్తిసిద్ధం । తస్మాత్పరం గురుపదం భజనీయమేవ
॥ గురుమహారాజ॥

## 4. శ్రీ గణేశ స్తుతి

గాఇయే గణపతి జగ వందన । శంరసువన భవానీనందన
సిద్ధీసదన గజవదన వినాయక । కృపాసింధు సుందర సబలాయక.

మోదకప్రియ ముద - మంగళ - దాతా । విద్యావారిధి - బుద్ధి విధాతా!
మాంగత తులసీదాస కరజోరే । బసహిఁ రామ - సియ మానసమోరే !

గణపతి లోక వంద్యుఁడు. అతనిని గీర్తింపుడు. అతడు పార్వతీ పరమేశ్వరులకు ముద్దుబిడ్డడు. సర్వసిద్ధులు నాతని నంటియుండును. అతడేనుగుమోముగల వినాయకుడు. అతఁడు దయాసముద్రుఁడు. సుందరుఁడు పూజ్యుఁడు. అతనికి కుడుములపై మక్కువ ఎక్కువ. అతఁడు ఆనందమును,

శుభమును కలిగించును. విద్యాసముద్రుఁడు, బుద్ధికి విధాతయునగు నా గణపతి తులసీదాసు - తన మనస్సులో సీతారాములు నివసించునట్లు అనుగ్రహింపుమని నమస్కరించు చున్నాఁడు.

శ్లో ॥ శుక్లాంబరధరం విష్ణుం శశివర్ణం చతుర్భుజం
ప్రసన్నవదనం ధ్యాయేత్ సర్వవిఘ్నోపశాంతయే ॥

## 5. గణపతి ప్రార్థన

విఘ్నహరణ విఘ్నహరో ।
మంగలమయ మహామహిమ మహిమయ దయాకరో ॥

శ్రీయుత పింగాక్ష కృష్ణ విఘ్న రాజ గజానన
గౌరీ సుత సువినాయక హేరమ్బ పాపహరో ॥

వక్రతుండ ఏకదంత శూర్పకర్ణ లంబోదర
గణపతి గజవక్త్ర వికట బాలచంద్ర అమృతఝరో ॥

గిరిజాప్రియ ధూమ్రవర్ణ బుద్ధిరాశి విఘ్నేశ్వర
మూషకారూఢ మధుర మోదకప్రియ దయాకరో ॥

బ్రహ్మ శ్రీ విష్ణు సరల శంకరపూజిత సురేశ
దేవోంకే దేవ ఈశ తేజపుంజ తిమిర హరో ॥

బ్రహ్మ శ్రీ పద్మ కాంత శంకరపూజిత సురేశ ॥

"ఓ విఘ్ననాశకా ! నీవు విఘ్నములను హరింపుము. ఓదేవా! నీవు మంగళస్వరూపుఁడవు, మహిమాన్వితుఁడవు. అట్టినీవు మాపై దయచూపుము. తండ్రీ! నీవు నల్లని మేనితో విఘ్ననాయకు ఁడవై, గజాననుఁడవై, పార్వతీ సుతుఁడవై, వినాయకు ఁడవనియు, హేరంబుడవనియు పొగడొంది యుందువు, ఓదేవా! నీవు మా పాపములను నశింపఁజేయుము. వంకరతొండముతో, ఒంటిదంతముతో, చేటలవలెనుండు చెవులతో, వ్రేలుచుండు బొజ్జతో, ఏనుగుమోముతో, శిరమున చంద్రుఁడు శోభిల్లగా వికట రూపమున వెలుఁగొందు ఓ గణపతీ! మాపై కరుణామృతమును గురియుము. ఓ విఘ్నేశా! నీవనిన పార్వతికిఁ బ్రేమ మెండు. నీవు బూడిదరంగువాఁ డవు. రాశీభూతమైన బుద్ధిసంపద గలవాఁడవు, మూషికము నధిరోహించు వాఁడవు. కుడుములను గొర్కెతో నారగించువాఁడవు. ఓ దేవా! నీవు మాపై దయఁజూపుము. ఓ గణనాయకా! నీవు దేవదేవుడవు. ఇంద్రుడును, త్రిమూర్తులును నిన్ను పూజింతురు. నీవు వెలుగులముద్దవు. ఓ ప్రభూ!

మాయందున్న అజ్ఞానమను చీకటిని విధ్వస్థము కావింపుము.

## 6. శివపంచాక్షర స్తోత్రమ్

నాగేంద్రహారాయ త్రిలోచనాయ । భస్మాంగరాగాయ మహేశ్వరాయ
నిత్యాయ శుద్ధాయ దిగంబరాయ । తస్మైనకారాయ నమశ్శివాయ.

మందాకినీ సలిల చందన చర్చితాయ
నందీశ్వర ప్రమథనాథ మహేశ్వరాయ
మందారముఖ్య బహుపుష్ప సుపూజితాయా
తస్మైమకారాయ నమశ్శివాయ

శివాయ గౌరీవదనారవింద । సూర్యాయ దక్షాధ్వరనాశనాయ,
శ్రీ నీలకంఠాయ వృషధ్వజాయ । తస్మైశికారాయ నమశ్శివాయ

వసిష్ఠకుంభోద్భవ గౌతమాది । మునీంద్ర దేవార్చిత శేఖరాయ,
చంద్రార్క వైశ్వానరలోచనాయ । తస్మైవకారాయ నమశ్శివాయ

యజ్ఞ స్వరూపాయ జటాధరాయ । పినాక హస్తాయ సనాతనాయ
సుదివ్య దేహాయ దిగంబరాయ । తస్మైయకారాయ నమశ్శివాయ

పంచాక్షర మిదం పుణ్యం యః పఠే చ్ఛివసన్నిధౌ ।
శివలోక మవాప్నోతి శివేన సహ మోదతే.

## 7. చంద్రశేఖరాష్టకమ్

చంద్రశేఖర చంద్రశేఖర పాహిమామ్ ।
చంద్రశేఖర చంద్రశేఖర చంద్రశేఖర రక్షమామ్.-

రత్నసాను శరాసనం రజతాద్రి శృంగనికేతనం
శింజనీకృత పన్నగేశ్వర మచ్యుతానన (నల) సాయకమ్,
క్షిప్రదగ్ధ పురత్రయం త్రిదిశాలయై రభివందితం
చంద్రశేఖర మాశ్రయే మమ కిం కరిష్యతి వైయమః.

పంచపాదప పుష్పగంధి సదాంబుజద్వయ శోభితం
ఫాలలోచన జాతపావక దగ్ధ మన్మథ విగ్రహమ్,

భస్మదిగ్ధకళేబరం భవనాశనం భవమవ్యయం
చంద్రశేఖర మాశ్రయే మమ కిం కరిష్యతి వైయః

మత్తవారణ ముఖ్య చర్మకృతో త్తరీయ మనోహరం
పంకజాసన పద్మలోచన పూజితాంఘ్రి సరోరుహమ్,
దేవసింధు తరంగ సీకరసిక్త శుభ్ర జటాధరం
చంద్రశేఖర మాశ్రయే మమకిం కరిష్యతి వైయమః

యక్ష రాజసఖం భగాక్షహరం భుజంగవిభూషణం
శైలరాజసుతా పరిష్కృత చారువామకళేబరమ్
క్ష్వే (క్ష్వే) డనీలగలం పరశ్వధధారిణం మృగధారిణం
చంద్రశేఖర మాశ్రయే మమ కిం కరిష్యతి వైయమః

కుండలీకృత కుండలీశ్వర కుండలం వృషవాహనం
నారదాది మునీంద్రసంస్తుత వైభవం భువనేశ్వరమ్,
అంధకాంతక మాశ్రితామర పాదపం శమనాంతకం
చంద్రశేఖర మాశ్రయే మమ కిం కరిష్యతి వైయమః.

భేషజం భవరోగిణా మఖిలాపదా మపహారిణం
దక్షయజ్ఞ వినాశనం త్రిగుణాత్మకం త్రివిలోచనమ్,
భుక్తిముక్తి ఫలప్రదం సకలాఘసంఘ నిబర్హణం
చంద్రశేఖర మాశ్రయే మమ కిం కరిష్యతి వైయమః

భక్తవత్సల మర్చితం నిధిమక్షయం హరిదంబరం
సర్వభూతపతిం పరాత్పర మప్రమేయ మను త్తమమ్,
సోమవారివభూహుతాశన సోమపానిలఖాకృతిం
చంద్రశేఖర మాశ్రయే మమ కిం కరిష్యతి వైయమః

విశ్వసృష్టివిధాయినం పునరేవ పాలన తత్పరం
సంహరంత మపి ప్రపంచ మశేషలోక నివాసినమ్,
క్రీడయంత మహర్నిశం గణనాథయూధ సమన్వితం
చంద్రశేఖర మాశ్రయే మమ కిం కరిష్యతి వైయమః

మృత్యుభీత మకృండుసూను కృత స్తవం శివసన్నిధౌ

యత్రకుత్ర చ యః పఠేన్నహితస్య మృత్యుభయంభవేత్,
పూర్ణామాయురరోగితా మఖిలార్థసంపద మాదరం
చంద్రశేఖర ఏవ తస్య దదాతి ముక్తి మయత్నః

సంసార సర్ప దష్టానం జంతూనా మవివేకినాం,
చంద్రశేఖరపాదబ్జ స్మరణం పరమౌషధం.

రుద్రం పశుపతిం స్థాణుం నీలకంఠ ముమాపతిం,
నమామి శిరసా దేవం కిన్నో మృత్యుః కరిష్యతి.

కాలకంఠం కాలమూర్తిం కాలాగ్నిం కాలనాశనం,
నమామి శిరసా దేవం కిన్నో మృత్యుః కరిష్యతి.

అనంత మవ్యయం శాంత మక్షమాలాధరం హరం,
నమామి శిరసా దేవం కిన్నో మృత్యుః కరిష్యతి.

ఆనందం పరమం నిత్యం కైవల్యపదకారణం,
నమామి శిరసా దేవం కిన్నో మృత్యుః కరిష్యతి.

దేవ దేవం జగన్నాథం దేవేశం వృషభధ్వజం,
నమామి శిరసా దేవం కిన్నో మృత్యుః కరిష్యతి.

స్వర్గాపవర్గదాతారం. సృష్టి స్థిత్యంతకారణం,
నమామి శిరసా దేవం కిన్నో మృత్యుః కరిష్యతి.

గంగాధరం శశిధరం శంకరం శూలపాణినం,
నమామి శిరసా దేవం కిన్నో మృత్యుః కరిష్యతి.

భస్మోద్ధూళితసర్వాంగం నాగాభరణభూషితం,
నమామి శిరసా దేవం కిన్నో మృత్యుః కరిష్యతి.

మార్కండేయకృతం స్తోత్రం యః పఠే చ్ఛివసన్నిధౌ,
తస్యమృత్యు భయంనాస్తి సత్యం సత్యం వదామ్యహమ్.

శివేశాన మహాదేవ వామదేవ, సదాశివ,
కల్పాయు ర్దేహిమేపూర్ణం యావదాయు రరోగతామ్.

## 8. శివాష్టకమ్

1. ప్రభుమీశ మనీశ మశేషగుణం । గుణహీన మహీశ గరాభరణమ్,
రణనిర్జిత దుర్జయ దైత్యపురం । ప్రణమామి శివం శివ కల్పతరుమ్ ॥

2. గిరిరాజ సుతాన్విత వామ తనుం । తనునిన్దిత రాజిత కోటి విధుమ్,
విధి విష్ణు శిరోధృత పాదయుగం । ప్రణమామి శివం శివ కల్పతరుమ్ ॥

3. శశలాంఛిత రంజిత సన్ముకుటం । కటిలంబిత సుందర కృత్తిపటమ్
సురశైవ లినీకృత పూతజటం । ప్రణమామి శివం శివ కల్పతరుమ్ ॥

4. నయనత్రయ భూషిత చారుముఖం ।ముఖపద్మ పరాజిత కోటివిధుమ్,
విధుఖండ విమండిత ఫాలతటం। ప్రణమామి శివం శివ కల్పతరుమ్ ॥

5. వృషరాజ నికేతన మాదిగురుం । గరళాశన మాజి విషాణధరమ్,
ప్రమథాధిప సేవక రంజనకం । ప్రణమామి శివం శివ కల్పతరుమ్ ॥

6. మకరధ్వజ మత్త మాతంగహరం । కరిచర్మగ నాగవిభోధ కరమ్,
వర మార్గన శూల విషాణధరం । ప్రణమామి శివం శివ కల్పతరుమ్ ॥

7. జగదుద్భవ పాలన నాశకరం । త్రిదశైవ శిరోమణి ఘృష్టపదమ్,
ప్రియమానవ సాధు జనైక గతిం । ప్రణమామి శివం శివ కల్పతరుమ్ ॥

8. అనాథం సుదీనం విభో విశ్వనాథం । పునర్జన్మ దుఃఖాత్పరిత్రాహిశంభో,
స్మరతోఽఖిల దుఃఖ సమూహ హరం।ప్రణమామి శివం శివకల్పతరుమ్ ॥

## 9. రుద్రాష్టకమ్

కర్పూరగౌరం కరుణావతారం
సంసారసారం భుజగేంద్రహారమ్,
సదా వసంతం హృదయారవిందే
భవం భవానీసహితం నమామి ॥

నమామీశ మీశాన నిర్వాణరూపం
విభుం వ్యాపకం బ్రహ్మవేదస్వరూపమ్,
నిజం నిర్గుణం నిర్వికల్పం నిరీహం
చిదకాశ మాకాశవాసం భజేఽహమ్॥

నిరాకార మోంకారమూలం తురీయం
గిరాజ్ఞానగోఽతీత మీశం గిరీశమ్,
కరాళం మహాకాలకాలం కృపాలుం
గుణాగారసంసారపారం నతోఽహమ్॥

తుషారాద్రి, సంకాశ గౌరం గభీరం
మనోభూత కోటిప్రభా శ్రీశరీరమ్,
స్ఫురన్మౌళి కల్లోలినీ చారు గంగా
లసద్భాలబాలేందు కంఠే భుజంగా ॥

చలత్కుండలం భ్రూ సునేత్రం విశాలం
ప్రసన్నాననం నీలకంఠం దయాలుమ్,
మృగాధీశచర్మాంబరం ముండమాలం
ప్రియం శంకరం సర్వనాథం భజామి ॥

ప్రచండం ప్రకృష్టం ప్రగల్భం పరేశం
అఖండం అజం భానుకోటిప్రకాశమ్,
త్రయ శ్శూల నిర్మూలనం శూలపాణిం
భజేఽహం భవానీపతిం భావగమ్యమ్ ॥

కలాతీత కల్యాణ కల్పాంతకారీ
సదా సజ్జనానంద దాతా పురారీ,
చిదానంద సందోహ మోహాపహారీ
ప్రసీద ప్రసీద ప్రభో మన్మథారీ ॥

నయావద్ ఉమానాథ పాదారవిందం
భజంతీహ లోకే పరేవా నరాణామ్,
నతావత్ సుఖం శాంతి సంతాప నాశం
ప్రసీదప్రభో సర్వభూతాధివాసమ్ ॥

న జానామి యోగం జపం నైవ పూజాం
నతోఽహం సదా సర్వదా శంభు తుభ్యమ్,
జరా జన్మ దుఃఖౌఘ తాతప్యమానం
ప్రభో పాహి ఆపన్నమామీశ శంభో.

రుద్రాష్టకం మిదం ప్రోక్తం విప్రేణ హరతోషయే,
యే పఠంతి నరా భక్త్యా తేషాం శంభుః ప్రసీదతి ॥

## 10. ద్వాదశ జ్యోతిర్లింగ స్తోత్రమ్

సౌరాష్ట్రే సోమనాథం చ శ్రీశైలే మల్లికార్జునమ్,
ఉజ్జయిన్యాం మహాకాల మోంకార మమలేశ్వరమ్,

పరల్యాం వైద్యనాథం చ డాకిన్యాం భీమశంకరమ్,
సేతుబంధేతు రామేశం నాగేశం దారుకావనే.

వారాణస్యాంతు విశ్వేశం త్ర్యంబకం గౌతమితటే,
హిమాలయేతు కేదారం ఘృష్ణేశంచ విశాలకే.

ఏతాని జ్యోతిర్లింగాని సాయం ప్రాతః పఠేన్నరః,
సప్తజన్మ కృతం పాపం స్మరణేన వినశ్యతి.

## 11. శివనామమహిమ

"విశ్వేశ్వర విరూపాక్ష విశ్వరూప సదాశివ,
శరణం భవ భూతేశ కరుణాకర శంకర.

హరశంభో మహాదేవ విశ్వేశామరవల్లభ,
శివ శంకర సర్వాత్మాన్ నీలకంఠ నమోఽస్తుతే.

మృత్యుంజయాయ రుద్రాయ నీలకంఠాయ శంభవే,
అమృతేశాయ శర్వాయ శ్రీమహాదేవ తేనమః.

ఏతాని శివనామాని యః పఠే న్నియతః సకృత్,
నాస్తి మృత్యుభయం తస్య పాపరోగాది కించన."

పై శివనామములను నియమముగా నొక పర్యాయమైన పఠించిన పాపములు, రోగములు నశించును. మృత్యుభయ మెంతమాత్రము నుండదు.

యత్కృత్యం తన్నకృతం యదకృత్యం కృత్యవత్తదాచరితం, ఉభయోః ప్రాయాశ్చిత్తం శివతవనామాక్షరద్వయోచ్చరితమ్.

శివ! నేను ఏది చేయవలయునో అది చేయుటలేదు. ఏది చేయకూడదో అది చేయుచుంటిని. ఈ రెండువిధముల పాపములను "శివ" అను నీ నామాక్షరములు ఉచ్చరించుటయే ప్రాయశ్చిత్తము.

శివశ్శంకర రుద్రేశ నీలకంఠ త్రిలోచన,
ఇతీరయన్తి యే నిత్యం నహి తాన్ బాధతే కలిః ॥

నిత్యము :- శివ, శంకర, రుద్ర ఈశ, నీలకంఠ, త్రిలోచన అని పలుకువారిని కలి బాధింపదు. -బృహన్నారదీయే.

## 12. శివనామము

| | |
|---|---|
| శివ శివ హరహర | శివ శివ హర హర |
| బాఘంబర ధర | డమరు సుకర ధర ॥ శివ ॥ |
| కరత్రిశూల ధర | అభయ సువర కర |
| భస్మ అంగ ధర | జటాజూట ధర ॥ శివ ॥ |
| ఫాలచంద్ర ధర | తీన నయన ధర |
| నాగహార ధర | ముండమాలధర ॥ శివ ॥ |
| జటారంగ సారంగ | అంగధర |
| ఉమానాథ శ్రీ | దక్షనాథ ధర ॥ శివ ॥ |
| గరళకంఠ ధర | నీలకంఠ ధర |
| నందపీఠ భవ | భూతభార ధర ॥ శివ ॥ |
| క్రియాకర్మ కారణ | అనంత ధర |
| భక్తమోతి కరసార | సుధర ధర ॥ శివ ॥ |
| శంకర శివశంకరా | శివశంభోమహదేవశంకర |

## 13. మహాదేవ శివశంకరశంభో

మహాదేవ శివశంకర శంభో ఉమాకాంత హరత్రిపురారే
మృత్యుంజయ వృషభధ్వజశూలిన్ గంగాధర మృడమదనారే ॥
హర శివ శంకర గౌరీశం వందే గంగాధరమీశమ్
రుద్రం పశుపతి మీశానం కలయే కాశీపురినాథమ్
జయశంభో జయశంభో శివ గౌరీశంకర జయశంభో ॥

## 14. హరహర శంభో గిరిజాబంధో

హరహరశంభో గిరిజాబంధో శివశివ శంకర భూతపతే

| | | | |
|---|---|---|---|
| భోలాశంకర భూతపతే | | గౌరీశంకర భూతపతే | |
| కామేశ్వరహర | " | పరమేశ్వరహర | " |
| గిరిజాశంకర | " | గంగాధరహర | " |
| గౌరీనాథ | " | చంద్రశేఖర | " |
| సాంబసదాశివా | " | శంభోసదాశివా | " |
| మహాదేవశివ | " | దేవాధిదేవ | " |
| కైలాసవాస | " | కేదారనాథ | " |
| ఓంకారేశ్వర భూతపతే" | | కాశీవిశ్వేశ్వర | భూతపతేహర |
| భువనేశ్వరహర | " | భీమేశ్వరశివ | " |
| శ్రీశైలేశ్వర | " | అరుణాచలశివ | " |
| రామేశ్వరశివ | " | కామేశ్వరశివ | " |

సాంబసదాశివ సాంబసదాశివ సాంబసదాశివ

## 15. గంగాధరా హరా గంగాధరా హరా

గంగాధరా హర గంగాధరా హర । గంగాధరా హర గంగాధరా
పరమ శివ శంకరా గంగాధరా జయ । జగదీశ మాం రక్ష గంగాధరా

భూత భయ సూదన గంగాధరా శూల । పాణే మహాదేవ గంగాధరా
మదనాంతక రుద్ర గంగాధరా జయ ॥ జగదీశగంగా ॥

హే వామదేవ జయ గంగాధరా పార్వ । తీ హృదయ వల్లభా గంగాధరా
భూతాధిపా శర్వ గంగాధరా జయ ॥ జగదీశగంగా ॥

హే విశ్వనాథ మృడ గంగాధరా పంచ । వక్త్ర అంధక రిపో గంగాధరా

ధూర్జటే పశుపతే గంగాధరా జయ ॥ జగదీశ గంగా ॥

ప్రమథ నాయక దేవ గంగాధరా శేష వలయ వృషభధ్వజ గంగాధరా ।
ప్రమథేశ లోకేశ గంగాధరా జయ ॥జగ॥

గిరిజాపతే విభో గంగాధరా వారణాసీపురపతే గంగాధరా
త్రిపుర సూదన భర్గ గంగాధరా జయ ॥ జగదీశ గంగా ॥

సర్వజ్ఞ సర్వేశ గంగాధరా సర్వ । హృదయైక నివాస గంగాధరా
దక్ష మఖ కాలహర గంగాధరా జయ ॥ జగదీశ గంగా ॥

శ్రీమన్మహేశ్వరా గంగాధరా కృపా । మయ గిరిశ శంకర గంగాధరా
నారాయణ ప్రియ గంగాధరా జయ ॥ జగదీశ గంగా ॥

విశ్వభవనాశక గంగాధరా విశ్వ । రూప విశ్వాత్మక గంగాధరా
విశ్వేశ శితికంఠ గంగాధరా జయ ॥ జగదీశ గంగా ॥

భస్మాంగ రాగహర గంగాదరా శక్తి । నాథ మృత్యుంజయ గంగాధరా
త్రిజగన్నివాస శివ గంగాధరా జయ ॥ జగదీశ గంగా ॥

గౌరీవిలాస భవ గంగాధరా దుఃఖ । దారిద్ర్య భయనాశ గంగాధరా
ఈశాన దిగ్వసన గంగాధరా జయ ॥ జగదీశ గంగా ॥

శ్రీ సోమనాథ శివ గంగాధరా సేతు । బంధేతు రామేశ గంగాధరా
అ వంతిక మహాకాల గంగాధరా జయ ॥ జగదీశ గంగా ॥

వారణాశి పురీశ్వరా గంగాధరా గౌత । మీతటే త్ర్యంబక గంగాధరా
కేదార ఘృషేశ గంగాధరా జయ ॥ జగదీశ గంగా ॥

జయ వైద్యనాథ శివ గంగాధరా భీమ । శంకరా నాగేశ గంగాధరా

శ్రీ మల్లికార్జున గంగాధరా జయ ॥ జగదీశ గంగా ॥

## 16. అరుణాచల పంచరత్నమ్

అరుణాచలశివ అరుణాచలశివ అరుణాచలశివ అరుణాచలా ।
కరుణా పూర్ణ సుదాబ్దే. కబళితఘన విశ్వరూప కిరణావల్యా

అరుణాచలపరమాత్మన్ అరుణోదయ చిత్తకంజసువికాసాయ ॥
త్వయ్యరుణాచల సర్వం భూత్వాస్థిత్వా ప్రలీన మేతచ్చిత్రం
హృద్యహమిత్యాత్మతయా నృత్యసి భోస్తే వదంతి హృదయంనామ ॥

అహమితికుత ఆయాతీ త్యన్విష్యాన్తః ప్రవిష్టయాऽత్యమల ధియా
అళగమ్య స్వంరూపం శామ్య త్యరుణాచల త్వయ నదీవా బ్ధౌ

త్యక్త్వా విషయం బాహ్యం రుద్ధ ప్రాణేన రుద్ధ మన సాంతస్త్వాం
ధ్యాయన్ పశ్యతి యోగి ధీదితి మరుణాచల త్వయి మహీయంతే ॥

త్వయ్యర్పిత మనసా త్వాం పశ్యన్ త్సర్వం తవాకృతి తయా సతతం
భజతే అనన్య ప్రీత్యా సజయ త్వరుణాచల త్వయి సుఖేమగ్నః ॥

శ్రీమద్రమణ మహర్షే ర్దర్శన మరుణా చలస్య దేవగిరా
పంచక మార్యా గీతౌరత్నం త్విద మౌపనిషదం హి ॥

## 17. అరుణాచల అక్షర మణమాల

ద్వి ॥ సాక్షా దరుణగిరీ శ్వరవరార్హ మగు । నక్షరమణమాల నమరించుటకును
గరుణాకరుండగు గణపతి యొసఁగి । కర మభయకరము, కాపాడుఁగాక.

అరుణాచలశివ - అరుణాచలశివ - అరుణాచలశివ - అరుణాచలా

అరుణాచల మనుచు స్మరియించువారల । యహము నిర్మూలింపు మరుణాచలా.
అళగు సుందరమువలెఁ జేరి నేను నీ । వుంద మభిన్నమై యరుణాచలా.
లో దూరి లాఁగి నీ లోగుహను జెఱగా । నమరించి తేమొకో యరుణాచలా.
ఎవరిఁకిగా నన్ను నేలితి, విడిచిన । నఖిలము నిందించు నరుణాచలా.
ఈ నింద తప్పు, ని న్నేటికిఁ దలపించి । తిఁక విడువా రెవ రరుణాచలా.
కనిన జననికన్న ఘనదయాదాయకా । ఇదియా యనుగ్రహ మరుణాచలా.
ని న్నేమార్చి యరుగనీక యల్లముపైని । నుఱుదిగా నుండుమా యరుణాచలా.
ఊరూరు తిరుగక యల్లము నిను గని । యణఁగ నీ ద్యుతిఁ జూపు మరుణాచలా.
నను జెఱచి యిపుడు ననుఁ గలియక విడు । టిది మగతన మొక్కొ యరుణాచలా.
ఏటి కీ నిదుర న న్నితరులు లాఁగఁగ । నిది నీకు న్యాయమా యరుణాచలా.

పంచేంద్రియఖలులు మదిలోన దూరుచో । మదిని నీ వుండవో యరుణాచలా.
ఒకఁడవౌ నిను మాయ మొనరించి వచ్చువా । రెవ, రిది నీజాల మరుణాచలా.
ఓంకారవాక్యార్థ యుత్త మసమహీన । ని న్నెవ రెఱుగు వా రరుణాచలా.
అవ్వఁబోలె నొసగి నాకు నీకరుణ, న । న్నేలుట నీభార మరుణాచలా.
కన్నుకుఁ గన్నయి కన్నులేక కను నిన్ । గనువా రెవరు, గను మరుణాచలా.
కాంత మినుముఁబలె గవిసి నిన్ విడువక । కలసి నాతో నుండు మరుణాచలా.
గిరిరూప మైనట్టి కరుణాసముద్రమా । కృపఁ జేసిన న్నేలు మరుణాచలా.
క్రింద మీఁదెటను జెన్నొందు కిరణమణి । నా క్రిందుగతి మాపు మరుణాచలా.
కుట్ర యంతయుఁ గోసి గుణముగఁ బాలించు । గురురూపమై వెలుఁగరుణాచలా.
కూచి వాల్గన్నుల కోతఁ బడక కృప । చేసి నిన్ జేరి కా వరుణాచలా.
వంచకా వేడియున్ గొంచెమున్ గరఁగవే । అభయ మం చేలుమా అరుణాచలా.
అడుగ కిచ్చెడు నీదు నకళంక మగుకీర్తి । హాని సేయక ప్రోవు మరుణాచలా.
హస్తామలక నీదు స్వరసమున సుఖో । న్మాద మొందగ నేలు మరుణాచలా.
వల నుంచి భక్తుల పరిమార్చు నిను గట్టు । కొని యెట్లు జీవింతు నరుణాచలా.
కోపరహితగుణ గుఱిగాఁగ నను గొను । కొఱ యేమి చేసితి నరుణాచలా.
గౌతమపూజిత కరుణాఘననగమా కడగంట నేలుమా యరుణాచలా.
సకలము కబళించు కరకాంతియిన మనో । జలజ మలర్పుమా అరుణాచలా.
తిండిని ని న్జేరి తిని తిన నానేను । శాంతమై పోవుదు నరుణాచలా.
మది చల్లపడ భద్రకర ముంచి యమృతనోర్ । తెఱు మనుగ్రహచంద్ర యరుణాచలా.
వన్నెను జెఱచి నిర్వాణ మొనర్చి కృ । పావన్నె నిడి బ్రోవు మరుణాచలా.
సుఖసముద్రము పొంగ వాఙ్మనము లడంగ । నూరక నమరు మం దరుణాచలా.
వంచింతు వేల నన్ శోధింప కిఁక నీదు । జ్యోతిరూపముఁ జూపు మరుణాచలా.
పదవిద్య గఱపి యీ భూమి మైకము వీడి । రూపగు విద్యఁజూ వరుణాచలా.
చేరకున్నను మేను నీరుగఁ గరఁగి క । న్నీటే రయి నశింతు నరుణాచలా.

ఛీ యని ద్రోసినఁ జేయుకర్మ తపన । గా కేది మనుమార్గ మరుణాచలా.
చెప్పక చెపి నీవు మౌనత నుండని । యూరక యుందువే యరుణాచలా.
సోమరి నైతిని మిన్నని సుఖనిద్ర । కన్న వే తెఱది గతి యరుణాచలా.
శౌర్యముఁ జూపితి శమియించె నని మాయఁ । జలియింప కున్నావు అరుణాచలా.
కుక్కకు న్నీచమే, నే నేగుఱుతుఁగొని । వెదకి ని న్జేరుదు నరుణాచలా.
జ్ఞానము లేక నీయాన దైన్యముఁ బాప । జ్ఞానముఁ దెల్పి బ్రో వరుణాచలా.
తేటివలెను నీవు వికసింప లేదని । యెదుట నిలుతు వేల యరుణాచలా.
తత్త్వ మెఱుఁగఁజాల నంతయై నిలుతువే । యిది యేమి తత్త్వమో యరుణాచలా
తా నేను దా నను తత్త్వ మిద్దానిని । తానుగాఁ జూపింతు వరుణాచలా.
త్రిప్పి యహంతను నెప్పుడు లోదృష్టిఁ । గనఁ దెలియు నను నదే యరుణాచలా
తీర ముండని యెద వెదకియు నిన్ను నేఁ । దిరిగి పొందితిఁబ్రోవు మరుణాచలా.
సత్య జ్ఞానములేని యీ జన్మఫల మేమి । యొప్పఁగ రా వేల యరుణాచలా.
శుద్ధవాఙ్మనయుతులం దోఁచు నీనిజా । హంత గల్పి ననుఁ బ్రో వరుణాచలా.
దైవ మనుచు నిన్ను దరిఁ జేరఁగా నన్ను । పూర్ణనాశ మొనర్చి తరుణాచలా.
వెదుకక గనిన సచ్ఛ్రీయనుగ్రహనిధీ । మది తెగుల్ తీర్చి బ్రో వరుణాచలా.
ధైర్యము పరుగిడు నీనిజాహ । మరయదే నాశమైతిఁ బ్రో వరుణాచలా.
తాఁకి కృపాకరము నను గలియకున్న । నిజము నశింతుఁ బ్రో వరుణాచలా.
దోషరహిత నీవు నాతొ నైక్యమయి । నిత్యానందమయ మొనర్పరుణాచలా.
నగకు నెడముకాదు ని న్వెదికిన నన్నుఁ । గను కృపానగ వేసి యరుణాచలా.
నాన లేదె వెదుక నే నయి నీ వొంటి । స్థానువై నిలిచితి వరుణాచలా.
నీజ్వాలఁగాల్చి నన్ నీఱుసేసెడు మున్నె । నీ కృప వర్షింపు మరుణాచలా.
నీవు నే నణఁగ నిత్యానందమయముగ । నిలుచుస్థితి కరుణిం వరుణాచలా.
అణురూప నిన్ను నే మిన్ను రూపుం జేర । భావోర్మ్ము లెపుడాఁగు నరుణాచలా.
సూత్రజ్ఞానములేని పామరు నామాయా । జ్ఞానము గోసి కా వరుణాచలా.

మక్కి మక్కి కరఁగి నే నిన్ను శరణంద । నగ్నుఁడవై నిల్చి తరుణాచలా.
నేస్త ముండని నాకు నీయాశఁ జూపి నన్ । మోసగింపక బ్రోవు మరుణాచలా.
నవసి చెడు ఫలము నం దేమి ఫల. మేరి । పక్వత లోఁగొను మరుణాచలా.
నొప్పింపకను నిన్ను నొసఁగి నన్ గొనలేదె । యంతకుఁడవు నాకు నరుణాచలా.
చూచి తించి మేనుం దాఁకించి పక్వము । చేసి నీ వేలి బ్రో వరుణాచలా.
మాయావిషము పట్టి తల కెక్కి చెకుమున్నె । కరుణప ట్టొసగి బ్రో వరుణాచలా.
కను కృపన్ మాయాంతముగఁ గృప గనవేని । గనునీ కెవరు చెప్ప టరుణాచలా.
పిచ్చి వీడ నినుబోల్ పిచ్చిఁ జేసితె దయన్ । పిచ్చని మాన్పు మం దరుణాచలా.
నిర్భితి నిను జేరు నిర్భితు నను జేర । భీతి నీకేలొకో యరుణాచలా.
అల్పజ్ఞాన మ దేది, సుజ్ఞాన మేదయా । ఐక్య మందఁకరుణిం పరుణాచలా.
భూ గంధ మగు మది పూర్ణగంధము గొనఁ । బూర్ణ గంధ మొసంగు మరుణాచలా
పేరు దలఁపఁగనే పట్టి లాఁగితివి । నీమహిమ కనుదు రెవ రరుణాచలా.
పోగ భూతము పోని భూతమై పట్టి నన్ । భూతగ్రస్తునిఁ జేసి తరుణాచలా.
మృదులతన్ నేఁ బ్రాపు లేక వాడఁగనీక । పట్టుకొమ్మయి కావు మరుణాచలా.
పొడిచే మయికపర్చి నాబోధ హరియించి । నీ బొధ గనుపించి తరుణాచలా.
పోఁకరాఁకలు లేని సమరంగ దివిఁజూపుమా । కృపాపొరాట మరుణాచలా.
భౌతికమౌ మేని పట్టార్చి యెపుడు । నీమహిమఁగనఁగరుణిం పరుణాచలా.
మల మందు నీవియ్య మలమగుటయో కృపాఉ।మల మందువై వెలుఁగరుణాచలా.
మానము గొని చేరు వారి మానముఁ బాపి । నిరభిమానత వెలుఉఁగరుణాచలా.
మించఁగా వేడెడు కించిజ్ఞుఁడను నను । వంచింపకను బ్రోవు మరుణాచలా.
నావికుఉఁ డుండక పెనుగాలి నలయు । నావను గాక కాచిబ్రో వరుణాచలా.
ముడిమాలముల్ గాన మునుకొంటవి సరిగ ।ముగియ భారము లేదొ యరుణాచలా.
ముక్కిడి మును జూపు ముకురము గాక నన్ । హెచ్చించి కౌఁగిలిం పరుణాచలా.
సత్యాహమున మనోమృదుపుష్పశయ్యపై । మే నల్గయఁ గరుణిం పరుణాచలా.

మీఁదు మీఁదుగ మ్రొక్కు భక్తులఁ జేరి । నీవందితే మేలిమి యరుణాచలా.

మైమై దణఁచి కృపాంజనమున నీసత్యవశ । మొనరించితి వరుణాచలా.

మొగ్గ పఱిపి నను బట్టబయట నీవు । నట్టాడు టేలొకో యరుణాచలా.

మోహము ద్రిప్పి నీమోహ మొనర్చి । నామోహము తీరదా యరుణాచలా.

మౌని యై రాయిగా నలరక యున్నచో । మౌన మిది యగునో యరుణాచలా.

ఎవరు నా నోటిలో మన్నును గొట్టి । నా బ్రతుకు హరించిన దరుణాచలా.

ఎవరు గనక నాదు మదిని మైకపరిచి । కొల్లగొనిన దెవ దరుణాచలా.

రమణుఁ డనుచు నంటి రోషము గొనక నన్ । రమియింపఁ జేయ రమ్మరుణాచలా.

రేయుంబవలు లేని బట్టబయటి యింట రమియింపగాఁ రమ్ము అరుణాచలా.

లక్ష్య ముంచి యనుగ్రహాస్త్రము వైచినన్ గబళించి తుసురుతో నరుణాచలా

లాభమీ విహపరలాభహీనునిఁ జేరి లాభ మే మందితీ వరుణాచలా

రమ్మని యనలేదె వచ్చి నావం తివ్వ వెఱకు నీ తలవిధి యరుణాచలా

ర మ్మని లో దూరి నీ జీవ మిడునాఁడె నా జీవమును బాసి తరుణాచలా

విడిచినఁ గష్టమౌ విడక ని న్నుసురును విడువ నన్నుగ్రహిం పరుణాచలా

ఇల్లు విడువ లాఁగి లోనింటిలోఁజొచ్చి యొగి నీదు నిలుఁ జూపి తరుణాచలా

వెలిపుచ్చితి న్నీదుసేత కినియక నీ కృప వెలిబుఁచ్చి కా వరుణాచలా

వేదాంతమున వేఱు లేక వెలింగెడు వేదపదమ బ్రోవు మరుణాచలా

నింద నాశీస్సుగాఁ గొని దయాపాత్రుఁగఁ జేసి విడక కావు మరుణాచలా

నీట హిమముగ ప్రేమాకారు నీలొ నన్ ప్రేమగ కరఁగి బ్రో వరుణాచలా

అరుణాద్రి యన నే కృపావలఁ బడితిఁద ప్పనె నీ కృపావల యరుణాచలా

చింతింప కృపపడ సాలీడువలెఁ గట్టి చెఱపెట్టి భక్షించి తరుణాచలా

ప్రేమతో నీనామ మాలించు భక్తభ క్తుల భక్తుఁగా బ్రోవు మరుణాచలా

ననుబోలు దీనుల నిం పొంద కాచుచుఁ జిరంజీవివై బ్రోవు మరుణాచలా

ఎముక లరుగు దాసు మృదువాక్కు వినుచెవిన్ గొనుమ నా యల్పోక్తు లరుణాచలా

క్షమలగల గిరి, యల్పవాక్కు సద్వాక్కుగఁ గొని కావు మఱి యిష్ట మరుణాచలా
మాలను దయచేసి యరుణాచలరమణ నా మాలఁ దాల్చి బ్రో వరుణాచలా
అరుణాచలశివ - అరుణాచలశివ - అరుణాచలశివ - అరుణాచలా !

మంగళ మరుణాచలమునకు - మంగళము భక్తశ్రేణికి
మంగళ మక్షరమణమాలకును - జయ.

## 18. పరమశివా మాంపాహి

ప్రభోశంభోదీనం విహిత శరణం త్వచ్చరణ యోః
భవారణ్యా దస్మాత్ విషయ విష ఆశీవిషవృతాత్

సముద్ధృత్య శ్రద్ధా విదురమపి బద్ధా దరకరం దయా దృష్ట్యా
పశ్యన్ నిజ తనయ మాత్మీకురు శివా ।

పరమశివా మాంపాహి, సదాశివా మాంపాహి, శంభోశివామాంపాహి
భోలాశివా మాంపాహి, ఉమాశివా మాంపాహి, శివామాంపాహి,
శంకరామాంపాహి

మాంపాహి, మాంపాహి,... అక్షయలింగా, అద్వయలింగా, అద్భుతలింగా,
ఆకాశలింగా, ఆత్మలింగా, అనంతలింగా,అవ్యయలింగా, ఆనందలింగా,
అమరలింగా, చిన్మయలింగా మాంపాహి॥

శ్లో ॥ శివోగరుః శివో దేవః శివో బంధు శ్శరీరిణామ్,
శివఆత్మా శివోజీవః శివాదన్యన్నకించన ॥

హరహర హరమాంపాహి, శివ శివ శివ మాంపాహి
సదా శంకర మాంపాహి, భోలాశంకర మాంపాహి, ఉమాశంకరమాంపాహి

గౌరీశంకర మంపాహి, శివా... మాంపాహి, శంకరా ... మాంపాహి,
హర హర హర మాంపాహి, శంకరా హర మాంపాహి, శంకరశివమాంపాహి

శివ శివ శివ శివ మాంపాహి, పరమ శివ మాంపాహి
పరమశివా, పరమశివా, పరమశివా మాంపాహి

## 19. మహాదేవ హర గంగాధర

శ్లో ॥ శివ శివేతి శివేతివ భవ భవేతి భవేతివ హర హరేతి హరేతివ భజమన
శ్శివమేవ నిరంతరం " చంద్రశేఖర చంద్రశేఖర చంద్రశేఖర రక్షమాం
చంద్రశేఖ చంద్రశేఖర చంద్రశేఖర పాహిమామ్ "

మహాదేవ హరగంగాధర శివశివ శివ చంద్రశేఖర, సంసార సార శివంకర
జలంధర శివోహర శంకర ! ॥ మ ॥

అభయంకర భవరోగ హర జయ జగదీశ్వర భోలాహర త్ర్యంబకేశ్వరా
మంగళకర పాలనేత్ర చంద్ర శేఖర । ॥ మ ॥

శ్రీ పార్వతీ పరమేశ్వర మీనాక్షి సుందరేశ్వర శ్రీకాళహస్తీశ్వర వర అన్నపూ
ర్ణేశ్వరా హర హర ॥ మ ॥

రుద్ర భయంకర గంభీర త్రినేత్ర కఠోర త్రిపురహర దక్షాధ్వరహర
త్రిశూలధర దుఃఖ హర సుఖకర దిగంబర ॥ మ ॥

సాంబ పార్వతీ మనోహర శంభో కపాల మాలాధర సురేష మహేష
పరమేశ్వర శాశ్వత పశుపతి గంగాధర ॥ ॥ మ ॥

వరప్రదా శశాంకశేఖర వీరభద్ర రుద్ర దిగంబర వ్యోమకేశజయ విశ్వేశ్వర
జయ విశ్వరూప విశ్వంబర । ॥ మ ॥

అక్షమాల ధర త్రిపుర హర వృషభధ్వజ చంద్రశేఖర శుభ్రజటాధర భువ
నేశ్వర శూలపాణి నాగేంద్ర హార " ॥ మహ ॥

## 20. శంకర శివా శంకర శివా

వందే శంభు ఉమాపతిమ్, సురగురుమ్, వందే పన్నగ భూషణం,
వందే పశూనామ్ పతిమ్, మృగధరమ్ (శశిధరమ్) వందే జగత్కారణం

వందే భక్త జనాశ్రయం చవరదమ్ వందే ముకుంద ప్రియం
వందే సూర్య శశాంక వహ్ని నయనమ్ వందే శివమ్ శంకరమ్

శివో గురుః శివో దేవః శివోబంధు శ్శరీణామ్ ।
శివ ఆత్మా శివో జీవః శివాదన్యన కించన

శంకర శివా శంకరశివా శంభో మహాదేవ శంకర శివా ।
హర హర హర హర శంకరశివా. శివ శివ శివ శివ శంకరశివా ॥ శం ॥
శివా..........శంకరశివా హరా........శంకరశివా ॥ శం॥

శంకరాశివ శంకరాశివా శంభో మహాదేవ శంకరాశివ

| | |
|---|---|
| శంకరశివ శంకర శివ ॥ శం ॥ | శంకరశివా శంకరశివా ॥ శం॥ |
| శంకరా.... శివా ॥ శం॥ | హరహరా. హర... ॥ శం॥ |
| శివశివా...హరహరా.. ॥ శం॥ | హరహరా.. శివశివా.. ॥ శం॥ |
| శివాశివా................. ॥ శం॥ | హరహరా " ॥ శం॥ |
| శివహర శివహర ॥ శం॥ | హరశివ హరశివ ॥ శం॥ |

## 21. రమ్యమైనది రామనామము

రామనామము రామనామము రమ్యమైనది రామనామము

1 శ్రీ మహాతత్వార్థ బోధ విశేషమైనది రామనామము, సోమసూర్యాగ్నులను మించిన స్వప్రకాశము రామనామము ॥ రా ॥

2. ఆత్మతపములు సలుపువారికి ఆత్మ యజ్ఞము రామనామము, ఆత్మజీవాత్మలును తానై ఆడుచున్నది రామనామము. ॥ రా ॥

3. మూడు మూర్తున జన్మభూమికి మూలదైవము రామనామము ఏడు వ్యసనములను హరించెడి యుద్ధ సూత్రము రామనామము ॥ రా ॥

4. మూడు గుణముల ప్రకృతి వికృతికి మూల కందము రామనామము ఏడుతత్వంబులకు నావల నెసగు చున్నది రామనామము. ॥ రా ॥

5. ఆత్మ భావము నెఱుక పరచెడి మార్గమే శ్రీరామనామము, ఆత్మానాత్మకమము తెలిపెడి సద్గురువుశ్రీరామనామము ॥ రా ॥

6. సకలలోకంబుల భరించెడి సత్యరూపము రామనామము, ప్రకట యోగీంద్రులకు నైనను పరమగోప్యము రామనామము. ॥ రా ॥

7. నారదాదిమునీంద్రులకు సంసారమైనది రామనామము, మారుతాత్మజ మనసులో పల మరిగి యున్నది రామనామము. ॥ రా ॥

8. జననమరణంబులను పొందని చదువు నేర్పును రామనామము చిన్మయంబై సృష్టికి విషేషమైనది రామనామము. ॥ రా ॥

9. జ్ఞాన దృష్ఠిని జూడ బరగిన మాననీయము రామనామము. లోన వెలుపల నిండియుండెడు జ్ఞాన దీపము రామనామము. ॥ రా ॥

10. నరకమును చీకటికి సదమల తరణిబింబము రామనామము పరమ గుహ్యము ధీ ప్రకాశము బ్రహ్మానాదము రామనామము. ॥ రా ॥

11. సర్వశబ్దంబులును తానై సాక్షియైనది రామనామము నిర్వికారము శుద్ధతత్వము నిర్మలము శ్రీరామనామము ॥ రా ॥

12. నిరుపమానము నిర్విశేషము నిష్కళంకము రామనామము పరమకల్యాణ ప్రదంబగు ప్రణవనాదము రామనామము. ॥ రా ॥

13. నిత్యముక్తికి నిత్యభుక్తికి సత్యవచనము రామనామము నత్యవాక్య ధురీణులకును సంసర్గమైనది రామనామము. ॥ రా ॥

14. అమృతపానము చేయుమునులకు అచలమైనది రామనామము అమృత వర్షము కురియు చుండెడు నభమౌ శ్రీరామ నామము. ॥ రా ॥

15. ధారణా యోగీంద్రులకును నిధానమైనది రామనామము ఘోరరోగవ నంబుల కును కుఠారమే శ్రీరామ నామము. ॥ రా ॥

16. తత్వమసివాక్యార్థమ నియెడితత్వమే శ్రీరామ నామము సాత్వికాదిగుణంబు ల కునిస్సంగమైనది రామనామము. ॥ రా ॥

17. ముక్తి కాంతా మణికినెప్పుడు ముదమోసంగును రామనామము భక్త వరులకు క్షేమకరమై ప్రబలుచున్నది రామనామము ॥ రా ॥

18. కామరాగాదులకు నంటని ధామమే శ్రీరామనామము సోమ సూత్ర విలంబు లోపల జ్యోతియే శ్రీరామ నామము ॥ రా ॥

19. రజతగిరి పతిసతికి నెప్పుడు రమ్యమైనది రామనామము సుజన పాలయ విలయములదా చేయుచుండును రామనామము ॥ రా ॥

20. గర్భ నరకములన్ని బాపెడి గానమే శ్రీరామ నామము భూర్భువాదిక లోకముల కును భూషణము శ్రీరామ నామము ॥ రా ॥

21. వేదచోదితమై వెలింగెడి విశ్వరూపము రామనామము వేదవాక్య ప్రమాణము లచెబాదుకొన్నది రామనామము ॥ రా ॥

22. బంధనంబుల నెల్ల ద్రుంచెడి ప్రకటయోగము రామనామము, అంధులై యున్నట్టి వారిల కందమైనది రామనామము. ॥ రా ॥

23. కపటయోగము చేతనెవరికి గానరానిది రామనామము, జపతోవ్రతయజ్ఞ ములచె చెప్పరానిది రామనామము ॥ రా ॥

24. సకల శుభములు సకల సుఖములు సత్కరించును రామనామము సకలమగు సంపదల నొసగును సంతతము శ్రీరామనామము ॥ రా ॥

25. అంతరింద్రియములకు నైనను సందు తెలియదు రామనామము అంతరింద్రియ నిగ్రహులకె యమరుచున్నది రామనామము. ॥ రా ॥

26. దుష్ట సంగములన్ని బాపెడి తుల్య రూపము రామనామము నిష్ప్రంచము నిర్మలత్వము నిత్యశుద్ధము రామనామము ॥ రా ॥

27. ద్వాదశాక్షరి శోడశాక్షరి బోధ చేయును రామనామము వేదములు - నాల్గింటికిని కను పాదుకొన్నది రామనామము ॥ రా ॥

28. ఉపనిషద్గోప్యంబు తానై యొప్పియున్నది రామనామము కృపణులై కనుగొనెడివారికి చపల చిత్తము రామనామము ॥ రా ॥

29. ఉపనిషత్సారాంశమునకు మహోత్సవము శ్రీరామనామము, జపతపస్స్వాధ్యాయ ములకును జన్మభూమియు రామనామము. ॥ రా ॥

30. కులము మతములులేని బుధులకు కోర్కెతీర్చును రామనామము సలలితంబుగ ప్రణవ రవమును వెలయ చేయును రామనామము ॥ రా ॥

31. కోటి కమలజ యజ్ఞ ఫలముల సాటియైనది రామనామము మాట మరచిన దూరర్శికి మంత్ర యోగము రామనామము

32. జన్మ దుఃఖబ్ధిని తరింపగ తరణియగు శ్రీరామనామము, చిన్మయాత్ముల కెల్ల కాలము తన్మయము శ్రీరామనామము

## 22. శ్రీరామ నామము ఎంతో మంచి మధురము

శ్రీరామ నామము ఎంతో మంచి మధురము
    మధురాతి మధురము మన కందె అమృతము ॥ శ్రీరామ ॥

తాటకి మర్దించి మునుల కాపాడిన నామము
    రాతిని నాతిగ చేసిన రమ్యమైన నామము ॥ శ్రీరామ ॥

రావాణాది రాక్షసులను వధియించిన నామము
    వాసిగ భద్రాచలమున వెలసియున్న నామము ॥ శ్రీరామ ॥
శ్రీరామ జయరామ జయ జయ రామ

## 23. అంతారామమయం

అంతారామమయం - బీజగమంతారామమయం ॥ అం ॥

రామరామ రామసీత ।

1. అంతరంగమున - నాత్మారాము
దనంతరూపమున - వింతలుసలుపగ ॥ అం ॥

2. సోమసూర్యులును - సురలుతారలును
ఆమహాంబుధులు - అవనీజంబులు ॥ అం ॥

3. అండాండంబులు - పిండాండంబులు
బ్రహ్మాండంబులు - బ్రహ్మలు మొదలుగ ॥ అం ॥

4. నదులు వనంబులు - నానా మృగములు
విదితకర్మములు - వేదశాస్త్రములు ॥ అం ॥

5. అష్టదిక్కులును - ఆది శేషుడును
అష్టవసువులును - నరిషడ్వర్గము ॥ అం ॥

6. ధీరుడుభద్రాచల - రామదాసు
కోరికలొసగెడి - తారకనామము ॥ అం ॥

## 24. ఎవరు దూషించిన నేమి

ఎవరు దూషించిన నేమి మెచ్చి ఎవరు భూషించిన నేమి
అవగుణము మానిపి ఆర్చేరా తీర్చేరా నవనీత చోరుడు నారాయణుడుండగ
॥ ఎవరు ॥

పిమ్మట నాడిననేమి మంచి ప్రియములు పలికిన నేమి
కొమ్మరో రమ్యని కోరిక లొసగెడు సమ్మతి నాపాలి సర్వేశుడుండగ
॥ ఎవరు ॥

వారి పంథము మాకేల వట్టి వాదుల తోడపోరేల
భాషించు వారితో పలుమారు పొందేలగాచి రక్షించెడు ఘనుడు రాముడుండగ
॥ ఎవరు ॥

అపరాధములనేంచువారు మాకు ఉపకారులై యున్నారు

విపరీత చరితలు వినుచును ఎల్లప్పుడు కపటనాటకధారి కనిపెట్టియుండగ
॥ ఎవరు ॥

వారివన్నెలు సల్పనేల మూడు వాసనలకు భ్రమయనేల
వాసిగ భద్రాద్రి వాసుడై నిరతము భాసురముగ రామదాసుడైయుండగ
॥ ఎవరు ॥

రామ రామ రామ సీత

## 25. రాముని వారము

రామునివారము మాకేమి విచారము స్వామి నీదే భారము
ఓ దాశరథి నీ వాధారము ॥ రా ॥

తెలిసి తెలియ నేరము నీదివ్యరూపము తలచిన మది పులకాంకితపూరము
॥ రా ॥

శ్రీరామ నామము చేయని వారలు జీవింప తలచుట భూ భారము
ఘోరాంధకారము సంసారము, ఇది భరియించి చూడగ నిస్సారము
శ్రీరాముని అవతారము మది చింతించుటె వ్యాపారము ॥ రా ॥

వైయ్యారమైన మాకల్యాణరాముని కమ్మని కథాగానమెగానము,
శబరిని బ్రోచిన చల్లని దేవుని చారిత్రమే సర్వమత సారము
ఆహా ఎంతో శృంగారము మా సీతేశుని యవతారము ॥ రా ॥

మారామచంద్రుని మహనీయమధునామ మధురామృతము గ్రోలుచున్నారము
ఇతరమేది కోరము మదిలో రఘుపతినే నమ్మి యున్నారము

అతి రాజన్యులచేరము మారాముని దాసులై నారము మదిరంజిల్లుచున్నారము
॥ రా ॥

రామ హరే కృష్ణ హరే, శ్రీరామ హరే శ్రీకృష్ణ హరె॥

## 26. శ్రీరామరక్షాస్తోత్రమ్

ధ్యాయే దాజానుబాహుం ధృతశరధనుషం బద్ధపద్మాసనస్థం
పీతం వాసో వసానం నవ కమల దలస్పర్థి నేత్రం ప్రసన్నమ్ !

వామాంకారూఢ సీతాముఖ కమల మిలల్లోచనం నీరదాభం
నానాలంకారదీ ప్తం దధత మురుజటామండలం రామచంద్రమ్ ॥

చరితం రఘునాథస్య శతకోటిప్రవిస్తరమ్ ।
ఏకైక మక్షరం ప్రోక్తం మహాపాతక నాశనమ్ ॥

ధ్యాత్వానీలోత్పలశ్యామం రామం రామం రాజీవలోచనమ్
జానకీలక్ష్మణోపేతం జటామకుటమణ్డితమ్

సాసితూణధనుర్బాణపాణిం నక్తంచరాన్తకమ్
స్వలీలయా జగత్రాతు మావిర్భూతమజం విభుమ్

రామరక్షాంపఠేత్ ప్రాజ్ఞః పాపఘ్నీం సర్వకామదామ్
శిరోమే రాఘవంః పాతు ఫాలం దశరథాత్మజః

కౌసల్యేయో దృశౌ పాతు విశ్వామిత్రప్రియః శ్రుతీ ।
ఘ్రాణం పాతు మఖత్రాతా ముఖం సౌమిత్రివత్సలః

జిహ్వాం విద్యానిధిః పాతు కంఠం భరతవందితః ।
స్కంధౌ దివ్యాయుధః పాతు భుజౌ భగ్నేశ కార్ముకః ॥

కరౌ సీతాపతిః పాతు హృదయం జామదగ్న్యజిత్ ।
మధ్యంపాతు ఖరధ్వంసీ నాభిం జాంబవదాశ్రయః

సుగ్రీవేశః కటీపాతు సక్థినీ హనుమత్ప్రభుః ।
ఊరూ రఘూత్తమః పాతు రక్షః కుల వినాశకృత్ ॥

జానునీ సేతుకృత్పాతు జంఘే దశముఖాన్తకః ।
పాదౌ విభీషణశ్రీదః పాతు రామోఽఖిలం వపుః ॥

ఏతాం రామబలోపేతాం రక్షాం యస్సుకృతీ పఠేత్ ।
సచిరాయు స్సుఖీ పుత్రీ విజయీ వినయీ భవేత్ ॥

పాతాళ భూతలవ్యోమ చారిణ శ్ఛద్మచారిణః ।
న ద్రష్టు మపి శక్తాస్తే రక్షితం రామనామభిః ॥

రామేతి రామభద్రేతి రామచంద్రేతివా స్మరన్ !
నరో నలిప్యతే పాపై ర్భుక్తిం ముక్తిం చ విన్దతి ॥

జగజ్జైత్రైక మంత్రేణ రామనామ్నాభిరక్షితమ్ ।
యః కంఠే ధారయే త్తస్య కరస్థాః సర్వసిద్ధయః ॥

వజ్రపఞ్జర నామేదం యో రామకవచం స్మరేత్ ।
అవ్యాహతాజ్ఞః సర్వత్ర లభతే జయమంగళమ్ ॥

ఆదిష్టవాన్ యథా స్వప్నే రామ రక్షా మిమాం హరః
తథా లిఖితవాన్ ప్రాప్తః ప్రబుద్ధో బుధకౌశికః ॥

ఆరామః కల్పవృక్షాణాం విరామః సకలాపదామ్ ।
అభిరామ స్త్రిలోకానాం రామః శ్రీమాన్ స నః ప్రభుః ॥

తరుణౌ రూపసంపన్నౌ సుకుమారౌ మహాబలౌ ।
పుండరీక విశాలాక్షౌ చీరకృష్ణాజినాంబరౌ ॥

ఫలమూలాశినౌ దాన్తౌ తాపసౌ బ్రహ్మచారిణౌ ।
పుత్రౌ దశరథస్యైతౌ భ్రాతరౌ రామలక్ష్మణౌ ॥

శరణ్యౌ సర్వసత్వానాం శ్రేష్ఠౌ సర్వధనుష్మతామ్ ।
రక్షః కులనిహంతారౌ త్రాయేతాం నో రఘూత్తమౌ ॥

ఆత్తసజ్జధనుషా విషుస్పృశా వక్షయాశుగ నిషంగసంగినౌ
రక్షణాయమమ రామలక్ష్మణా వగ్రతఃపథిసదైవగచ్ఛతామ్ ॥

సన్నద్ధః కవచీ ఖడ్గీ చాప బాణధరో యువా !
గచ్ఛన్ మనోరథాన్ నశ్చరామః పాతు సలక్ష్మణః ॥

రామోదాశరథి శ్శూరో లక్ష్మణానుచరో బలీ ।
కాకుత్స్థః పురుషః పూర్ణః కౌసల్యేయో రఘూత్తమః

వేద నవేద్యో యజ్ఞేశః పురాణపురుషోత్తమః ।
జానకీవల్లభః శ్రీమా నప్రమేయపరాక్రమః ॥

ఇత్యేతాని జపన్నిత్యం మద్భక్తః శ్రద్ధయాన్వితః ।
అశ్వమేధాధికం పుణ్యం సంప్రాప్నోతి నసంశయః ॥

రామం దూర్వాదలశ్యామం పద్మాక్షం పీతవాససం ।
స్తువన్తి నామభిర్దివ్యైర్నతే సంసారిణో నరాః ॥

రామంలక్ష్మణపూర్వజం రఘువీరం సీతాపతిం సుందరమ్
కాకుత్ స్థం కరుణార్ణవం గుణనిధిం విప్రప్రియం ధార్మికమ్ ।
రాజేన్ద్రం సత్యసంధం దశరథతతనయంశ్యామలంశా న్తమూర్తిం
వన్దే లోకాభిరామం రఘుకులతిలకం రాఘవం రావణారిమ్ ॥

రామాయ రామభద్రాయ రామచంద్రాయ వేధసే ।
రఘునాథాయ నాథాయ సీతాయాఃపతయే నమః ॥

శ్రీరామరామ రఘునందన రామరామ । శ్రీరామరామ భరతాగ్రజ రామరామ।
శ్రీరామరామ రణకర్కశ రామరామ । శ్రీరామరామ శరణం భవ రామరామ॥

శ్రీరామచంద్రచరణౌ మనసా స్మరామి। శ్రీరామచంద్రచరణౌ వచసా గృణామి।
శ్రీరామచంద్రచరణౌ శిరసా నమామి । శ్రీరామచంద్రచరణౌ శరణం ప్రపద్యే॥

మాతా రామో మత్పితా రామచంద్రః। స్వామీ రామో మత్సఖా రామచంద్రః
సర్వస్వం మే రామచంద్రో దయాళుః । నాన్యం జానే నైవజానే నజానే ॥

దక్షిణే లక్ష్మణో యస్య వామేచ జనకాత్మజా ।
పురతో మారుతి ర్యస్య తం వందే రఘునందనమ్ ॥

లోకాభిరామం రణరంగధీరం రాజీవనేత్రం రఘువంశనాథమ్ ।
కారుణ్యరూపం కరుణాకరం తంశ్రీరామచంద్రంశరణంప్రపద్యే ॥

మనోజవం మారుత తుల్యవేగం । జితేంద్రియం బుద్ధిమతాం వరిష్ఠం ।
వాతాత్మజం వానరయూథముఖ్యం । శ్రీరామదూతం శరణం ప్రపద్యే ॥

కూజన్తం రామరామేతి మధురం మధురాక్షరమ్ ।
ఆరుహ్య కవితాశాఖాం వన్దే వాల్మీకి కోకిలమ్ ॥

ఆపదా మపహర్తారం దాతారం సర్వసందామ్ ।
లోకాభిరామంశ్రీరామంభూయోభూయోనమామ్యహమ్ ॥

భర్జనం భవబీజానా మర్జనం గుణసంపదామ్ ।
తర్జనం యమదూతానాం రామరామేతి గర్జనమ్ ॥

రామో రాజమణి స్సదా విజయతే రామం రమేశం భజే
రామేణాభిహతా నిశాచర చమూ రామాయ తస్మైనమః ।

రామాన్నాస్తి పరాయణం పరతరంరామస్యదాసోఽస్మ్యహం
రామే చిత్తలయ స్సదాభవతు మే భోరామ మా ముద్ధర ॥

శ్రీరామ రామ రామేతి రమే రామే మనోరమే ।
సహస్రనామ తత్తుల్యం రామనామ వరాననే ॥

## 27. అబలోనసాని

అబలోనసాని అబలోన సైహం । రామకృపా భవని శాసెజాగే
జాగే ఫిర్ నిగసైహం రామా । అబలోనసాని అబలోన సైహం ॥ అబ ॥

పాయోనామ చారు చింతామణి ఉరతరుకేనకసైహం ।
శ్యామరూపరుచిశుచిరత శౌరి చిత్త కంచరణిక సైహం రామా ॥ అబ ॥

పరవశ జాని హసోయిన ఇంద్రియ నిజబసకైనహసైహం
మనమధుకర ప్రణతరి తులసి రఘుపతి పదకమల బసైహం ॥ అబ ॥

సాధకులకు ఇంద్రియాలు ఎక్కువ పరాభవము చేస్తూ వుంటాయి భగవత్ భజన చేయాలని తలంచినప్పుడెల్ల భహిర్ముఖములోనికి లాక్కొపోతుంటాయి. ఇంద్రియములు నాకు కళ్ళెము వేసి నన్ను గుఱ్ఱము చేసి ఆడిస్తూ వచ్చాయి. ఈ విధముగా నాకు ఎన్ని జన్మలనుండో యీ పరాభవము జరుగుచున్నది. నేడు శ్రీరామనుగ్రహముచేత ఆ విషయము నేను గుర్తించుకొంటిని. సంసారమనే రాత్రినుండి మేలుకొంటిని. ఇక నేను పొరబాటు చేతకూడా ఇంద్రియములకు లోబడను నవ్వులపాలుగాను. నా చిత్తమనె బంగారాన్ని ఎప్పుడు కూడా మెరుగు పెట్టుకొంటూ వుంటాను. బంగారాన్ని మెరుగు పెట్టేందుకు నల్లటి రాయి కావలెను. ఇక్కడ శ్యామ వర్ణముతో కూడినటువంటి ఆ శ్యామసుందరుని దేహాన్ని స్మరిస్తూ వుంటాను. ఇంక దేన్ని కూడా మనసులోనికి రానివ్వను. అప్పుడు నా చిత్తమనె బంగారము వన్నెకెక్కుతుంది. ఇంతవరకు ఇంద్రియములు నన్ను నానా యోనిలలో త్రిప్పిత్రిప్పి నవ్వులపాలు చేసినవి. కాని తులసీదాసు ప్రతిజ్ఞ చేసి రామచంద్ర పాదారవింద సాక్షిగా చెప్పుచున్నాను. ఇక మాత్రము ఇంద్రియములకు లోబడకుండా నిరంతరము రామనామమునే స్మరించుకొంటూ సంసారమనే రాత్రిలో పడకుండా వుంటాను.

## 28. శ్రీరామస్తవమ్

నమామి భక్తవత్సలం కృపాలు శీలు కోమలం ।
భజామి తే పదాంబుజం అకామినాం స్వధామదం ॥

నికామ శ్యామసుందరం భవాంబునాథ మందరం ।
ప్రఫుల్ల కంజలోచనం మదాదిదోషమోచనం ॥

ప్రలంబ బాహు విక్రమ ప్రభోఽప్రమేయ వైభవం ।
నిషంగ చాప సాయకం ధరం త్రిలోకనాయకం ॥

దినేస వంశ మండనం మహేస చాపఖండనం ।
మునీంద్ర సంత రంజనం సురారిబృంద భంజనం ॥

మనోజవైరి వందితం అజాది దేవసేవితం ।
విశుద్ధ బోధవిగ్రహం సమస్త దూషణాపహం ॥

నమామి ఇందిరాపతిం సుఖాకరం సతాంగతిం ।
భజే సశక్తి సానుజం శచీపతి ప్రియానుజం ॥

త్వదంఘ్రిమూల యే నరాః భజన్తి హీనమత్సరాః ।
పతంతి నో భవార్ణవే వితర్క వీచిసంకులే ॥

వివిక్తవాసినః సదా భజన్తి ముక్తయే ముదా !
నిరస్య ఇంద్రియాదికం ప్రయాన్తితే గతిం స్వకం ॥

తమేక మద్భుతం ప్రభుం నిరీహ మీశ్వరం విభుం ।
జగద్గురం చ శాశ్వతం తురీయ మేవ కేవలం ॥

భజామి భావవల్లభం కుయోగినాం సుదర్లభం ।
స్వభక్త కల్పపాదపం సమం సుసేవ్య మన్వహం ॥

అనూపరూప భూపతిం నతోఽహముర్విజాపతిం ।
ప్రసీద మే నమామి తే పదాబ్జ భక్తి దేహి మే ॥

పఠన్తియే స్తవం ఇదం నరాదరేణ తే పదం ।
వ్రజన్తి నాత్ర సంశయం త్వదీయభక్తి సంజుతాః ॥ శ్రీరామజయరామ

# 29. హరిహరనామసంకీర్తన

1. హరెకేశవ గోవింద - వాసుదేవ జగన్మయ,
శివశంకర రుద్రేశ - నీలకంఠ త్రిలోచన ॥ హ ॥

2. గోపాల ముకుంద మాధవ - గోపతి శ్రీదామోదర,
గౌరీపతి శివ శివ హర - దేవదేవ గంగాధర ॥ హ ॥

3. నారాయణ నారసింహ - నాగశయన శ్రీనటవర,
నాగేశ్వర నందీశ్వర - నటరాజ శివ మహేశ్వర ॥ హ ॥

4. చతుర్భుజ చిదానంద - చిన్మయ పీతాంబరధర'
చంద్రచూడ చండీశ్వర - చిన్మయ చర్మాంబరధర, ॥ హ ॥

5. పద్మనాభ పురుషోత్తమ - పాపహర జయ మురహర,
పంచానన ఫాలలోచన - పశుపతి శివ మృడ హరహర ॥ హ ॥

6. మధుసూదన మదనమోహన - మధువైరి మంగళకర,
మహాదేవ మహేశ్వర - మృత్యుంజయ భవభయహర ॥ హ ॥

7. కంబుకంఠ కైటభరిపు - కమలాక్ష కమలాకర,
కాలకంఠ కాలరిపు - కంజాక్ష కామేశ్వర, ॥ హ ॥

8. జయ పరేశ జగదీశ - సర్వేశ కేశినాశ,
జయమహేశ ప్రమథేశ - గిరిశేశ వ్యోమకేశ ॥ హ ॥

9. జయ జయ శ్రీహరి శౌరి - శంకచక్ర గదాధర,
జయ జయ జయ శ్రీశివ హర - ఖడ్గమాల డమరుధర ॥ హ ॥

10. శేషశయన జయ శుభాంగ - శాశ్వత శారంపాణి,
శంభో శశిశేఖర హర - శ్రీకంఠ పినాకపాణే ॥ హ ॥

11. విష్ణో వైకుంఠ వామన - శ్రీధర జయ జగదీశ్వర,
విశ్వంభర వీరభద్ర - విరూపాక్ష విశ్వేశ్వర ॥ హ ॥

12. సీతానాథ రాధానాథ - లక్ష్మీనాథ జగన్నాథ,
గంగానాథ గౌరీనాథ - దీనానాథ విశ్వనాథ ॥ హ ॥

## 30. ఐసో శ్రీరఘువీర భరోసో

ఐసో శ్రీరఘువీర భరోసా !
వారి న బోర సకహిఁప్రహ్లాదహిఁపావక నాహిఁజరోసో ॥

హిరనాకుశ బహు భాంతి సతాయో హతకర వైర కరోసో
మార్యోచహై దాస నరహరి కో ఆపై దుష్ట మరో సో ॥

జారీ లంక అంజనీనందన దేఖత పురసగరో సో
తాకే మధ్య విభీషణకే గృహ రామకృపావు భరోసో ॥

ద్రుపదసుతా కే చీర వుతారన రాజసమాజ గయోసో
ఐంచత ఐంచత భుజబలహారో కేక న అంగ టరో సో ॥

మీరా కేమారన కే కారన పఠియా జహర ఖరో సో
రామనామ అమృత భయొ తాకో హఁసిహఁసి పానకరోసో ॥

తులసిదాస విశ్వాస రామ కో జో నరనారి కరో సో
ఔర్ ప్రభావ కహఁ లగి వరణౌఁ సో యమరాజ డరో సో ॥

శ్రీరామచంద్రునిపై విశ్వాసభావమిట్టిది. తత్కారణముగ ప్రహ్లాదుని నీరు ముంపజాలక పోయెను. అగ్ని కాల్పలేకపోయెను. పట్టుదలతో వైరము వహించి హిరణ్యకశిపు డాతని పలువిధముల బాధించెను. ఆ నృసింహభక్తుని సంహరింప సంకల్పించుకొని స్వయముగా తానే సంహరింపబడెను. హనుమంతుడు యెల్లవారును జూచుచుండ లంకానగరమును గాల్చివైచెను. శ్రీరామునిపైగల విశ్వాసము కారణముగానే విభీషణుని గృహమొక్కటి మాత్రము తగులబడకుండ సురక్షితముగ నిలువగలిగెను. ద్రౌపది వస్త్రముల నపహరింపదలఁచి యామెను రాజసమాజములోనికిఁ రావించిరి. దుశ్శాసను డామె వలువలను ఒలిచి యెలిచి విసిగిపోయెను. కాని యామెకుఁ దేవునిపైగల విశ్వాసము కారణముగ యామెయొడలిపై నుండి వస్త్రము కొంచెమైనను తొలగలేదు. మీరాబాయి భర్త యామెను సంహరింపదలఁచి స్వచ్ఛమైన విషమునుఁ బంపెను. ఆమె చిరునవ్వు నవ్వుచు యా విషమును త్రాగివైచెను. ఆమెకుఁగల దైవవిశ్వాసకారణముగ నది యమృతమయ్యెను. దీని ప్రభావమెంతని వర్ణింతును. శ్రీరామచంద్రునిపై నే స్త్రీ పురుషులు విశ్వాసభావము వహింతురో వారినిఁజూచి యమధర్మరాజుగూడ గడగడలాడును.

## 31. రామరతనధనపాయో

రామరతన ధన పాయొ పాయో జీ మైనే
వస్తుఅమోలక్ దీజొమ్హారెసత్ గురు కిరపా కరి అపనాయో ॥

జనమ జనమ కీ పుంజీ పాయీ జగ మే సభీ ఖోవాయొ
ఖరచై నహిం చోరు నాలేవై దిన దిన బఢత సవాయొ ॥

సతకీ నావ కేవటియా సత్ గురు భవసాగర తర జాయో
మీరా కే ప్రభు గిరిధర నాగర హరఖహరఖ యశ గాయో ॥

నేను రాముడనే రత్నధనమునుఁ బడసితిని. ఈ యమూల్యవస్తువును సద్గురువు నన్ను తనవానినిగా జేసికొనినాపై కరుణజూపి నా కొసగినాడు. అనేక జన్మములందు కూడబెట్టుకొనుచు వచ్చిన నిధినీనాడు వడసితిని. లోకమునందలి ధనమును యెల్లరును. పోగొట్టుకొనువారలేగాని నిలిపు కొనగలవారులేరు. నాయీ ధనము ఖర్చుసేయఁబడనిది. చోరు లపహరింపజాలనిది. దినదినము వృద్ధిపొందు నది. ఆనందపూర్వకముగా మీరాబాయి ప్రభువగు గిరిధర గోపాలుని కీర్తిని గానముఁ జేసినచో సత్యస్వరూపుఁడఁగు భగవంతుడు నావకాగా సద్గురువు నావికుడుకాగా సంసారసముద్రమును తరించి పోవచ్చును.

## 32. రామజవు రామజవు భావరే

రామ జపు రామ జపు రామ జపు బావరే
ఘోర భవనీరనిధి నామ నిజ నావరే ॥ రామ ॥

1. ఏక హీ సాధన సబ రిధి సిధి సాధిరే
గ్రసే కలిరోగ జోగ సంజమ సమాధిరే ॥ రామ ॥

2. భలో జోహై పోచ జోహై దాహి నో జోవామరే
రామ నామ హీ సోఁ అంత సబ హి కో కామరే ॥ రామ ॥

3. జగ నభ వాటికా రహీ హై ఫలిఫూలి రే
ధువాఁ కైసే ధౌరహర దేఖితూ న భూలిరే ॥ రామ ॥

4. రామనామ ఛాడి జో భరోసా కరై ఔరరే
తులసీ పరోసా త్యాగి మాంగై కూర కౌరరే ॥ రామ ॥

ఓరి పిచ్చివాడా! రామనామమునుఁ జపింపుము. జపింపుము. జపింపుము. జపింపుము. భయంకరమైన సంసార సముద్రమును దాటుటకు రామ నామమే తగిన నౌక. ఈ యొక్క సాధనముననే యెల్లబుద్ధిసిద్ధులను సాధించికొనుము. ఏలయనిన యోగము, సంయమము, సమాధి మున్నగు సాధనములను యీ కలికాలమనెడి రోగము గ్రహించివైచినది. మంచి వాడు కానిమ్ము, చెడ్డవాడు కానిమ్ము, యనుకూలుడుకానిమ్ము - ప్రతి కూలుడుకానిమ్ము ఎల్లరకును రామనామమే శరణము. ఈ జగత్తు భ్రాంతి చేత యాకాశమునందు పుష్పించినట్టులుగా కానవచ్చెడి పూలతోటవలె కల్లయైనది. ధూమమువలన నేర్పడెడి భవనములవలె క్షణ క్షణమున కన్పడుచు నంతరించుచునుండునది. కావున నీ సాంసారిక పదార్థములనుఁ జూచి పొరపడవలదుసుమా! ఎవరు రామనామమును విడిచి యన్యము నాశ్రయింతురో వారు సిద్ధముగా వడ్డింపబడిన యన్నమును విడిచి యొక్కొక్క కబళము కొరకై కుక్కవలె యిల్లిల్లు తిరుగు మూర్ఖులతో సమానులు.

## 33. రామ రామ రామజపు

రామ రామ జపు జియ సదా సానురాగరే
కలిన బిరాగ జోగ జాగ తప త్యాగరే ॥ రామ ॥

1. రామ సుమిరత సబ విధి హీ కో రాజ రే
రామ కో బిసారిబో నిషేధ సిరతాజ రే ॥ రామ ॥

2. రామ నామ మహామని ఫని జగజాల రే
మని లియే ఫని జియై బ్యాకుల బిహాల రే ॥ రామ ॥

3. రామ నామ కామతరు దేత ఫల చారి రే
కహత పురాన వేదపండిత పురారి రే ॥ రామ ॥

4. రామ నామ ప్రేమపరమారథ కో సార రే
రామ నామ తులసీకో జీవన అధార రే ॥ రామ ॥

సీతారామ సీతారమ । రామరామ సీతారామ

ఓ జీవుడా ! యెల్లపుడు ననన్యప్రేమభావముతో రామనామమును జపించుచుండుము. ఈ కలికాలమున నదియొక్కటియే మేలొనరించు సాధనము.

వైరాగ్యము వలన, యోగసాధనవలన, యజ్ఞమువలన, తపముల వలన దానముల వలన ప్రయోజనములేదు. శాస్త్రమునందు విధి నిషేధముల రూపమున పెక్కు కర్మములు చెప్పబడియున్నవి. కాని నా యభిప్రాయ ప్రకారము రామనామమును స్మరించుటయే యెల్ల విధులందు నెన్నదగిన రాజవీధి. రామ నామమును మరచిపోవుటయే మిక్కిలి నిషిద్ధ ధర్మము. రామనామము మహామణితుల్యమైనది. జగజ్జాలము మహాసర్పతుల్యమైనది. మణినిగ్రహించిన సర్పము వ్యాకులతచెంది చనిపోవును. అట్లే రామనామమణిని గ్రహించిన జగజ్జాలమను సర్పము తనయంత దాను నశించిపోవును. ఓరి సాధకుడా ! యీ రామనామము కల్పవృక్షమనియు యిది చతుర్విధపురుషార్థముల నొసంగునదనియు వేదములు, పురాణములు, పండితులు, స్వయముగా శంకరుడును చెప్పియున్నారు. రామనామము ప్రేమము యొక్కయు, పరమార్థముయొక్కయు సారము. ఈ రామ నామమే యీ తులసీ దాసునకు జీవనాధారమైనది.

## 34. రామ నామ రసపీజై

1. రామ నామ రస పీజై, మనువాఁ రామ నామ రసపీ జై ॥
2. తజి కుసంగ సతసంగ బైఠి నిత, హరి చరచా సునిలీజై ॥
3. కామ క్రోధ మద లోభ మోహకూఁ, బహాచిత్తసేదీజై ।
4. మీరాకే ప్రభు గిరిధర నాగర, తాహి కే రంగమేఁభీజై ॥

మనస్సా ! రామనామరసము గ్రోలుము. రామనామ రసమును గ్రోలుము, దుర్జన సాంగత్యమును విడిచి, సజ్జన సాంగత్యము నవలంబించి హరిచర్చ నాలకింపుము. కామ, క్రోధ, లోభ, మోహ, మదాదులను మనస్సునుండి తొలగించి వేయుము. మీరాబాయి ప్రభువగు గిరిధర గోపాలుని నామస్మరణమువలని యానందసారమున, యానంద రసమున మునిగితేలుము.

## 35. జాకే ప్రియన రామ వైదేహి

జాకే ప్రియన రామ వైదేహీ
తజియే తాహి కోటి వైరీ సమ జద్యపి పరమ సనేహీ ॥

1. తజ్యో పితా ప్రహ్లాద విభీషణ బంధు భరత మహతారీ
బలి గురు తజ్యోకంత వ్రజవనితని భే సబ మంగళకారీ ॥ జా ॥

2. నాతో నేహ రామసోఁమనిఅత సుహృదసుసేవ్యజహాఁలౌఁ ।
అంజనకహా ఆంఖ్ జోఫూటే, బహుతక కహౌఁకహాలౌఁ ॥
తులసి సో సబ భాఁతి పరమహిత పూజ్య ప్రాన తే ప్యారే
జాసోఁహోఇస నేహ రామపద ఏతౌ మతౌ హమారే ॥ జా ॥

ఎవనికి సీతారాములు హితులుకారో వానిని కోటిశత్రులతో తుల్యునిగా తలపోసి విడనాడుము, ఈ విధముగా ప్రహ్లాదుడు తన తండ్రిని, విభీషణుడు తన యన్నను, భరతుడు తన తల్లిని, బలిచక్రవర్తి తన గురువును గోపికలు తమ పతులను భగవత్ ప్రాప్తికి యడ్డుతగులువారని యెంచి విడనాడిరి. మీరెల్లరును యానందదాయకులు, కళ్యాణకారకులైరి. లోకమున నెందఱు సుహృదులు. పూజ్యులును గలరో వారెల్లరును శ్రీరామునితోడి సంబంధమువలన ఆతని యెడల ననురాగము కలిగియుండుటవలన నట్టియున్నతస్థితిని పొందిరి. ఎక్కువగా నెంతయని వర్ణింతును, కంటికి పెట్టుకొన్నంత నీకన్నులను పొగొట్టు కాటుకవలన ప్రయోజనమేమి? తులసీదాసా! యెూవనిమూలమున శ్రీరామచంద్ర చరణారవిందములం దనురాగ ముదయించునో యాతడే సర్వవిధముల పరమహితకారి, పూజనీయుడు, ప్రాణాధిక ప్రియుడ నని నేను నమ్ముచున్నాను.

## 36. భజోరే భయ్యా రామగోవింద హరి

భజోరే భయ్యా రామగోవింద హరి ॥ భరీజో ॥

1. జప తప సాధన కచు నహిఁ లాగత ఖరచత నహీఁగరరీ ।

2. సంతతి సంపతి సుఖికే కారణ జాసోఁ భూల పరీ ॥ భజో ॥
కహత కబీరా జా ముఖ రామనహిఁ వా ముఖధూల పరీ ॥"

సోదరా! రామా! గోవిందా హరీ! యని దేవుని భజింపుము. జపము, తపము, మున్నగు సాధనముల నవలంబింప నక్కఱలేదు. పెట్టుబడి యక్కఱలేదు. నీ మాటలోని దేదియు ఖర్చుగాదు. సంతానము, సంపదయు, సుఖము కారణముగా నా భగవంతుని మఱచి పోవుట సంభవించు చున్నది. కబీరు చెప్పుచున్నాడు వినుము. రామనామము స్మరింపని నోట మట్టియే పడునది.

## 37. జాగియె కృపానిధాన

జాగియె కృపానిధాన ప్రాణనాథ రామచంద్ర
చంద్రకిరణ సీతల భయె చక ఈ పియ మిలన గయె
త్రివిధ మంద చలత పవన పల్లవ ద్రుమ డోలై ॥ జా ॥

ప్రాతభాను ప్రగట భయె రజనీ - కో తిమిర గయొ
భృంగకరత గుంజగాన కమలన దళ ఖోలో ॥ జా ॥

బ్రహ్మాదిక ధరత ధ్యాన సురనరముని కరత గాన
జాగనకీ బేరభయీ నయన పలక ఖోలో ॥ జా ॥

తులసిదాస అతి ఆనంద నిరఖికే ముఖారవింద
దీననకో దేత దాన భూషన అనమోలై ॥ జా ॥

కరుణానిధానుడవు ప్రాణనాథుడవు నగు నో రామచంద్రా ! మేలుకొనుము. చంద్రుని కిరణముల కాంతి క్షీణించినది. చక్రవాకము తన ప్రియుని గలసికొనుటకు వెడలినది. మంద మందమై పరిమళపూరితమైచల్లని వాయువు వీచుచున్నది. చెట్లు, చెట్లయాకులును గదలాడుచున్నవి. ప్రాతః కాలమైనది. సూర్యుడుదయించినాడు, చీకటి అంతరించినది. తుమ్మెదల రొదలు చేయుచున్నవి. తామర పుష్పములు విడబారుచున్నవి. బ్రహ్మాదులు ధ్యానము చేయుచున్నారు. సురలు, నరులు, మునులును గానము చేయుచున్నారు. మేలుకొనదగిన వేళయైనది. కన్నులు తెఱువుము. తులసీదాసు నీ ముఖారవిందమును చూచి యపరిమితానందము నొంది దీనులకు అమూల్యభూషణములను దానము చేయుచున్నాడు.

## 38. శ్రీరామచంద్ర కృపాలు భజు మన

శ్రీరామచంద్ర కృపాలు భజు మన । హరణ భవభయ దారుణం,
నవకంజ, లోచన, కంజముఖ । కరకంజ, పదకంజారుణం ॥ శ్రీ ॥

1. కందర్ప అగణిత అమిత ఛవి, । నవనీల నీరద సుందరం
పట పీత మానహు తడిత రుచి । శుచి నౌమి జనకసుతావరం ॥ శ్రీ ॥

2. భజు దీనబంధు దినేశ దానవ । దైత్యవంశ నికందనం
రఘునంద ఆనందకంద కోశల । చంద దశరథ నందనం ॥ శ్రీ ॥

3. సిర ముకుట కుండల తిలక చారు । ఉదారు అంగ విభూషణం
ఆజానుభుజ శరచాపధర సంగ్రామ । జిత ఖరదూషణం ॥ శ్రీ ॥

4. ఇతి వదతి తులసీదాస శంకర । శేష ముని మన రంజనం
మమ హృదయ కంజ నివాస కురు ,। కామాది ఖలదల గంజనం॥ శ్రీ ॥

సీతారామ సీతారామ సీతారామ సీతారామ

మనసా ! కృపాళుడును, భవభయములను పార్రదోలువాడును. క్రొత్త కమలములవంటి కన్నులు కలవాడును. పద్మములవంటి ముఖము గలవాడును. పద్మములవంటి చేతులుకలవాడును, ఎఱ్ఱని తామర పూవుల వంటి పాదముల గలవాడును నగు శ్రీరామచంద్రుని భజింపుము.

లెక్కలేనంతమంది మన్మథులను మించిన సౌందర్యముకలవాడును, క్రొక్కారుమేఘమువలె నల్లనై సుందరమైనవాడును, మెఱపు యొక్క కాంతివంటి కాంతికల పీతాంబరమును ధరించినవాడును, పవిత్రుడును, సీతాపతియునగు శ్రీరామచంద్రునకు నమస్కరించుచున్నాను.

దాసులపాలిటి బంధువును, రాక్షసవంశమును నాశనమొనరించిన వాడును, రఘువంశమున బుట్టినవాడును, ఆనందకందుడును, కోసలాధిపతియగు దశరథు తనయుడునగు శ్రీరామచంద్రుని సేవింపుము.

శిరమున గిరీటము, చెవులకు గుండలములు, మొగమున నందమైన తిలకము గలవాడును, ఉదారుడును, శరీరముపై వివిధాభరణములు గల వాడును, ఆజానుబాహుఁడును, విల్లమ్ములు దాల్చినవాడును, యుద్ధములో ఖర దూషనులను జయించినవాడునగు శ్రీరామచంద్రుని సేవింపుము.

శంకరుని, ఆదిశేషుని, మహర్షుల మనస్సులను రంజింపజేయువాడవును, కామక్రోధాదులగునంతర్ శ్శత్రువుల నంత మొందించువాడవును నగు నో రామా! నీవు సదా నా హృదయకమలమునందు నివసింపుము. అని తులసీదాసు రాముని ప్రార్థించు చున్నాడు.

## 39. శ్రీరామహరే సుఖధామహరే

శ్రీరామ హరే సుఖధామహరే - సీతాపతి రాఘవరామహరే ॥
గోవిందహరే గోపాలహరే జయజయప్రభు దీనదయాళు హరే ॥

1. దశరథనందన రామహరే జయ్ । నందనందన శ్యామహరే ॥ శ్రీ ॥
2. కౌసల్యాసుత రామహరే । యశోదానందన శ్యామహరే ॥ శ్రీ ॥
3. జానకీజీవన రామహరే । రాధామనమోహన శ్యామహరే ॥ శ్రీ ॥
4. మనమోహన సుందరశ్యామహరే । ఘనశ్యామహరే ఘనశ్యామహరే॥ శ్రీ ॥
5. జయతు ఖరారీ రామహరే । జయతు మురారీ శ్యామహరే ॥ శ్రీ ॥

6. శ్రీకృష్ణహరే గోవిందహరే । జయజయ గిరిధర గోపాలహరే ॥ శ్రీ ॥

7. జయ దుఃఖహరీ రామహరే । జయ సుఖకారీ శ్యామహరే ॥ శ్రీ ॥

8. మనమోహన సుందర రామహరే । జయ జగమోహన శ్యామహరే ॥ శ్రీ ॥

9. విపినవిహారీ రామహరే । గోవర్థనధారీ శ్యామహరే ॥ శ్రీ ॥

10. సీతారామహరే రాధేశ్యామహరే । రాధేశ్యామహరే సీతారామహరే॥ శ్రీ ॥

11. రమాచ్యుత సీతారామహరే । రాధిక కృష్ణ శ్యామహరే ॥ శ్రీ ॥

## 40. శ్రీరామ జయ రామ జయజయరామ

1. శ్రీరామ జయ రామ జయజయరామ । ఓరామ ఓరామ ఓంకారరామ ।శ్రీ।

2. ఆనంద ఘనరామ ఆయోధ్యరామ । అయోధ్యరామ అరిజనభీమ । శ్రీ ।

3. దయజూచి మమ్మేలు దశరథ రామ । దశరథరామ దానవభీమ । శ్రీ ।

4. దాసపోషక రామ దైవలలామ । దైవలలామ దశరథరామ । శ్రీ ।

5. పతితపావననామ పట్టాభిరామ । పట్టాభిరామ పావననామ । శ్రీ ।

6. భవభయనాశన భద్రాద్రిరామ । భద్రాద్రిరామ భండనభీమ । శ్రీ ।

7. చారుసుందర రామ జానకీరామ । జానకీరామ జయ రణభీమ । శ్రీ ।

## 41. సీతాపతే రామ సీతాపతే రామ

సీతాపతే రామ సీతాపతే రామ । సీతాపతే రామ సీతాపతే
పతితపావన నామ సీతాపతే రామ । రామ తారక నామ సీతాపతే॥ సీతా ॥

శ్రీ జానకీ రమణ సీతాపతే నీల । నీరద ఘన శ్యామ సీతాపతే
నళిన దళ లోచన సీతాపతే రామ ॥ రామ సీతా ॥

శ్రీరామ జయరామ సీతాపతే జయ । జయరామ శ్రీరామ సీతాపతే
శ్రీరామ రామ రామ సీతాపతే రామ ॥ రామ॥ సీతా ॥

భానుకుల మండన సీతాపతే దాశరథె దయా శరిధి సీతాపతే
కౌసల్య ప్రియసుత సీతాపతే రామ ॥ రామ॥ సీతా ॥

అహల్యోద్ధారక సీతాపతే హర । కోదండ ఖండన సీతాపతే
జనక - జామాత సీతాపతేరామ ॥ రామ॥ సీతా ॥

సర్వాఘ నాశన సీతాపతే పుణ్య । చారిత్ర కీర్తన సీతాపతే
శ్యామాంగ సుందర సీతాపతే రామ ॥ రామ॥ సీతా ॥

రామచంద్ర కృపాళు సీతాపతే దీన । ముఖ కంజ లోచన సీతాపతే
భక్తవత్సల రామ సీతాపతే రామ ॥ రామ ॥ సీతా ॥

కరకంజ పదకంజ సీతాపతే కంజ । బంధు రఘునందన సీతాపతే
భక్తవత్సల రామ సీతాపతే రామ ॥ రామ ॥ సీతా ॥

రఘువంశ జలధి శశి సీతాపతే ప్రాణ । నాథ భరతాగ్రజ సీతాపతే
సౌమిత్ర వత్సల సీతాపతే రామ ॥ రామ ॥ సీతా ॥

విరాధ వధ పండిత సీతాపతే దండ । కారణ్య పుణ్యకృత సీతాపతే
హనుమదాశ్రిత రామ సీతాపతే రామ ॥ రామ ॥ సీతా ॥

సుగ్రీవ మైత్రి కృత సీతాపతే భక్త । విభీషణ శరణద సీతాపతే
రావణాంతక రామ సీతాపతే రామ ॥ రామ ॥ సీతా ॥

జయ మత్స్య జయ కూర్మ సీతాపతే జయ । జయ వరాహ నృసింహ సీతాపతే
జయ జయ త్రివిక్రమ సీతాపతే రామ ॥ రామ ॥ సీతా ॥

జయరామ జయరామ సీతాపతే జయ । జయ జయ శ్రీకృష్ణ సీతాపతే
జయ బుద్ధ జయ కల్కి సీతాపతే రామ ॥ రామ ॥ సీతా ॥

భద్రాద్రి రఘురామ సీతాపతే భక్త । వాఞ్ఛ కల్పతరువు సీతాపతే
వానర సేవిత సీతాపతే రామ ॥ రామ ॥ సీతా ॥

శ్రీరామ రక్ష జయ సీతాపతే జగ । ద్రక్ష ధర్మాధ్యక్ష సీతాపతే
ప్రణత జన పరిరక్ష సీతాపతే రామ ॥ రామ ॥ సీతా ॥

రామ, రక్షా అసుర శిక్ష సీతాపతే రామ । రక్ష ఆశ్రిత రక్ష సీతాపతే
భక్త భవ బంధన సీతాపతే రామ ॥ రామ ॥ సీతా ॥

జయ జగత్కారణ సీతాపతే జయ । జయ జయ జగద్రూప సీతాపతే
జగద్గురు జనార్దన సీతాపతే ॥ రామ ॥ సీతా ॥

సచ్చిదానంద మయ సీతాపతే అద్వ । య బ్రహ్మ సనాతన సీతాపతే
అమృత మయ చిన్మయసీతాపతే రామ ॥ రామ ॥ సీతా ॥

సర్వ, దుఃఖాప హారక సీతాపతే సర్వ । సంతాప నాశక సీతాపతే
సర్వ, సంశయచ్ఛేదక సీతాపతే రామ ॥ రామ ॥ సీతా ॥

అ జ్ఞాన బంధన హర సీతాపతే । అంతర్బాహ్య - వ్యాపక సీతాపతే
అవాంగ్మనోగోచరా సీతాపతే రామ ॥ రామ ॥ సీతా ॥

జయ జయ పరానంద సీతాపతే జయ । జయ కేవలానందసీతాపతే
జయ నిర్మలా నంద సీతాపతే రామ ॥ రామ ॥ సీతా ॥

రామ రామ నృసింహ సీతాపతే రమ్య । గుణసాంద్ర కోమలా సీతాపతే
రామ మారుతి రామసీతాపతే రామ ॥ రామ ॥ సీతా ॥

రాజ రాజేశ్వరా సీతాపతే కోటి । కందర్ప సుందరా సీతాపతే
సర్వపుణ్యా కరా సీతాపతే రామ ॥ రామ ॥ సీతా ॥

పాప హార మురహర సీతాపతే పద్మ । నాభ పురుషోత్తమ సీతాపతే
పీత, వసనాం బుద నీల సీతాపతే రామ ॥ రామ ॥ సీతా ॥

పుండరీ కాక్ష జయ సీతాపతే పుణ్య । చారిత్ర కీర్తన సీతాపతే
పురందర పూతాత్మ సీతాపతే రామ ॥ రామ ॥ సీతా ॥

అవ్యయ అక్షర సీతాపతే అజిత । అమిత విక్రమ రామ సీతాపతే
అనిర్విణ్ణానంద సీతాపతే రామ ॥ రామ ॥ సీతా ॥

## 42. రామనామకె అంక

అద్భుత రామనామ కే అంక
ధర్మ అంకుర కే పావన ద్వైదల ముక్తి వధూతాటంక ॥

మునిమన హంసపచ్ఛజుగ జాకై బలఉడి ఊరధ జాత
జనమ మరణ కాటన కౌ కర్తరి తీఛన బహు విక్యాత ॥

అంధకార అజ్ఞాన హరన కౌరవి శశి జుగల ప్రకాస
వాసర నిసి దౌవు కరై ప్రకాసిత మహాకుమగ అనయాస ॥

దుహు లోకసుఖ కరన హరనదుక వేదపురానని సాఖి
భక్తిజ్ఞాన కే పంథ సూర యే ప్రేమ నిరంతర భాఖి ॥

రామ నామమునందలి రెండక్షరములును అద్భుతమైనవి. భూమి నుండి ఏ అంకురము పుట్టినను మొదట దానికి రెండు చిన్న చిన్న ఆకులుండును. ఆ యాకులతోడనే ఆహారమును సంపాదించి ఆ యంకురము వృద్ధిచెందును. అందుచే అంకురమును బోషించి పెంచుటలో మొదట రెండు ఆకులకును మిక్కిలి ప్రాధాన్యత కలదు. ధర్మ మనెడు అంకురమునకు రామనామమునందలి రెండక్షరము లును పైనఁ జెప్పిన రెండు ఆకులవంటివి. ఇవి ముక్తి కాంత రెండు చెవులకు ధరించు ఆభరణములు - (రామనామము సర్వధర్మములకు మూలము. అది ముక్తి నిచ్చును.)

మహామునులు తమ మనస్సులనెడి హంసలకు రామ నామాక్షర రూపము లగు రెండు ఱెక్కలను కల్పింతురు. ఆ ఱెక్కల బలముతో వారి మానసహంసలు మహోన్నత కక్ష్యలయందు సంచరించును (మునులు ఘనులగుటకుఁ గారణము రామనామ స్మరణము.)

రామ నామ మొక కత్తెర. ఈ రెండక్షరములు కత్తెరకుఁగల రెండు కాళ్ళ వంటివి. ఇది చాల వాడియైన కత్తెర. ఇది జన్మ మరణ పరంపరను కత్తిరించివేయును. అందుచేతనే ఇది చాల ప్రసిద్ధిచెంది యున్నది. (రామ నామమును స్మరించువానికి మరిపుట్టుట యుండదు)

"రామ" యను రెండక్షరములయందు నొకటి సూర్యుఁడు, ఒకటి చంద్రుఁడునై యుండెను. ఈ సూర్య చంద్రులు అజ్ఞాన మను నందకారమును బాపుదురు. (రామ నామ స్మరణముచే అజ్ఞానము పటాపంచలగును.)

"రామ" యను రెండక్షరములు రేయింబవళ్ళు వెలుగులు చిందించు చుండును. ఆ వెలుగులచే పాపపు ద్రోవలు కూడ భాస్వంతములగును. (రామనామ స్మరణమువలన మహాపాపములు నశించును. మహా పుణ్యము లభించును.)

"రామ" యను రెండక్షరములును ఇహలోకమున పరలోకమున సుఖముల నిచ్చును. సర్వదుఃఖములను హరించును. ఇందులకు వేదములే సాక్షులు.

అట్లగుటచే భక్తి జ్ఞాన మార్గగాములగు శూరు లీ "రామ" నామాక్షరములను నిరంతరము ప్రేమతో స్మరింతురు.

## 43. రామ నామ రస ప్యాలా పీలే

రామనామ రస ప్యాలా పీలే
తేరా మనువా హోఇ మత్ వాలా ॥ రామ ॥

జో కోయి పీవై జుగజుగ జీవై వృద్ధహోయి నహిఁ బాలా
చౌరసీకే బచే ఫేర తే కటిజాయ్ యమకా జాలా ॥ రామ ॥

ఇస ప్యాలేకా మోలనలాగై పకడ హరి కా మాలా
జన్మజన్మ కే దాగ ఛుటై సబ నేక రహీనహి కాలా ॥ రామ ॥

సత సంగతమెఁ సౌదాకర లోఁ వహాఁ మిలే సబ హాలా
గురు దేవ కా శస్తర పకడో తోడ్ భరమ కా తాలా ॥ రామ ॥

గుప్తగ్యాన కా దీయటభ రలో తబ హోవై ఉజియాలా
సబహీ శత్రూమార భగాఓ కరపకడ్ గ్యాన కా భాలా ॥ రామ ॥

ఓయీ! రామనామము అమృతభాజనము. దానిని సేవింపుము. నీమనస్సున కానందోన్మత్తత కలుగును. ఈ రామనామామృతమును ద్రావితివా నీకిక చావెలేదు. యుగయుగముల వఱకు చిరంజీవివైయె యుందువు. అట్లని నీవు వృద్ధుఁడవు కావు. బాలుడవుగానే యుందువు. ఎనుబదినాలుగు కోట్లజీవుల యోనులయందు నిరంతరమై సాగు నీ యీ పరిభ్రమణమును యముఁడు కల్పించి యుంచిన నరలోకసముదాయము నీ వీ రామనామామృతమును ద్రావితివా ! రుద్ధమగును, విధ్వస్తమగును,

ఓయీ! నీవు ఈ అమృతభాజనమునకు వేల చెల్లించనక్కఱలేదు. తులసి పూసల పేరును చేఁబూని "రామ రామ" యనిన చాలును. ఈ యమృతమంతయు నీవు ద్రావవచ్చును. దీనిని ద్రావితివేని అనేకజన్మల నుండి నిన్ను వెన్నంటివచ్చు పాపము లన్నియు నశించును. నిన్ను అధర్మమార్గమున గాక న్యాయమార్గమున ఈ అమృతభాజనమే నడిపించును.

ఓయీ! నీవు రామనామామృతమునుద్రావి సత్సాంగత్యమను అంగడి కేగితివేని నీకు లభ్యముకాని దొక్కటియు నుండదు. సర్వము నీ యదియ అగును. నీవు అజ్ఞానమను సంకెలయందు బంధింపఁబడియుంటివి. ఈ సంకెలను ఛేదించు

టకు శస్త్రమవసరము. సద్గురువు లేక వేదము ఈరెండే అట్టి శస్త్రములు. వానిని ధరించితివేని నీ అజ్ఞానము పటాపంచలగును.

ఓయీ ! అజ్ఞాన మంధకారమై నిన్ను భాదించుచున్నదా? కలత నొందకుము. జ్ఞానజ్యోతిని ప్రజ్వలింపఁజేయుము. ఈ చీకటి తొలగును. వెలుఁగు వ్యాపించును. శత్రువులు (అరిషడ్వర్గము) నిన్ను బాధించుచుండిరా భీతిఁ జెందకుము. జ్ఞానకుంతము (బల్లెము)నుఁ జేబూని వారిని చీల్చి చెండాడుము. ఈకార్యములను సాధింపఁదలఁతువేని రామనామామృతమును గ్రోలుము.

## 44. హరి హరి రట రసనామము

హరి హరి హరి హరి రట రస నామము
పీవతి ఖాతి రహతి నిధరకభయి హోతకహాఁతోక్సేమ ॥ హరి ॥

త్రైఁతో సునీ కథా నహిఁమోసో ఉధరే అమిత మహాధమ
గ్యాన ధ్యాన జపవ్రత తీరథ యోగయాగ బినుసంజమ" ॥ హరి ॥

హేమహరన ద్విజద్రోహ మానమద అరు పరగురు దారాగమ
నామప్రతాప ప్రబల పావక మెఁహోత భసమ అఘ అమిత సలభసమ ॥ హరి ॥

యహ కలికాల కరాలవ్యాలవిషజ్వాలవిషమమ యేహను
బిను యహిమంత్ర గదాధరకో క్యూం మిటిహై మోహమహాతమ ॥ హరి॥

ఓసి నాలుకా ! హరి ! హరి ! హరి ! హరి ! యనవే. తినుచు త్రాగుచు నిర్భ యముగ "హరి! హరి!" మనుటయందు నీకేమి శ్రమ కలదే ?

ఓసి నాలుకా ! నీవీ కథవింటివా? నాకంటె అధములుకూడ తరించిరి. ఎట్లనుకొంటివి? జ్ఞానమా? ధ్యానమా! జపమా? తపమా? వ్రతమా? తీర్థయాత్రలా? యోగమా? యాగమా? సంయమమా? దేనిని వారచరింపలేదు. ఎట్లు తరించిరందువా? "హరి! హరి! హరి!" అని కేవలం మింతయ. నీవీ కథవినలేదు. వినియున్నచో "హరి! హరి!" యనకుందువా? ఇకనైనను హరి! హరి! యనుము.

ఓసి నాలుకా! నీవు "హరిః హరిః హరిః హరి" యని యనవే. మహా పాప ములు - బ్రహ్మహత్య, స్వర్ణస్తేయము, గురుభార్యాగమనము, పరభార్యాగమనము"

మొదలగు మహాఘములు కూడ, నీవు హరిహరి అని పలికినచో పెనుమంటలంబడిన మిడుతపిల్లలగునే. నామముయొక్క ప్రతాప మట్టిది. హరిః హరిః హరిః యనవే.

ఓసి నాలుకా! ఇది కలికాలముం కలియన నేమనుకొంటివి? కరాళకాల నాగముసుమా! ఈకలి. ఎల్లెడల దీని విషజ్వాలలు వ్యాపించియున్నవి. అందువలననే మనము విషమబుద్ధుల మైనాము. ఈ దుస్థితి తొలంగి అజ్ఞానమను చీకటి తొలంగి చనవలెనందువా? ఒక్కటే మంత్రమున్నది. "హరిః హరిః" యనుట. ఓసి నాలుకా! హరిః హరిః హరిః హరిః యనవే.

## 45. పావన ప్రేమ రామచరణ

1. పావన ప్రేమ రామచరన కమల జనమ లాహు పరమ
రామనామ ర హోత సులభ సకల ధరమ ॥ పావన ॥

2. జోగ సుఖ వివేక నిరత వేద విదిత కరమ
కరిబే కహం కటు కఠోర సునత మధుర నరమ ॥ పావన ॥

3. తులసీ ముని జాని బూఝి భూలహిం జని భరమ
తేహి ప్రభుకో హోహి జాహి సబహీకీ పరమ ॥ పావన ॥

రాముని పాదములు తామరపూవుల వంటివి. ఆ పాదములయందుం బవిత్రమైన ప్రేమ కలిగియుండుటయే పుట్టి పడయందగు పరమ లాభము. రామనామ మనుతైలము (తైలధారవలె నవిచ్ఛిన్నమైన నామస్మరణము) ఉన్నచో సకల ధర్మములు సులభము లగును. "యోగము, యజ్ఞము, వివేకము, వైరాగ్యము, వేదచోదితములైన కర్మలు," - అను మాటలు వినుటకు మృదుమధురముగ నుండును గాని ఆచరింపంజూచిన పరమ కఠినములగును. మును లీ రహస్యము నెఱుంగుదురు. ఎఱింగియే వారు పై యోగయాగాదులను విస్మరించి శ్రీరామ ప్రభువు నాశ్రయించి సర్వశ్రమల నుండియు విముక్తులైనారు.

## 46. నిరధన కే ధనరామ

నిరధని కే ధన రామ హమారే
చోర న లేవై ఘటహు న జావై కష్టమె ఆవైకామ్‌హమారే ॥ ని ॥

దిన దిన హోత సవాయీ దౌలత్ ఖూడత నహి ఛదామ్ ।
జాగత సోవత ఊఠత బైఠత జపో నిరంతరనామ । ॥హమారే ॥

అంతకాలమే ఛోడ చలత సబ పాసన ఏక్ ఛదామ్ ।
కహత కబీరా యే ధనకే ఆగే పారసకో క్యా కామ్ ॥హమారే ॥

సీతారామ్ సీతారామ్ సీతారామ్ జై సీతారామ్
రామ రామ రామ రామ సీతారామ్ సీతారామ్ సీతారామ్ జై సీతారామ్

ధనములేని ఏ:నికి ధనమైనవా:డు మారాము:డు (రామనామము). ఈ ధన మనుదినము పెరుగుచుండునే కాని అవంతయైన తరగదు. జాగృతియందు, నిద్రయందు లేచుచూకూర్చుండుచు ననవతరమునామమును జపింపుము. మృత్యువు సమీపించినప్పుడు డందఱు నిన్ను విడిచిపెట్టువారేకాని నీవెంటనుండు వా:డొక్కడు నుండడు. ఈ రామనామమును మహాధనము నెదుట పరశువేదియు (ఒకజాతి ఱాయి, దానిని తాకిన లోహమెల్ల బంగారమగును) పనికిరానిదియే.

## 47. నామ నామ నామ జపో నామ రామకా

నామ నామ నామ జపో నామ రామకా
కామ కామ కామ తజో కామ ధామకా ॥ ॥ నా ॥

బినా హరికె నామ కభీ సుఖ న పాయేగా
మరకరికే అంతకాలమే తుమ నరక జాయేగా
మిలేంగే బారబార తుఝే తన గులాముకా ॥ ॥ నా ॥

కరనా హై క్యా గుమనా తు చోబనవమాలకా
మెహమాన యహ పాస తేరే ఆజకాలకా
పుతలా బిఖర జాయెగా తేరా హాడ చామకా ॥ నా ॥

తపయోగ యజ్ఞ దానకర్మ హై బఢే నహి
కలియుగ మె నామకె సమాన దూసరా నహి
మిలతాహై యతన సే బినా బినాహి దామకా ॥ నా ॥

పాకర మనుజకా తన జో హరినామా నాలియా ॥
చింతామణికో మూఢ కాచసే బదలదియా ॥ ॥ నా ॥

ఓయీ! రామనామము జపింపుము - కోరికలను విసర్జింపుము - హరినామ మును స్మరింపకున్న ఇహమున సుఖమునొందజాలవు. మరణించిన పిదపకూడ

సుఖముండదు. నరకమునకేగెదవు. మాటిమాటికి బానిస శరీరును దాల్చుచుందువు. ఈ శరీరముయొక్క నవ్యతను చాటి గర్వింతువేల? ఇది నేడుండి రేపుపోవు అతిథి వంటిది. అస్థిచర్మ వికారమైన యీ శరీరమను బొమ్మ విశీర్ణమగును. కలిలో తపస్సు, యోగము, యజ్ఞము, దానము, శ్రేష్ఠములుకావు. నామమొక్కటియే శ్రేష్ఠమైనది. దీనికి సాటిలేదు. ఈ నామమునకు విలువలేదు. కాని యిది ప్రయత్నము చేయకున్న లభింపదు. మనుజశరీరము దాల్చియు నామమును స్మరింపకుండుట లభించిన చింతామణి రత్నమునిచ్చి గాజు కొనుట వంటిది. - భగవద్భజన బ్రహ్మానందము నొసంగును. అట్టి భజనలేని బ్రతుకు నిరర్థకము.

## 48. రామనామ రసబహతిహై

రామనామ రస బహతిహై కో ఇ పీనేవాలే ఆఓ
అనమోల్ రతన్ హై హరినామ్
బిను మోల్ కోహ పరబిక తాహై
భావభక్తినిజప్రేమ సే కొఇ లేనేవాలే ఆఓ ॥ కోఇ॥ రామ ॥

పృథివీ జల వాయు ఆకాశ అగ్ని మెఁ
చారోఁ దిశా ఓం కె కణ మెఁ
గూంజ రహా గోవింద నామ యహఁ
కొఇ పానేవాలే ఆఓ ॥ కోఇ ॥ రామ॥

చారోఁవేద పురాణ భావ మెఁ
భక్తోం కె తో భజన స్థాన మెఁ
బాజరహా హైప్రభునామకోఇ సుననేవాలే ఆఓ ॥ కోఇ ॥ రామ ॥

జాతిభేద బంధన తోడ కె
ఛోటా ఔర్ బడా స్వభావ ఛోడ కే
చంద్రదియెనిమంత్రణసబ్‌కొయిగానేవాలే ఆఓ॥ కొఇ॥ రామ ॥

రండి, రండి, రండి, తేనెల వాకలై రామనామరసము ప్రవహించు చున్నది. రండి త్రాగదలచిన వారందఱు రండి.

ఓయయ్యా! రామ నామ మన నేమనుకొంటివి? అమూల్యరత్నము కాదటయ్యా! విలువకై శంకించుచుంటివా? నీవు విలువ చెల్లింప నక్కఱలేదయ్యా!

బిగ్గఱగా నుచ్చరించుటయే దీనికిఁ జెల్లింపఁ దగువిలువ యయ్యా! ప్రేమభక్తిపూర్ణ మైన మానసముతో దీనిని జేకొనఁదలంపు గలవారలందఱును రండి.

ఓయయ్యా! రామనామము నీకు వినఁబడలేదటయ్యా ? భూమియందు, జలమునందు, వాయువునందు, అగ్నియందు, ఆకాశమునందు నలుదిక్కుల యందు, ప్రతి అణువునందు రామనామము ప్రతిధ్వనించుచున్న దయ్యా! అమృతరూపమై, మహార్ఘరత్నమై వెలుఁగొందు ఈరామనామమును బొందఁగోరు వారందఱును రండి.

ఎచ్చటఁజూచినను రామనామమే. వేదములయందు రామనామము. పురాణములయందు రామనామము. భక్తులు భజనచేయుచోట రామనామముం డునని చెప్పనక్కఱలేదు. ఎల్లెడల రామనామము మ్రోగిపోవుచున్నది. కైకొనఁ దలంపు గలవారందఱును రండి.

రామనామమునుఁ జేకొనుటకు జాతితో పనిలేదు. ఇచ్చట నియము లేమియును లేవు. పిన్న పెద్దయను అంతరములేదు. నేను (చంద్రుడను కవి) ఆహ్వానించుచున్నాను. రామ నామమును స్వీకరింపఁ దలంపు గలవారలందఱును రండి.

## 49. కమలముఖ రామ భజన కొదియ

కమలముఖ రామ భజన కొదియ ॥

లఖ చౌరాసీ ఫేరే ఫిరకర సుందర నరతన పాయ ॥ క ॥

ఖాయా పీయా సుఖ సే సోయా నాహక జనమ గవాఁయా ॥ క ॥

జాముఖ నిస దిన రామనామ నహీ ఓముఖకఛూ నకియా ॥ క ॥

కహత కబీర సునో భయి సాధొ ఆయా వైసా గయా ॥ క ॥

అయ్యో! శ్రీరాముని భజింపనైతిని, ఎనుబదినాల్గు లక్షల జీవగణముల యోనులయందు భ్రమించి భ్రమించి ఎట్టెటో యీ అందమైనఅనువైన మానవ శరీరము నొందితిని. అట్లయ్యుపద్మముఖుడగు రామునిభజింపనైతిని, తినుచు త్రాగుచు నాయీ మానవజన్మమును వ్యర్థముగావించితిని. శ్రీరామనామము

నుచ్చరించని నోరెందులకు ? వాని జన్మమెందులకు ? వాడెట్లు పుట్టెనో అట్లే గిట్టు చున్నాడు. సాధులోకమా ! కబీరుయొక్క యీపలుకులను వినుడు.

## 50. కో కో నతర్యో

కో కో న తర్యో హరి నామ పి ఏ ।

సువా పఢావత గనికా తారీ వ్యాధ తర్యో సరఘాతకి ॥ ఏఁ ॥

అంతరదాహ జు మిట్యో వ్యాసకౌ ఇక చిత న్హై భాగవతకి ॥ ఏఁ ॥

ప్రభు తైఁ జనజన తైఁ ప్రభు బరతత జాకేజైసే ప్రీతిహి ॥ ఏఁ ॥

జౌసై రామభక్తి నహిఁజానీ కహా సుమేరుసమ దావది ॥ ఏఁ ॥

సూరదాసవిముఖ జో హరితైఁ కహా భయౌ జుగకోటిజ ॥ ఏఁ ॥

శ్రీరామ నామమును స్మరించి తరింపని వారుకలరా ? లేరు. ఎవ్వరను లేరు లేరు. చిలుకచే రామనామము విలాసముగ బలికించి ఆనందించిన వేశ్య కూడ తరించెను. అలుగులచే పులుగులను జంపు బోయకూడ రామరామ యని నంతనే తరించెను.

వ్యాసునకుఁ గల్గిన మనస్తాపము "భాగవతమును" శ్రీహరిగుణకీర్తనచే చెన్నొందు గ్రంథమును రచించినగాని నశించినదా ? లేదు. తన్నెవడెట్లు గొనియాడి ననట్టే ప్రభువు అంతరమును గణింపక ప్రసన్నుడయ్యెను.

మేరువును దానము చేసినను రామభక్తుడుగానిచో ఫలితములేదు.

శ్రీహరి దెసకు అభిముఖుడుగాక విముఖుడైనవాడు కోటియుగములు జీవి ంచినను ఫలితము శూన్యమే. లోకమా ! సూరదాసుని యీ పలుకల నాచరింపుము.

## 51. రామ కహత చలు

రామ కహత చలు రామ కహత చలు
రామ కహత చలు భాయిరే ॥

నాహిఁతౌభవ-బెగారి మహాపరిహౌ ఛూటతఅతికఠినాయీరే ॥
బాఁస పురాన సాజ సబ అట-ఖట సరల తికోన ఖటోలా రే

హమ=హిఁ దిహల=కరి కుటిల కరమచంద మంద మోల్ బిను డోలా రే॥

విషమకహార మార మదమాతే చలహినపావు బటోరా రే ॥

మంద విలంద అభేరా దలకన పాయియ దుఖ ఝుక ఘోరా రే ॥

కాఁటకురాయిలపేటన లోటన ఠావహిఁఠాఁవ బఝూవూ రే ॥

జస జస చలియ దూరి తసతస నిజ బాసన భేంట అగావూ రే ॥

మారగ ఆగమ సంగ నహి సంజల నావుఁగావుఁకర భూలా రే ॥

తులసిదాసభవత్రాసహరహు అబహోహురామఅనుకూలా రే ॥

సీతారామ్ సీతారామ్ సీతారామ్ సీతారామ్ జై సీతారామ్

సోదరా ! సర్వదా "రామ రామ" యనుచుండుము. "రామ రామ" యనకున్న నేమి లోప మందువా? రామనామ యనకున్నచో జన్మమరణ రూపమగు నీ సంసారము వలన వృథాయాసము తొలఁగనేఱదు.

సోదరా! "రామరామ" యనకున్నచో మాయామయములగుసుకృత దుష్కృతములు మనలను బెదరించుచునే యుండును. అవి మనలను బెదరించి జన్మమరణపు టూయలనుండి కదలనీయవు. అందుచే ఓసోదరా ! రామరామ యనుము.

సోదరా ! "రామరామ" యనుకుంటివా? కాముని నీవునిగ్రహింపఁ గలవా? అమ్మో! వాడు నేలపై నడఁచునా ? వాఁడు నిన్ను త్రోసిన త్రోపునకు నీవెక్కడ పడుదువనుకొంటివి? ఎంత దుఃఖము కలుగునను కొంటివి. వాడు కల్పించిన దుఃఖముతో నీవాపాదమస్తకము కంపింతువు. అందుచే! సోదరా రామ రామ యనుచుండుము.

సోదరా ! నీవు "రామరామ" యనకున్నచో విషయవాసనలు నిన్ను విడిచిపెట్టవు. అవి నిన్ను కంటకములయందు కూలద్రోయును. కుమార్గములలోనికి నెట్టును. ఒకచోట నిలువనీయక తరుముచుండును. వెన్నాడు చుండును. అందుచే సోదరా ! "రామ రామ" యనుచుండుము.

సోదరా ! నీవు సంచరించు ఈ సంసారమార్గమున కొక తీరు తెన్నులేదు. ఇందు నీకు తోడెవ్వరునులేరు. అంతియకాదు, దారిబత్తెముకూడ లేదు. పోనిమ్ము.

నీవు చేరఁదగు గ్రామముయొక్క పేరైన నీకు తెలియునేమోయన్న దానినికూడ నీవు విస్మరించితివి. అందుచే సోదరా ! నామాట (తులసీదాసుయొక్కవచనము) నాలింపుము. రామ రామ యనుచుండుము. నీ కీ సంసారము వలన నెట్టి భయము కలుగదు. శ్రీరాముడనుకూలుడగును. సోదరా ! రామ రామ యనుచుండుము.

## 52. రామ రాఘవ రామ రాఘవ

రామ రాఘవ రామ రాఘవ రామ రాఘవ రక్షమాం
కృష్ణ కేశవ కృష్ణ కేశవ కృష్ణ కేశవ పాహిమాం.

## 53. సంగతి సరస తిహారి

1. సంగతి సరస తిహారీ ప్రభుజీ । జగజీవన రామ మురారీ ॥ సంగతి॥

ప్రభూ! నీవలన లోకము జీవించుచున్నది. ఓ రామా ! మురారీ నీ సాంగత్యము ఆనందరసపూర్ణమైనది.

2. గలీ గలీ మే జల బహి ఆయో । సురసరిజాయ సమాయో
సంగతికై పరతాప మహాతమ । నామ గంగోదక పాయో ॥ సంగతి॥

మహాత్ముల సాంగత్యప్రతాపముచే భగవన్నామమనెడు గంగోదకము ప్రతిసందులోనూ నిండి - ఆకాశగంగయై ప్రవహించుచున్నది.

3. స్వాతి బూంద బరసే ఫణి ఊపర । సీస విషయ హోయి జాయి
ఒహీ బూందకే మోతీ ఉపజై। సంగత - కీ - అధికయీ ॥ సంగతి॥

స్వాతివాన చినుకులు పామునోటబడి విషముగ మారుచున్నవి. అదే వాన చినుకులు ముత్తెపుచిప్పలో పడి ముత్తెము లగుచున్నది. సాంగత్యముయొక్క గొప్పదనము కాదనరానిది.

4. తుమ చందన హమ రేడ బాపురే । నికట తుమ్హారే ఆసా
సంగతకై పరాతాప మహాతమ । ఆతై బాస - సు - బాసా. ॥ సంగతి॥

స్వామీ! చందన వృక్షము వంటివాడవు - మేము సాధారణ నిర్గంధవృక్షముల వంటివారము. కాని నీసాంగత్యముచే మేము సుగంధములను విరజిమ్మ గల్గుదుము - ఇది సాంగత్య ప్రభావము.

5. జాతిభీ ఓఛీ కరమభీ ఓ ఛా । ఓ ఛా ఖసబ హమారా
నీచేసే ప్రభు ఊంచ కియోహైకహా । రైదాస చమారా ॥ సంగతి॥

రైదాసు మాదిగవాడు, ఆయన జాతి, క్రియావృత్తులు నికృష్టములైనవి. అయిన నేమి! ఆయన ప్రభునామమును శరణొందినాడు. అందుచే ఆయనను ప్రభువు క్రిందనుండి పైకి ఉద్ధరించినాడు. (ఆయన తక్కువ జాతివాడైనను మహా భక్తుడైనందున సర్వశ్రేష్ఠుడై విరాజిల్లెను) ఇదంతయు సాంగత్యప్రభావమే.

## 54. అబకైసే ఛుటై నామరట లాగీ

అబకై సేఛుటై నామరట లాగీ

1. ప్రభుజీ తుమ చందన హమ పానీ ।జాకీ అంగ అంగ బాస సమానీ
2. ప్రభుజీ తుమ ఘన - బవ హమయోరా। జైసే చితవత చంద చకోరా
3. ప్రభుజీ తుమ దీపక హమబాతీ । జాకీ జోతీ బరై దిన రాతీ
4. ప్రభుజీ తుమోతీ హమధాగా । జైసే సోనహి మిలత సుహాగా
5. ప్రభుజీ తుమ స్వామీ, హమదాసా । ఐసీ భక్తికరై రైదాసా

భగవన్నామమునందు ప్రీతి జనింపవలెనే కాని, జన్మించిన ప్రీతి నశింపదు. - ఓ ప్రభూ! నీవు చందనము వంటివాడవు - మేము జలమువంటి వారము, మాప్రత్యంగమున సుగంధము నీవే నింపుచున్నావు. స్వామీ! నీవు మేఘమువంటి వాడవు. మేము నిన్ను చూచి నర్తించు నెమళ్ళము. నీవు చంద్రుడవు. మేము చకోరములము. ప్రభూ! నీవు దీపమువంటివాడవు. మేము వత్తి వంటివారము - నీవెలుగుచే మేము రాత్రిందినములు ప్రకాశింతుము. స్వామీ! నీవు ముత్యమువంటి వాడవు మేము దానినంటియున్న దారము వంటి వారము. నీవలననే మాకొకవిలువ. నీవలన మాకు బంగారునకు పరిమళమబ్బినట్లు విలువ ఏర్పడుచున్నది.

ప్రభూ! నీవు స్వామివి. మేము దాసులము, రైదాసుభక్తి యిట్టిది

## 55. తూతో రామ సుమర జగ లడవాదే

తూతో రామ సుమర జగ లడవాదే

1. కోరా కాగజ కాలీ స్యాహీ । లిఖిత పఢత వా కౌ పఢివాదే ॥ తూ ॥

2. హాథీ చలతాహై అపనీ గతిమే, । కుకర భుకతావా వాకొ భుకవాదే॥ తూ ॥

3. కహత కబీర సునో భయి సాధో । నరక పచత వాకె ॥ తూ ॥

నీవు రాముని స్మరింపుము. లోకముయొక్క గోలను పట్టించు కొనకుము. తెల్లకాగితముపై నల్లసిరాతో రామనామమును లిఖించి చదివి చదివింపుము. ఏనుగు నడచుచుండగా కుక్కలు మొఱుగుచుండును. వాని అఱుపులను పట్టించుకొన కుము. ఓ సాధు! కబీరు యొక్క మాటను ఆలకింపుము - లోకము (నిన్ను నీ నామస్మరణమును వెక్కిరించి) నరకమునకు పోవును. దానిని గణింపకుము.

## 56. డరతే రహో యహ జిందగీ

1. డరతే రహో యహ జిందగీ, బేకార న హో జాయ
సపనే మే కిసీ జీవకా అపకార న హో జాయ ॥ డర ॥

2. పాయా హై తన అమోల్ సదాచారకేలియే
విషయోం మేం ఫసకే తుమసే
అనాచార న హో జాయ ॥ డర ॥

3. సేవాకరో సబదేశకీ శుభకర్మ హరి భజన్
ఇతనా భి కరకే తుమకో
అహంకార న హోజాయ ॥ డర ॥

4. మంజిల్ అసల్ ముకామ కీ తయకరనీ హై తుమే వా
జగ ఠగనగరమే ఫసకే గిరఫ్‌దార్‌నహోజాయ ॥ డర ॥

5. మాధవ లగీ హై బాజీ మాయా మోహజాలకీ
దోఖే మే పడకే అబకీ కహి హారనజాయ ॥ డర ॥

ఓయీ ! నీ యీ జీవనము వ్యర్థమగునేమో యని భయపడుచుండుము. కలలోనైనను ఏప్రాణికిని అపకార మాచరింపకుము. సదాచారమునకై నీకీ అమూల్య శరీరము లభించినది. విషయవాసనలయందు చిక్కుకొని అనాచారమున పడిపో కుము. హరిభజనమనెడు శుభకర్మము ద్వారా అన్ని దేశములకు సేవచేయుము. ఇదంతయు చేసినను - నే నిట్లు చేసితినని అహంకరింపకుము. నీవు నీ స్వస్థానము

(ఆత్మ)ను జేరుటకు ప్రయత్నము చేయవలెను. అంతేకాని ఈ లోకమనెడు మోసపు నగరమున జిక్కుకొని బందీవి కాకుము. మాయామోహములకు నీకు పందెము నడచుచున్నది. మోసపోయి ఓడిపోకుము.

## 57. ఆనందరామ

ఆనంద రామ పరమానంద రామ. నిత్యానంద రామ సదానందరామ ।
నిర్భయరామ నిరామయరామ అగుణ ఆలేపన ఆనందరామ ॥ ఆనంద॥
కౌసల్యరామ దశరథరామ జానకి జీవన జగదభిరామ
కారుణ్యరామ కోదండరామ తాపసరంజన సీతారామ ॥ఆనంద॥
భవభయ భంజన సీతారామ. భక్త నిరంజన రాజారామ
భక్తోద్ధరణ సీతారామ ॥ఆనంద॥
జనమనరంజన జానకిరామ తాపన రంజన తారకనామ
జానకి జీవన సితారామ ॥ఆనంద॥
పాపవిమోచన సీతారామ పతీతపావన పావననామ
పరమదయాళో రాజారామ పాలిత దీనావన సీతారామ
హనుమత్ సేవిత నిజపదరామ ॥ఆనంద ॥

## 58. రామహరేకృష్ణ హరె తవనామవదామి

1. రామహరే కృష్ణహరే తవనామవదామి సదా నృహరే
నామస్మరణా దన్యోపాయం నహి పశ్యామోభవతరణే ।

2. రామ రామ రామరామ రామనామ తారకం ।
రామకృష్ణ వాసుదేవ భుక్తిముక్తి దాయకమ్ ॥
జానకీ మనోహరం సర్వలోకనాయకం ।
శంకరాది సేవ్యమాన దివ్యనామకీర్తనమ్ ॥

3. కృష్ణానంద! ముకుంద! మురారే । వామన! మాధవ! గోవింద!
శ్రీధర ! కేశవ ! రాఘవ ! విష్ణో । లక్ష్మీనాయక! నరసింహ ॥

4. శ్రీకృష్ణచైతన్య! ప్రభునిత్యానందం । హరేరాం హరేకృష్ణ రాధేగోవిందం ॥

## 59. అచ్యుతాష్టకమ్

అచ్యుతం కేశవం రామనారాయణం। కృష్ణదామోదరం వాసుదేవం హరిమ్,
శ్రీధరం మాధవం గోపికావల్లభం । జానకీనాయకం రామచంద్రం భజే.

అచ్యుతం కేశవం సత్యభామాధవం । మాధవం శ్రీధరం రాధికా రాధితమ్,
ఇందిరామందిరం చేతసా సుందరం । దేవకీనందనం నందజం సందధే.

విష్ణవే జిష్ణవే శంఖినే చక్రిణే । రుక్మిణీ రాగిణే జానకీ జానయే,
వల్లవీవల్లభ యార్చితా యాత్మనే । కంసవిధ్వంసినే వంశినే తేనమః

కృష్ణగోవింద హే రామ నారాయణ । శ్రీపతే వాసుదేవాజిత శ్రీనిధే
అచ్యుతానంత హే మాధవాధోక్షజ । ద్వారకానాయక ద్రౌపదీరక్షక.

రాక్షసక్షోభితః సీతయా శోభితో । దండకారణ్య భూ పుణ్యతా కారణమ్,
లక్ష్మణేనాన్వితో వానరైస్సేవితో । ఉగస్త్యసంపూజితో రాఘవః పాతుమామ్.

ధేను కారిష్టకా నిష్టకృద్ద్వేషిహా । కేసిహా కంసహృద్వంశికా వాదకః,
పూతనా కోపకః సూరజా ఖేలనో । బాలగోపాలకః పాతు మాం సర్వదా.
విద్యుదుద్ద్యోతవ త్ప్రస్ఫురద్వాసనం। ప్రావృ దంభోదవత్ప్రోల్లస ద్విగ్రహమ్,
వన్యాయా మాలయా శోభితోరస్స్థలం। లోహితాంఘ్రిద్వయం వారిజాక్షం భజే.

కుంచితైః కుంతలై ర్భ్రాజమానాననం। రత్నమౌళిం లసత్కుడలం గండయోః,
హారకేయూరకం కంకణప్రోజ్వలం। కింకిణీమంజులం శ్యామలం తం భజే.

అచ్యుతస్యాష్టకం యః పఠే దిష్టదం । ప్రేమతః ప్రత్యహం పూరుషః సస్పృహమ్,
వృత్తతః సుందరం కర్తృవిశ్వంభరః । తస్య వశ్యోహరి ర్జాయతే సత్వరమ్.

## 60. చౌరాష్టకమ్

ఆదౌబకీప్రాణ మఘౌఘచౌరం । బాల్యే ప్రసిద్ధం నవనీతచౌరం,
వ్రజే చరంతం చ మృదోహి చౌరం । చౌరాధిపం కృష్ణమహం నమామి.

విధేః సురేంద్రస్యచ గర్వచౌరం । గోగోప గోపిజన చిత్తచౌరం,
శ్రీరాధి కాయాః హృదయస్య చౌరం ॥ చౌరా ॥

నాగాధి రాజస్య విషస్య చౌరం । శ్రీసూర్యకన్యాఖిల కష్ట చౌరం,
గోపీజనాజ్ఞాన దుకూల చౌరం ॥ చౌరా ॥

వత్సాసురాదే ర్ఛలమాన చౌరం । పిత్రోస్తథా బంధనదుఃఖ చౌరం,
కుబ్జార్చనవ్యాజ మనోజ చౌరం ॥ చౌరా ॥

నిశాచరణా మధజీవ చౌరం । జీవాత్మనః కల్మష సంఘు చౌరం,
ఉపాసకానాం చ విపత్తి చౌరం ॥ చౌరా ॥

సుహృత్ సుదామ్నో హ్యఘనత్వ చౌరం । శోకస్య గత్వా విదుర్నస్య చౌరం,
కృష్ణాపటాకర్షక గర్వ చౌరం ॥ చౌరా ॥

యుద్ధేహి పార్థస్య విమోహ చౌరం । పురస్థి తానాం చ బలస్య చౌరం,
దినేచ మాయాబల సూర్య చౌరం ॥ చౌరా ॥

చిత్తస్య శీలస్య జనస్య చౌరం । అనేక జన్మార్జిత పాప చౌరం,
దాస్యం గతానాంచ సమస్త చౌరం ॥ చౌరా ॥

న నామ సదృశ స్త్యాగో న నామ సదృశః శమః ,
న నామ సదృశం పుణ్యం న నామ సదృశీ గతిః ॥

శ్రీకృష్ణగోవింద గోపాలశ్యామ్ శ్రీరాధే శ్రీకృష్ణ శ్రీఘనశ్యామ్
కృష్ణ కృష్ణ ఘనశ్యామ్ రాధేరాధే ఘనశ్యామ్
శ్రీరాధే శ్రీకృష్ణ గోవింద గోపాలశ్యామ్

## 61. మధురాష్టకమ్

అధరం మధురం వదనం మధురం। నయనం మధురం హసితం మధురమ్,
హృదయం మధురం గమనం మధురం । మథరాధిపతే రఖిలం మధురమ్.

వచనం మధురం చరితం మధురం। వసనం మధురం వలితం మధురమ్,
చలితం మధురం భ్రమితం మధురం । మథురాధిపతే రఖిలం మధురమ్.

వేణుర్మధురో రేణుర్మధురః । పాణిర్మధురౌ పాదౌ మధురౌ,
నృత్యం మధురం సఖ్యం మధురం । మధురాధిపతే రఖిలం మధురం.

గీతం మధురం పీతం మధురం । ముక్తం మధురం సుప్తం మధురమ్,
రూపం మధురం తిలకం మధురం । మధురాధిపతే రఖిలం మధురమ్.

కరణం మధురం తరణం మధురం । హరణం మధురం రమణం మధురమ్,
వమితం మధురం శమితం మధురం । మధురాధిపతే రఖిలం మధురమ్.

గుంజా మధురా మాలా మధురా । యమునా మధురా వీచీ మధురా,
సలిలం మధురం కమలం మధురం । మధురాధిపతే రఖిలం మధురమ్.

గోపీ మధురా లీలా మధురా । యుక్తం మధురం భుక్తం మధురమ్,
ఇష్టం మధురం శిష్టం మధురం । మధురాధిపతే రఖిలం మధురమ్.

గోపా మధురా గావో మధురా । యష్టిర్మధురా సృష్టిర్మధురా,
దళితం మధురం ఫలితం మధురం । మధురాధిపతే రఖిలం మధురమ్.

## 62. శ్రీ యుగళకిశోరాష్టకమ్

నవజలధరవిద్యుద్ద్యోతవర్ణౌ ప్రసన్నౌ
వదనయనపద్మౌ చారుచంద్రావతంసౌ,। అలకతిలకఫాలౌ కేశవేశ ప్రఫుల్లౌ
భజ భజతు మనో రే రాధికాకృష్ణ చంద్రౌ.

వసనహరితనీలౌ చందనాలేపనాంగౌ।మణిమకరతదీప్తౌ స్వర్ణమాలా ప్రయుక్తౌ,
కనకవలయహస్తౌ రాసనాట్య ప్రసక్తౌ। ॥ భజ ॥

అతి మధురసువేషౌ రంగభంగీత్రిభంగౌ। మధురమృదులహాసౌ కుండలా
కీర్ణకర్ణౌ, । నటవరవరరమ్యౌ నృత్యగీతానురక్తౌ । ॥భజ ॥

వివిధగుణవిదగ్ధౌ వందనీయౌ సువేశౌ। మణిమయమకరాద్యైః శోభితాంగౌ
స్ఫురంతౌ,। స్మితనమితకటాక్షౌ ధర్మకర్మప్రదత్తౌ । ॥భజ ॥

కనకముకుటచూడౌ పుష్పితో ద్భూషితాంగౌ
సకలవననివిష్టౌ సుందరానంద పుంజౌ, చరణకమలదివ్యౌ
దేవదేవాదిసేవ్యౌ । ॥భజ ॥
అతిసువలితగాత్రౌ గంధమాల్యైర్విరాజౌ। కటికతిరమణీనాం సేవ్యమానౌ
సువేశౌ,। మునిసురగణభావ్యౌ వేదశాస్త్రాదివేద్యౌ । ॥ భజ ॥

అతిసుమధురమూర్తీ దుష్టదర్పప్రశాంతీ। సురవరవరదౌ ద్వౌ సర్వసిద్ధిప్రదానౌ
అతిరసవశమగ్నౌ గీతవాద్యప్రతానౌ। ॥ భజ ॥

అగమనిగ మసారౌ సృష్టి సంహార కారౌ। వయసి నవకిశోరౌ నిత్యబృందావనస్థౌ,
శమనభయవినాశౌ పాపినస్తారయంతౌ। ॥ భజ ॥

ఇదం మనోహరం స్తోత్రం శ్రద్ధయా యః పఠేన్నరః.
రాధికాకృష్ణచంద్రౌ చ సిద్ధిదౌ నాత్ర సంశయః

శ్లో ॥ నామైవపరమో యజ్ఞో - నామైవ పరమం తపః ।
జ్ఞానం యత్పరమం లోకే - హరేర్నామైన కేవలమ్ ॥

## 63. బాలముకుందాష్టకమ్

హేగోపాల రాధికాలోల । నందకుమార నవనీతచోర
నందకుమార నవనవకిషోర

కరారవిందేన పదారవిన్దం । ముఖారవిన్దే వినివేశయన్తమ్,
వటస్య పత్రస్య పుటేశయానం । బాలం ముకుందం మనసా స్మరామి

సంహృత్యలోకాన్ వటపత్ర మధ్యే । శయాన మాద్యంత విహీన రూపమ్
సర్వేశ్వరం సర్వ హితావతారం । బాలం ముకుందం మనసా స్మరామి

ఇందీవర శ్యామల కోమలాంగం । ఇంద్రాది దేవార్చిత పాదపద్మమ్,
సంతాన కల్పద్రుమ మాశ్రితానాం । బాలం ముకుందం మనసా స్మరామి,

లమ్బాలకం లమ్బిత హార యష్టిం । శృంగార లీలాంకిత దన్త పంక్తిమ్,
బింబాధరం చారు విశాలనేత్రం । బాలం ముకుందం మనసా స్మరామి

శిక్యే విధాయాద్య పయోదధీని । బహిర్గతాయాం వ్రజ నాయికాయామ్,
భుక్త్వా యథేష్టం కపటేన సుప్తం । బాలం ముకుందం మనసా స్మరామి.

కాళిన్ది జాన్త స్థితి కాళియస్య । ఫణాగ్ర రంగే నటన ప్రియ న్తమ్,
తత్పుచ్ఛహస్తం శరదిన్దు వక్త్రం । బాలం ముకుందం మనసా స్మరామి.

ఉలూఖలే బద్ధ ముదార శౌర్యం । ఉత్తుంగ యుగ్మార్జున భంగ లీలామ్,
ఉత్ఫుల్ల పద్మాయత చారునేత్రం । బాలం ముకుందం మనసా స్మరామి

ఆలోక్య మాతుర్ముఖ మాదరేణ । స్తన్యం పిబన్తం సరసీరుహేక్షమ్,
సచ్చిన్మయం దేవ మనన్తరూపం । బాలం ముకుందం మనసా స్మరామి

## 64. శ్రీరాస క్రీడాష్టకమ్

అఙ్గనామఙ్గనా మన్తరే మాధవో । మాధవం మాధవం చాన్తరే ణాఙ్గనా,
ఇత్థ మాకల్పితే మణ్డలే మధ్యగః । సఞ్జగౌ వేణునా దేవకీనన్దనః

కేకికేకా ధృతానేక పఙ్కేరుహా । లీనహంసావళీ హృద్యతాహృద్యతా,
కంసవంశాటవీ దాహదావానలః । సఞ్జగౌ వేణునా దేవకీనన్దనః.

క్వాపి వీణాభిరా రావిణా కమ్పితః । క్వాపి వీణాభిరా కింకిణీ నర్తితః
క్వాపి వీణాభిరామా న్తరం గాపితః । సఞ్జగౌ వేణునా దేవకీనన్దనః.

చారుచన్ద్రావళీలోచనై శ్చుమ్బితో । గోపగోబృన్ద గోపాలికావల్లభః ।
వల్లవీబృన్దారకః కాముకః । సఞ్జగౌ వేణునా దేవకీనన్దనః.

మౌళిమాలామిళన్మ తభృఙ్గీలతా । భీతభీత ప్రియాదిభ్రమాలిఙ్గితః,
స్రస్తగోపీకుచాభోగసమ్మేళితం । సఞ్జగౌ వేణునా దేవకీనన్దనః

చారుచామీక రాభాసభామావిభు । ర్వైజయన్తీలతావాసితోరస్థలః
నన్దబృన్దావనేవాసితా మధ్యగః । సఞ్జగౌ వేణునా దేవకీనన్దనః.

బాలికా తాళికా తాళలీలాలయా । సంగసన్దర్శిత భ్రూలతా విభ్రమః,
గోపికాగీత దత్తావధాన స్స్వయం । సఞ్జగౌ వేణునా దేవకీనన్దనః.

పారిజాతం సముద్ధృత్య రాధావరో । రోపయామాస భామాగృహస్యాంగణే,
శీతశీతే వటే యామునీయే తటే సఞ్జగౌ వేణునా దేవకీనన్దవః

కలికుంరజ భంజస్య దారణం భవతారణమ్,
మారణం మరణస్యాపి హరేర్నామైన కేవలమ్.

## 65. శ్రీ కృష్ణతాండవస్తోత్రము

భజే వ్రజైక మండనం సమస్త పాప ఖండనం
స్వభక్త చిత్త రంజనం సదైవ నందనందనం ।
సుపిచ్ఛ గుచ్ఛ మస్తకం సునాదవేణు హస్తకం
అనంగ రంగ సాగరం నమామి కృష్ణసాగరం ॥

మనోజగర్వ మోచనం విశాల ఫాలలోచనం
విధూత గోప శోచనం నమామి పద్మలోచనం ।
కరారవింద భూధరం స్మితావలోక సుందరం
మహేంద్ర మానదారణం నమామి కృష్ణవారణం ॥

కదంబసూన కుండలం సుచారు గండమండలం
వ్రజాంగనైక వల్లభం నమామి కృష్ణదుర్లభం ।
యశోదయా సమోదయా సకోపయా దయానిధిం
ఉలూఖలే సుబంధనం నమామి నందజం వహం ॥

నవీన గోపనాగరం నవీన కేళిమందిరం
నవీన మేఘసుందరం భజే వ్రజైక మందిరం ।
సదైవ పాదపంకజం మదీయ మానసే నిజం
దధాతి నందబాలక స్సమస్త భక్త పాలకః ॥

సమస్త గోపనాగరీ హృదంబుజైక మోహనం
నమామి కుంజమధ్యగం ప్రసూన బాలశోభితం ।
దృగంత కాంతరింగణం సహాస బాల సంగినం
దినే దినే నవం నవం నమామి నందనందనం ॥

గుణాకరం సుఖాకరం కృపావరం
త్వరా సుఖైక దాయకం నమామి గోపనాయకం,
సమస్త దోష శోషణం సమస్త లోక తోషణం
సమస్త దాస మానసం నమామి కృష్ణలాలసం ॥

సమస్త గోపనాగరీ నికామ కామదాయకం
దృగంత చారుసాయకం నమామి వేణునాయకం ।
భవో భవావతారకం భవాబ్ధి కర్ణధారకం
యశో మతేః కిశోరకం నమామి దుగ్ధచోరకం ॥

విముగ్ధ ముగ్ధ గోపికా మనో మనోద దాయకం
నమామి ముంజకాననే ప్రవృద్ధ వహ్ని పాయినం ।
యథా తథా యదా తదా తథైవ కృష్ణ సత్కథా
మయా సదైవ గీయతాం తథా కృపా విధీయతాం ॥

## 66. రాధాకృష్ణాగతిర్మమ

కృష్ణ ప్రేమమయీ రాధా రాధా ప్రేమమయో హరిః ।
జీవనే నిధనే నిత్యం రాధాకృష్ణౌ గతి ర్మమ ॥

కృష్ణప్రాణమయీ రాధా రాధా ప్రాణమయో హరిః ।
జీవనే నిధనే నిత్యం రాధా కృష్ణౌ గతి ర్మమ ॥

కృష్ణస్య ద్రవిణం రాధా రాధా యా ద్రవిణం హరిః ।
జీవనే నిధనే నిత్యం రాధాకృష్ణౌ గతి ర్మమ ॥

కృష్ణద్రవమయీ రాధారాధా ద్రవమయో హరిః ।
జీవనే నిధనే నిత్యం రాధాకృష్ణౌ గతి ర్మమ ॥

కృష్ణదేహేస్థితా రాధా రాధా దేహేస్థితో హరిః ।
జీవనే నిధనే నిత్యం రాధాకృష్ణౌ గతి ర్మమ ॥

కృష్ణచిత్తే స్థితా రాధా, రాధాచిత్తేస్థితోహరిః ।
జీవనే నిధనే నిత్యం రాధాకృష్ణౌ గతి ర్మమ ॥

నీలాంబరధరా రాధా పీతాంబరధరో హరిః ।
జీవనే నిధనే నిత్యం రాధాకృష్ణౌ గతిర్మమ ॥

బృందావనేశ్వరీ రాధా కృష్ణౌ బృందావనేశ్వరః
జీవనే నిధనే నిత్యం రాధా కృష్ణౌ గతి ర్మమ ॥

## 67. వందె వందె నంద కుమారం

వందే వందే నంధకుమారం - నందకుమారం నవనీత చోరం
వందే వందే రాధికలోలం - గోపీచిత్తవిహారం ॥ వందే వందే ॥

1. శ్రీ ధరణీశంజగదాధారం - భవభయ దూరం భక్తమందారం
యమునా తీర విహారం ॥ వందే ॥

2. వేణువినోదం వేదసుసారం - కరుణాలోలం కాంచనచేలం కమనీయ గాత్రం
కంససంహారం యమునా తీరవిహారం ॥ వందే ॥

3. మునిజపాలం మోహనరూపం మురళీలోలం మదనగోపాలం
బృందావన సంచారం వందే ॥ వందే ॥

## 68. వ్రజసమ ఔరకోవు నహీఁధామ్

వ్రజసమ ఔరకోవు నహీఁ ధామ్ । యా వ్రజమే పరమేశ్వర హూకో
సుధరే సుందరనామ్ ॥ వ్రజ ॥

కృష్ణ నామ యహ సునో గర్గతే । కాన్హ కాన్హ కహి బోలై
బాల కేలిరస మగన భయో సబ । ఆనంద సింధు కలోలై ॥ వ్రజ ॥

2. యశోదా నందన శ్రీదామోదర । నవనీతప్రియ దధిచోర
చీర చోర చితచోర చికనియా । చాతుర నవల కిశోర ॥ వ్రజ ॥

3. రాధాచంద చకోర సావఁరో । గోకులచంద దధిదాని
శ్రీ బృందావన చంద్ర చతురచిత । ప్రేమరూప అభిమాని ॥ వ్రజ ॥

4. రాధారమణ సు రాధావల్లభ । రాధాకాంత రసాల
వల్లభసుత గోపీజనవల్లభ - గిరివరధర ఛబిజాల ॥ వ్రజ ॥

5. రసికవిహారీ రాసవిహారీ కుంజవిహారీ శ్యామ్
విపినవిహారీ బాంకేవిహారీ అటల విహారాభిరామ్
ఛైలవిహారీ లాలవిహారీ బనవారి రసకంద
గోపీనాథ మదనమోహన పునిబంసీధర గోవింద ॥ వ్రజ ॥

6. వ్రజమోహన వ్రజరమణ మనోహర వ్రజుత్సవ వ్రజనాథ
వ్రజజీవన వ్రజవల్లభ సబకే వ్రజకిశోరశుభగాథ ॥ వ్రజ ॥

7. వ్రజమోహన వ్రజసోహన భూషణ వ్రజనాయక వ్రజచంద
వ్రజనాగర వ్రజఛైల ఛబీలో వ్రజవరశ్రీనందనంద ॥ వ్రజ ॥

8. వ్రజఆనంద వ్రజదూలతహ నితహీ అతిసుందర వ్రజలాల
వ్రజగవునకే ఆఛేపాఛే సోహత వ్రజగోపాల ॥ వ్రజ ॥

9. వ్రజసంబంధీ నామ లేతయే । వ్రజకీ లీలాగావై
నాగరిదాసహి మురళీవాలో వ్రజకో ఠాకురభావై ॥ వ్రజ ॥

వ్రజపురముతో సమానమగు స్థానము వేఱొకటి లేదు. ఈ వ్రజపురమున నెల్లరు పరమేశ్వరుని సుందరనామమును స్మరించి తరించిరి.

1. గర్గాచార్యుడు కృష్ణ! కృష్ణ ! యని నామస్మరణము సేయుచున్నాడు వినుము. అందఱు బాలక్రీడల యానందమున నిమగ్నులైయున్నారు.

2. శ్రీదామోదరుడు యశోదకుమారుడు. నవనీతప్రియుడు. పెరుగును దొంగలించినవాడు. చీరలను హరించినవాడు. గోపికా చిత్తచోరుడు. చతురుడు. శృంగారము కలవాడు. నూతన కిశోరావస్థయందున్నవాడు.

3. రాధాచంద్ర చకోరుడు, శ్యామసుందరుడు, గోకులచంద్రుడు, పెరుగును దానము చేసినవాడు. బృందావనమునకు చంద్రునివలె నాహ్లాదమును గలిగించువాడు. చతురమయిన చిత్తముగలవాడు. ప్రేమస్వరూపుడు. అభిమానము గలవాడు,

4. రాధారమణుడు, రాధావల్లభుడు, రాధాకాంతుడు, గోపీజనవల్లభుడు, గోవర్థనగిరిని ధరించినవాడు. కాంతిపుంజమైనవాడు.

5. రసికవిహారి, రాసక్రీడలలో విహరించువాడు, కుంజములందు విహరించినవాడు. వనములందు విహరించినవాడు. త్రిభంగీలలిత స్వరూపము గలవాడు, విలాసముగలవాడు, గోపబాలురతో విహరించువాడు. రసికుడు, గోపీవల్లభుడు, మదనమోహనుడు, వంశిని ధరించినవాడు, గోవిందుడు.

6. వ్రజపురవాసులకు మోహమును గలిగించినవాడు. వారికి రమణుడు. మనోహరుడు, వ్రజానంద విధాయకుడు, వ్రజనాథుడు, వ్రజవాసులకు జీవనాధారభూతుడు, వ్రజజనవల్లభుడు, మంగళప్రదమైన చరిత్రము గలవాడు.

7. వ్రజజనమోహనుడు, శోభనుడు, వ్రజజనభూషణుడు, వ్రజజననాయకుఁడు. వ్రజజనమున కాహ్లాదమును ఘటించువాడు. వ్రజనగరవాసి, వ్రజపురమున నుండు శృంగారమూర్తి. వ్రజవాసులప్రభువు, నందనందనుడు.

8. వ్రజజనుల కానందము నొదవించువాడు. వ్రజపురమున వసించు నిత్య నూతనవరుడు, అతిసుందరుడు, అతని వెనుక, ముందును వ్రజపుర వాసులగు గోపబాలురు శోభించుచుందురు.

9. నాగరిదాసు వ్రజవల్లభుని నామమును స్మరించి తల్లీలలను గానము సేయును. అతనికి మురళీధరు డెంతయు బ్రియమయినవాడు.

## 69. నందలాల గోపాల దయాల్ హరే

నందలాల గోపాల దయాల్ హరే । బృందావన మోహె బులాలేనా,
మేరి అఁఖోంసే పరదా దు ఈకా హఠా। ముఝే రూపమేఁ అపనే రమాలేనా.

జోగిబనకే మైఁ అలఖ జగాయా కరూఁ।వ్రజభూమి కి ధూల్ రమాయా కరూఁ,
తేరే ఆఠోఁ పహర గుణ గాయా కరూఁ । ముఝే మధుబన శ్యామా బులాలేనా.
మేరే దిల్ మేఁ హై సేవామైతేరీ కరూఁ । తేరి మాధురమూరత కో దేఖ జివూఁ,
తేరే చరణోంకే ధోధోకె రోజ్ పివూఁ । ముఝే చరణోంకా దాస బనాలేనా.

మేరే కానోం మేఁ మురళి కి తాన రహే। ఉర సాఁవలి సూరత కాధ్యాస రహే,
మేరే ప్రాణోం మేఁప్రాణ సమాన రహే। మేరే నైనోం మేఁ ఆసన్ జమాలేనా.

మిలే భక్తోం కే కామోం సే ఔసర్ అగర్।జరా దీననపై కరనదయా కి నజర్,
జభీ ఉమ్డదే తుమ్హారా కృపాసాగర్ । పహలే బేడేకో పార లగాదేనా.

నందకుమార ! గోపాల ! దయాలూ ! హరీ ! నన్ను బృందావనమునకు పిలిపించుకొనుము. నా కన్నులనుండి తెరను తొలగించి వేయుము. నన్ను నీరూపముతో విలీన మొనరించుకొమ్ము. యోగినై నేను నిన్ను ధ్యానము చేసి కొందును. వ్రజభూమియందలి పవిత్రమైన ధూళిని ఒడలికి పూసుకొందును. ఎనిమిది జాములందును నీ గుణములను గానము చేసికొందును. శ్యామసుందరా! నన్ను మథువనమునకు పిలిపించుకొనుము. నీకుసేవచేయవలెనని నాకు కుతూహల ముకలదు. నీ మదురమైన రూపమును జూచుచు జీవింతును. నిత్యము నీపాదము లను కడిగి. ఆ నీరమును గ్రోలుదును. నన్ను నీ చరణదాసునిగా జేసి కొనుము. నాచెవులలో మురళీరసము ఎల్లపుడు పడుచుండవలెను. నా హృదయములో నీ శ్యామసుందర స్వరూపముయొక్క ధ్యానము నెలకొనవలెను. నా ప్రాణములలో నీ ప్రాణము లైక్యము నొందవలెను. నీవు సదా నాకన్నులలో స్థిరడువై నుండవలెను. భక్తజనపాలన కార్యము పూర్తియైనమీదట నవకాశము చిక్కినచోఁరవంత యీ దీనుని కరుణాదృష్టితో కనుగొనుము. ఎప్పుడు నీ హృదయమందలి కరుణాసముద్రము పొంగి పొరల నారంభించునో అప్పుడు ముందుగా ఈ దీనునుద్ధరించి ఒక యొడ్డునకు జేర్చుము.

## 70. బసో మోరేఁ నైనమేఁ నందలాల్

బసో మోరేఁ నైనమేఁ నందలాల్

1. సాఁవర సూరత సోహని మూరత నైనబనే విశాల ॥ బసో ॥

## 126. నామజపన క్యూ ఛోడ్‌దియా

నామజపన క్యూం ఛోడ్ దియా । క్రోధ న ఛోడా ఝూట న ఛోడ
సత్యవచన క్యూం ఛోడా దియా ॥ నామా ॥

ఝూటే జగ మెదిల్ లలచాకర । అసలవతన క్యూం ఛోడ దియా
కౌడీ కో తూ ఖూబ్ సమ్భలా । రామ రతన క్యూం ఛోడ దియా ॥ నామా ॥

జెహి సుమిరన తె అతి సుఖ పావై । సో సుమిరవ క్యూం ఛోడ దియా
ఖాలస ఇక భగవాన్ భరోసే । తన మన ధన క్యూంనఛోడ దియా। నామా।

ఓయి అవివేకీ ! నీవు కోపమును త్యజింపలేదే ? అసత్యమును త్యజింపలేదే? భగవన్నామ జపము నేల విడిచిపుచ్చితివి? సత్యము నేల పరిత్యజించితివి ?

నశ్వరమైన యీలోకమున ఆశలుపెట్టుకొని, స్వదేశమును (పరలోకము) ఏల పరిత్యజించితివి?

పైసను పరమభద్రముగ జూచు నీవు పద్మరాగమణివంటి భగవన్నామము నేల విడచిపెట్టితివి?

నామస్మరణమువలన అత్యంత సౌఖ్యము కలుగుచున్నది కదా! దాని నేల విడచిపెట్టితివి.

నీవు చేయవలసిన దిది కాదు. ఒక్క భగవంతునిపై భారముంచి శరీరముపై, మనస్సుపై, ధనముపై గల ఆసక్తిని దిగనాడుము. ఓ అవివేకీ! నీవు వీని నేల విడువలేదు? (ఖాలస అనే గురునానక్ శిష్యుడు హెచ్చరించుచున్నాడు)

## 127. భజ గోవింద గోవింద హోబావరె

చారవేద కియే వ్యాసనె అరథ విచార విచార
తామె నికసి భక్తి రామనామ తత్‌సార్ ॥
భజగోవింద గోవింద హోబావరె ఏకతేరాహి సహార హో భావరె ॥
బావరే సావరే బావరే..............సావరే ॥
గోవింద గోవింద గోవింద గోవింద గోపాల గోపాల గో....వింద గోపాల।పక
జబ ఆయ సంసారమె జగహసా తూ రోయి

ఐసి కరణి కర చలోకితుమ హసో జగరోయి ॥ భజో ॥
నామజపత కుష్ఠీ ఫలా చుని చునికరె జోబోయె

కంచన దేహి కిస కామకా, జాముఖ నాహిరామ ॥ భజో ॥
సకల గ్రంధ కా అర్థహై సకల బాతకిబాత్
దరియా సుమిరిణ రామకో కరలీజె దినరాత్ ॥ భజో ॥

రామ బినా ఫీకాలగె సబశాస్త్రజ్ఞాన
దరియా దీపక కాకరె ఉదయ భయో భాను ॥ భజో ॥

## 128. గోపాల గోవింద కృష్ణవాసుదేవ

గోపాల గోవింద కృష్ణ వాసుదేవ । రాధికా చంద్ర చకోర కృష్ణ వాసుదేవ
దామోదర అచ్యుత మురళీ మనోహర
వాసుదేవ హరి వాసుదేవ హరి వాసుదేవ ॥ వాసు ॥

దేవకీనందన శ్రీనివాస వాసుదేవ । విష్ణు హృషీ కేశ శౌరి వాసుదేవ
నారద మునీంద్రనుత నంద యశోదానంద ॥ వాసు ॥

భక్తవత్సల వేణుగోపాల వాసుదేవ । దీన బాంధవ కమలనయన వాసుదేవ
కృష్ణ రుక్మిణీ రమణ బాలగోపాల భవహరణ ॥ వాసు ॥

శ్యామసుందర మనోహరా వాసుదేవ । పద్మనాభ కమలేక్షణ వాసుదేవ
శ్యామల కోమల అంగ శేషశయన కేశవ ॥ వాసు ॥

నందనందన జనార్దన వాసుదేవ । దీననాథ దుఃఖభంజన వాసుదేవ
దయాసింధు ధరణీధర మంగళమందిర జయ ॥ వాసు ॥

గోపీనాథ మదనమోహన వాసుదేవ । నవనీతప్రియ దధిచోర వాసుదేవ
కృష్ణ కమలలోచన గోపీలోల వనమాలి జయ ॥ వాసు ॥

నిత్యనిర్గుణ నిరంజన వాసుదేవ । అతిమధుర సుందర రూప వాసుదేవ
చారు చంద్రావతంస చందనా లేపనాంగ ॥ వాసు ॥

ముక్తిదాయకా ముకుందా వాసుదేవ । యాదవేంద్ర యదు భూషణా
వాసుదేవ
కేవల గోపాలవనమాలి రమావల్లభ ॥ వాసు ॥

శ్రీవత్స లక్షణాంచిత వాసుదేవ । గోవత్స గణసంవృత వాసుదేవ
దేవ గంధర్వసేవిత మునివందిత ఆనందిత ॥ వాసు ॥

భక్తమందార వరధీర వాసుదేవ । పరమానంద దివ్యసుందర వాసుదేవ
భవబంధన విమోచక ద్వారకానాయక ॥ వాసు ॥

నీలమేఘ శ్శరీర వాసుదేవ । జగన్మోహన గిరిధర వాసుదేవ
నవ నీత చోర నరనారాయణావతార ॥ వాసు ॥

నవ నవనీత రసిక వాసుదేవ । అగణిత లోకనాయక వాసుదేవ
భవ్యయోగి భయవారకా భక్తోద్ధారకా ॥ వాసు ॥

కస్తూరీ శోభితానన వాసుదేవ । కంజలోచన నిరంజన వాసుదేవ
పుణ్యశ్రవణ కీర్తన పుష్క రేక్షణ పురాతన ॥ వాసు ॥

అనంత కళ్యాణ గుణ వాసుదేవ । సకల లోక శరణ్యా వాసుదేవ
పూతనా జీవితహర వామన సనాతనా ॥ వాసు ॥

అనాది బ్రహ్మచారీ వాసుదేవ । నరకాంతక మురారీ వాసుదేవ
ముష్టి కాసుర చాణూర మల్లయుద్ధ విశారద ॥ వాసు ॥

కంసారి సంసార వైరి వాసుదేవ । బృందావనాంత సంచారీ వాసుదేవ
జలక్రీడా సమాసక్త గోపీవస్త్రాపహారక ॥ వాసు ॥

పన్నగాసన వాऽహన వాసుదేవ । బర్హిబర్హావ తంసకా వాసుదేవ
కాళీయఫని మాణిక్య రంజిత పదారవింద ॥ వాసు ॥

ఓంకార స్వరూప వాసుదేవ । నళిన దళలోచన వాసుదేవ
మోహన మురళిధర జయగోవర్ధనధర ॥ వాసు ॥

భక్తవర ప్రహ్లాద వరద వాసుదేవ । గదా పద్మ శంఖ చక్ర ధర వాసుదేవ
వసిష్ఠ వామదేవ శుక శౌనక వందిత ॥ వాసు ॥

తేజోమయ నిరంజన వాసుదేవ । వాజసన వసుప్రద వాసుదేవ
సురానంద సువర్ణ సుతప పూతాత్మా ॥ వాసు ॥

దేవేంద్ర దురతిక్రమ వాసుదేవ ! వారుణ సంజ్కర్షణ వాసుదేవ
యదుపతి యజ్ఞపతి భూతపతి భూపతీ ॥ వాసు ॥

పరాత్పర పరాకాశ వాసుదేవ । చిదానంద చిదాకాశ వాసుదేవ
చిన్మయ అమృతమయ చరాऽచరమయ ॥ వాసు ॥

భక్త భక్త ఉరచందన వాసుదేవ । వాసవాది మునివందిత వాసుదేవ
అవధూతేంద్ర సేవిత సంతత ఆనందిత ॥ వాసు ॥

## 129. మూరఖజనమ గవాయో

కరి అభిమాన విషయ రస రాచో
నామ శరణ నహి ఆయో, రేమన మూరఖ జనమ గవాయో ।
యహ సంసార భూలసె మరకాయో
పునివునికె కిరపాయో, చాకన లాగో వుడగయి రూయి
హాతకచునహి ఆయో ॥ రేమన మూరఖ ।
కహా భయో అబకె మనలాయో । పహలె నహికమాయో ।
సూరదాస హరినామ భజనబిన ।
సిరధుని ధుని పచితాయో ॥ రేమనమురఖ ॥॥ హరేరామ ॥

## 130. సుమిరన కరలె

సుమిరన కరిలే నామ సుమిరలే కోజా నై కలకీ
జగతమెుఁఖబర నహీఁ పలకీ ।

ఝూఠకపట కరి మాయా జోరిన బాత కరై ఛలకీ
పాపకీ పాట ధరే సిర వూపర కిసవిధివ్హైహలకి ॥ జగ ॥

యహ మన తో హైహస్తీ మస్తీ కాయ మిట్టీకీ
సాఁస సాఁసమె నామె సుమిరిలె అవధి ఘటైతనకీ ॥ జగ ॥

కాయా అందర హంసాబోలై ఖుసియాఁ కర దిలకీ
జబ యహ హంసా నికల జాయింగే మట్టీ జంగలకీ ॥ జగ ॥

కామ క్రోధ మద లోభ నివారో బాత యహఅస్సలకీ
జ్ఞాన వైరాగ దయా మన రాఖో కహై కబీరదిలకీ ॥ జగ ॥

ఓయీ ! భగవన్నామమును స్మరింపుము. నామస్మరణమే ప్రధాన కర్తవ్యయము. రే పేమగునో నీకుఁ దెలియునా? తెలియదు. ఈ లోకము నందు మరునిముసము మనదికాదు. అది ఎట్లుండునో ఎవ్వరును ఎఱుఁగరు. అందుచే భగవన్నామమును స్మరింపుము.

ఓయీ ! అసత్యము, వంచన, మాయపలుకులయందు నింపుచుంటివి. పాపమును సంపాదించుచుంటివి. ఈ పాపభారము శిరమునందుండగా నీవు అడగి

పోయెదవుకాని లేవనే ర్తువా? అది అసంభవము. అందుచే భగవన్నామమును స్మరింపుము. ఈ లోకమునందు మరునిముసమునం దేమి జరుగునో నీ వెఱుఁగవు.

ఓయయ్యా! నీ అయువు క్షణక్షణము తరుగుచున్నది, ఈనీ మనస్సు చంచలమైనది. శరీరమా మట్టితో నిర్మితమై క్షణభంగురమైనది. అందుచే ఉచ్ఛ్వాస నిశ్వాసలతో నామమును స్మరింపుము.

ఓయీ ! జీవుఁ డున్నంతవరకే యీ శరీర మిట్లుండును. జీవుఁడు తొలఁగి నంతనే మట్టి మిగులును. అందుచే ఉత్తరక్షణమునం దేమి జరుగునో తెలియదు గాన భగవన్నామమును స్మరింపుము.

ఓయీ ! నేను(కబీరుదాసు) సత్యమైన, నికరమైన మాటను చెప్పుచుంటిని. ఆలకింపుము. కామక్రోధములను, మదలోభములను విడనాడి జ్ఞాన వైరాగ్యములను దయాస్నేహములను మనస్సున నెలకొల్పుము. భగవన్నామమును స్మరింపుము.

## 131. షట్ పదీ స్తోత్రమ్

అవినయ మపనయ విష్ణో దమయ మనః

శమయ విషయ మృగతృష్ణామ్,

భూతదయాం విస్తారయ తారయ । సంసార సాగరతః ॥

దివ్యధుని మకరన్దే పరిమళ పరిభోగ సచ్చిదానందే ।
శ్రీపతి పదారవిన్దే భవభయ ఖేదచ్ఛిదే వందే ॥

సత్యపి భేదాపగమే నాథ తవాహం న మామకీనస్త్వం ।
సాము-ద్రోహి తర్గజ్ఞః క్వచ న సముద్రో న తార్గజ్ఞః

ఉద్ధృతనగ నగభి దనుజ దనుజకులా మిత్ర మిత్రశశిదృష్టే !
దృష్టే భవతి ప్రభవతి నభవతి కింభవ తిరస్కారః ॥

మత్స్యాదిభిరవతారై రవతా సదా వసుధాం ।
పరమేశ్వరపరిపాల్యో భవతా భవతాపభీతోఽహమ్

దామోదర గుణమందిర సుందర పదనారవింద గోవింద ।
భవజలధి మథన మందిర పరమందర మపనయత్వం మే ॥

నారాయణ కరుణామయ శరణంకరవాణి తావకౌ చరణౌ
ఇతి షట్ పదీ మదీయే వదన సరోజే సదా వసతు ॥

## 132. అన్నారా విన్నారా వెంకటరమణుని చూచారా

వేంకటేశో వాసుదేవః వారిజాసన వందితః ।
స్వామి పుష్కరిణి వాసః శంక చక్ర గదాధరః
పీతాంబర ధరో దేవః గరుడా రూఢ శోభితః ।
విశ్వాత్మా విశ్వలోకేశః విజయో వేంకటేశ్వరః ॥

అన్నారా ! విన్నారా ! మీరూ వెంకటరమణునిచూచేరా!

ఏడుకొండల వెంకటరమణా । వెంకటరమణా సంకటహరణా
దయానిధే వెంకటరమణా । అనాథనాథ వెంకటరమణా

అఖండరూప వెంకటరమణా । అనంతరూప వెంకటరమణా
అనంతవైభవ వెంకటరమణా । ఆపద్బాంధవ వెంకటరమణా

శేషాద్రినిలయా వెంకటరమణా । పురాణపురుషా వెంకటరమణా
పంకజలోచన వెంకటరమణా । అక్రూరవరదా వెంకటరమణా ॥ అన్నారా॥

లక్ష్మీనాథా వెంకటరమణా । అలివేలు దేవా వెంకటరమణా
భక్తవత్సలా వెంకటరమణా । పాహిమాం ప్రభు వెంకటరమణా॥ అన్నారా॥

## 133. శ్రీ భ్రమరాంబాష్టకమ్

రవిసుధాకర వహ్నిలోచన రత్నకుండల భూషిణీ
ప్రవిమలంబుగ మమ్మునేలిన భక్తజన చింతామణీ,
అవనిజనులకు కొంగుబంగారైన దైవశిఖామణీ
శివుని పట్టపురాణి గుణమణి శ్రీగిరిభ్రమరాంబికా.

కలియుగంబున మానవులకును కల్పతరువై యుండవా
వెలియగను శ్రీ శిఖరమందున విభవమై విలసిల్లవా,
ఆలసింపక భక్తవరులకు అష్టసంపద లీయవా
జిలుగుకుంకుమ కాంతి రేఖల శ్రీగిరిభ్రమరాంబికా.

అంగ వంగ కళింగ కాశ్మీరాంధ్ర దేశములందును
పొంగుచును వరహాట కొంకణ పుణ్యభూములయందును,
రంగుగా కర్ణాట రాట మరాట దేశములందును
శృంగేణీ దేశముల వెలసిన శ్రీగిరిభ్రమరాంబికా.

అక్షయంబుగ కాశిలోపల అన్నపూర్ణ భవానివై
సాక్షిగణపతి గన్నతల్లివి సద్గుణావతి శాంభవీ,
మోక్ష మొసగెడు కనకదుర్గవు మూలకారణ శక్తివీ
శిక్ష జేతువు ఘోరభవముల శ్రీ గిరిభ్రమరాంబికా.

ఉగ్రలోచన నటవధూమణి కొప్పుగలిగిన భామినీ
విగ్రహంబుల కెల్ల ఘనమై వెలయు శోభన కారిణీ,
అగ్రపీఠమునందు వెలసిన అగమార్థవిచారిణీ
శీఘ్రముగను వరములిత్తువు శ్రీగిరిభ్రమరాంబికా

నిగమగోచరనీయ కుందననిర్మలాంగి నిరంజనీ
మిగులచక్కని పుష్పకోమలి మీననేత్ర దయానిధీ,
జగతిలోన ప్రసిద్ధికెక్కిన చంద్రముఖి శ్రీమంతినీ
చిగురుటాకులవంటి పెదవులు శ్రీగిరి భ్రమరాంబికా.

సోమశేఖర పల్లవాధరి సుందరీమణి ధీమణి
కోమలాంగి కృపాపయోనిధి కుటిలకుంతల యోగినీ
నామనంబును బాయకుండుమ నగులేశునినందినీ
సీమలోన ప్రసిద్ధికెక్కిన శ్రీగిరి భ్రమరాంబికా.

భూతనాథుని వామభాగము పొందుగా చేకొంటివా
ఖ్యాతిగను శ్రీశైలమున విఖ్యాతిగా నెలకొంటివా,
పాతకంబుల బారద్రోలుచు భక్తులను చేకొంటివా
శ్వేతగిరిపై వెలసినట్టి శ్రీగిరి భ్రమరాంబికా.

ఎల్ల వెలసిన నీ ప్రభావము విష్ణులోకమునందున
పల్లవించెను నీదుభావము బ్రహ్మలోకమునందున,
తెల్లముగ కైలాసమందున మూడులోకములందున
చెల్లునమ్మ త్రిలోకవాసిని శ్రీగిరిభ్రమరాంబికా.

తరుణ శ్రీగిరి మల్లి కార్జున దైవరాయల భామినీ
కరుణతో మమ్మేలు మెప్పుడు కల్పవృక్షముభంగినీ,
వరుసతో నీ అష్టకంబును వ్రాసి చదివినవారికీ
సిరుల నిత్తువు నెల్లకాలము శ్రీ గిరి భ్రమరాంబికా.

శాంభవీ జయ జయమా భైరవీ జయ జయమా

| | | |
|---|---|---|
| భగవతీ ॥ జయ ॥ | శాంకరీ ॥ జయ ॥ | శ్యామలా ॥ జయ ॥ |
| శారదా ॥ జయ ॥ | సరస్వతీ॥ జయ ॥ | పార్వతీ ॥ జయ ॥ |
| వైష్ణవీ ॥ జయ ॥ | మాధవీ ॥ జయ ॥ | మహేశ్వరీ॥ జయ ॥ |

జయమా జయమా జయ జయమా జయ జగదంబా జయ జయమా
యాదేవీ సర్వభూతేషు శక్తి రూపేణ సంస్థితా
నమ స్తస్యై నమ స్తస్యై నమ స్తస్యై నమో నమః
(మాతృరూపేణ, శాంతిరూపేణ, భ్రాంతి రూపేణ, భక్తి రూపేణ, భావరూపేణ, జ్ఞాన రూపేణ, వైరాగ్యరూపేణ, దుఃఖరూపేణ, సుఖరూపేణ, కర్మరూపేణ, స్పర్శ రూపేణ)

| | | |
|---|---|---|
| నారాయణి ॥ జయ ॥ | కాత్యాయినీ ॥ జయ ॥ | దాక్షాయణి ॥ జయ ॥ |
| రుద్రాణి ॥ జయ ॥ | బ్రహ్మాణీ ॥ జయ ॥ | నారాయణి ॥ జయ ॥ |

అన్న పూర్ణె సదాపూర్ణె శంకర ప్రాణ వల్లభె ।
భక్తిజ్ఞాన వైరాగ్య సిద్ధ్యర్థం బిక్షాందేహీచపార్వతీ

| | |
|---|---|
| జయ భ్రమ రాంబా ॥ జయ ॥ | జయ శారదాంబా ॥ జయ ॥ |
| జయ భువన్వేరి ॥ జయ ॥ | జయ అఖిలాండేశ్వరి ॥ జయ ॥ |
| జయ కామేశ్వరి ॥ జయ ॥ | జయ పరమేశ్వరి ॥ జయ ॥ |
| జయ జగదీశ్వరి ॥ జయ ॥ | జయ లలితాంబ ॥ జయ ॥ |
| జయ విశ్వేశ్వరి ॥ జయ ॥ | రాజరాజేశ్వరి ॥ జయ ॥ |
| జయ అన్నపూర్ణ ॥ జయ ॥ | త్రిపురసుందరి ॥ జయ ॥ |

దుర్గాకాళీ లక్ష్మీమా, సీతారాధా రుక్మిణి మా
ఉమా రమా బ్రహ్మణీ జయ జయ జయ జయ మా జయ జయ మా॥

## 134. దేవీస్తవము

సర్వ దేవమయీ దేవీ సర్వదేవీ మయంజగత్ ।
అతో౽హం విశ్వరూపాం త్వాం నమామి పారమేశ్వరీం ॥

యత్రాస్తి భోగో నచతత్రమోక్షో । యత్రాస్తి మోక్షో నచ తత్రభోగః ।
శ్రీ సుందరీ సేవన తత్పరాణాం । భోగశ్చ మోక్షశ్చ కరస్థ ఏవ ॥ 2 ॥

మంత్రాణాం మాతృకాదేవీ శబ్దానాం జ్ఞాన రూపిణీ
జ్ఞానానాం చిన్మయా తీతా శూన్యానాం శూన్య సాక్షిణీ
యస్యాః పరతరం నాస్తి సైషా దుర్గా ప్రకీర్తితా ॥ 3 ॥

లక్ష్మీ ప్రదాన సమయే నవవిద్రుమాభాం
విద్యాప్రదాన సమయే శరదిన్దుశుభ్రాం ।
విద్వేషవర్గవిజయే హరినీలవర్ణా
మమ్బాం త్రిలోక జననీం ప్రజనీం ప్రపద్యే ॥ 4 ॥

1) సత్స్వరూపిణి 2) చిత్స్వరూపిణి 3) ఆనందస్వరూపిణి ॥

ఏకైక శక్తిః పరమేశ్వరస్య । వివిధా వదన్తి వ్యవహార కాలే ।
భోగే భవానీ పురుషేషు లక్ష్మీ । కోపేతు దుర్గా ప్రళయేతుకాళీ । ॥ 5 ॥

అపత్సు మగ్నః స్మరణం త్వదీయం । కరోమి దుర్గే కరుణార్ణవే శివే ।
నైతచ్ఛఠత్వం మమభావయేథాః క్షుధాతృషార్తా జననీం స్మరన్తి ॥ 6 ॥

## 135. దుర్గనామావళి

దుర్గా దుర్గార్తిశమనీ దుర్గాపద్వి నివారిణి ।
దుర్గమచ్ఛేదినీ దుర్గసాధినీ దుర్గనాశినీ ॥

దుర్గతోద్ధారిణీ దుర్గనిహంత్రీ దుర్గమాపహా ।
దుర్గమ జ్ఞానదా దుర్గదైత్యలోకదావానలా ॥

దుర్గమా దుర్గమాలోకా దుర్గమాత్మ స్వరూపిణీ ।
దుర్గమార్గప్రదా దుర్గమవిద్యా దుర్గమాశ్రితా ॥

దుర్గమజ్ఞాన సంస్థానా దుర్గమ ధ్యానభాసినీ ।
దుర్గమోహా దుర్గమగా దుర్గమార్థ స్వరూపిణీ ॥

దుర్గమాసుర సంహంత్రీ దుర్గమాయుధ ధారిణీ ।
దుర్గమాంగీ దుర్గమతా దుర్గమ్యా దుర్గమేశ్వరీ ॥

దుర్గభీమా దుర్గభామా దుర్గభా దుర్గధారిణీ ।

నామావళిమిమాం యస్తుదుర్గాయాః మమమానవః ।
పఠేత్సర్వభయాన్ముక్తో భవిష్యతి న సంశయః ॥

## 136. వరదే వరదే వరదే

వరదే వరదే వరదే....
మాతః భవ్య భావనా భరదే । కామ క్రోధ మదలోభ ఈర్ష్యా
ద్వేష హృదయసే హరదే ॥ ॥ మాతః ॥

చిత చంచల చహుఁడీర ఫిరతాహై - చరణ కమలమే కరదే
ముఖసేనికలె మధుర వచనమా । ఐసా సుందర వరదే ॥ మాతః ॥

నితప్రతిపేరీ దయాదృష్టిహో । యహీ యేక అబ వరదో
మయ్యామేరీ నత మస్తకహూఁ । వరద హస్త శిర ధరదే ॥ మాతః ॥

## 137. శివే దేవి శివే దేవి

1. శివేదేవి శివేదేవి మాతరంబ శివే శివే !
అపర్ణేంఒబ శివే శ్యామే దేవి మాత రుమే రమే !

2. దుర్గా మహేశ్వరి దుర్గతినాశిని । పరమా పార్వతి పాపవినాశని

3. దుర్గతినాశని దుర్గా జయ జయ । కాలవినాశని కాలీ జయ జయ.

4. ఉమారమా బ్రహ్మాణీ జయ జయ । సీతా రాధా రుక్మిణీ జయ జయ

5. సాంబసదాశివ సాంబసదాశివ । సాంబసదాశివ సాంబశివా

## 138. సత్యజ్ఞానానందమయీమా

దుర్గే స్మృతా హరసి భీతి మశేసజన్తో ॥
స్వస్థైః స్మృతా మతి మతీవ శుభాం దదాసి
దారిద్ర్య దుఃఖభయహారిణి కా త్వదన్యా
సర్వోపకారకరణాయ సదార్ద్ర చిత్తా

సత్యజ్ఞానానందమయీ మా
అద్వయబ్రహ్మ సనాతనీ మా
అవ్యక్తా, మూలప్రకృతిఃమా
సత్త్వరజస్త మోగుణమయీ మా
సృష్టిస్థితిలయ కారిణీ మా
విశ్వలీలరసమయీ మా
మహదాత్మస్వరూపిణీ మా
అహమాత్మవిలాసినీ మా
శబ్దమయీ మా వ్యోమమయీ మా
స్పర్శమయీ మా వాయుమయీ మా

రూపమయీ మా తేజోమయీ మా
రసమయీ మా జలమయీ మా
గంధమయీ మా క్షితిమయీ మా
కర్మవా గింద్రియమయీ మా
త్వచాపాణీంద్రియమయీ.మా
చక్షుః పాదేంద్రియమయీ మా
రసనోపస్థేంద్రియమయీ మా
నాసాపాయింద్రియమయీ మా
జ్ఞానకర్మేంద్రియమయీ మా
కల్పనారూపిణి మనోమయీ మా
దేశకాలస్వరూపిణి మా
ప్రాణా పానస్వరూపిణీ మా
వ్యానో దాన స్వరూపిణీ మా
సమానశక్తి స్వరూపిణి మా
పంచప్రాణ స్వరూపిణీ మా
పంచీకృత మహాభూత మయీ మా
నామరూపక్రియామయీ మా
షడ్భావవికారరూపిణీ మా
అన్నమయకోశ రూపిణీ మా
ప్రాణమయకోశరూపిణీ మా
మనోమయకోశరూపిణీ మా
విజ్ఞానమయకోశరూపిణీ మా
ఆనందమయకోశరూపిణీ మా
కోశపంచక ప్రావృతా మా ॥ సత్య ॥
జాగ్రత్స్వప్న సుషుప్తిమయీ మా
కల్పితాఽభిమానినీ మా
విశ్వతైజస రూపిణీ మా
ప్రాజ్ఞనామధారిణీ మా
రాగద్వేష స్వరూపిణీ మా
స్వర్గరూపిణీ సుఖమయీ మా
నరకరూపిణీ దుఃఖమయీ మా
బద్ధజీవస్వరూపిణీ మా
జన్మమృత్యుసంపీడితా మా
నానాయోనివిచారిణీ మా ॥ సత్య ॥
అతృప్తి రూపిణీ సంస్కృతి మా
త్రితాపతప్తా ఆర్తా మా
దీనా మలినా కాంగాలినీ మా
కాతరప్రార్థనా రూపిణీ మా
అశిషదాయినీ స్నేహమయీ మా
శ్రద్ధావిశ్వాసరూపిణీ మా
శిష్యస్తే ఽహం భాషిణీ మా
శ్రీగురురూపిణీ కృపామయీ మా
మాభైర్మాభైర్భోషి ణీమా
నహినహిబద్ధ శ్రావిణీ మా
సత్యం త్వంభో ర్భాషిణీ మా
అశ్వాసదాయినీ స్నేహమయీ మా
స్నేహస్తన్యపాయినీ మా
బుద్ధియోగప్రదాయినీ మా
సత్యప్రతిష్ఠారూపిణీ మా
చిదాకాశస్వరూపిణీ మా
బ్రహ్మగ్రంధివి భేదినీ మా
ప్రాణసంధానదాయినీ మా
ప్రాణరూపిణీ ప్రాణమయీ మా
ప్రాణప్రతిష్ఠారూపిణీ మా
కృతజ్ఞభావోద్భోధినీ మా
విష్ణు గ్రంధి విభేదినీ మా
చిన్మయీ మా చిన్మయీ మా
అంతర్బాహ్య వ్యాపినీ మా

చిన్మయీ మా చిన్మయీ మా
మధుమయీ మా మధుమయీ మా
మహతీ బుద్ధిరూపిణీ మా
అస్మితారూపిణీ ఈశ్వరీ మా
మధుమయీ మా అమృతమయీ మా
జ్ఞాన స్యన్యప్రదాయినీ మా
విశుద్ధబోధస్వరూపిణీ మా
పరమానందరూపిణి మా
నిర్మల శాన్తిరూపిణీ మా
అవాంగ్మనో గోచరా మా
అజ్ఞానబంధనహారిణి మా
రుద్రగ్రంధి విభేదినీ మా
సర్వకర్మక్షయకరీ మా
కేవలానందరూపిణీ మా
నాంతర్బాహ్యపూరితా మా
మోక్షదాయినీ, ఆదరిణీ మా

భక్తిరసపరిషించితా మా
ఆదరణీ మా స్నేహమయీ మా
అనుభూతి మా అనుభూతి మా
సర్వదుఃఖ సంహారిణీ మా
సర్వసంతాపనాశినీ మా
ఆనంద ప్రతిష్ఠారూపిణీ మా
సాక్షాదాత్మస్వరూపిణీ మా
నిరస్తభేదప్రతీతా మా
విశుద్ధసత్తారూపిణీ మా
మధుమయీ మా ప్రేమమయీ మా
మధుమయీ మా ప్రేమమయీ మా
సర్వ సంశయచ్ఛేదినీ మా
జన్మమృత్యువినాశినీ మా
అంతర్బాహ్యపూరితా మా
మధుమయీ మా అమృతమయీ మా
పునరావృత్తి నాశినీ మా

జయ మా! జయ మా! జయ మా! జయ మా!
జయగురు జయమా! జయగురు జయమా !॥
మా ! మా ! మా ! మా! మా! మా ! మా! మా!

## 139. గౌరీ దశకమ్

శివేదేవి శివేదేవి మాతరంబ శివే శివే
అపర్ణేంబ శివేశ్యామ దేవిమాతరుమేరమే ॥

1. లీలాలబ్ధ స్థాపిత లుక్తాఖిల లోకామ్
లీలాతీతై యోవిధి రంతస్థిర మవ్యామ్
బాలా విద్యశ్రేణి సమానద్యుతి పుంజామ్
గౌరీ అంబా అంబురు హాక్షి మహమీడె ॥

దుర్గామహేశ్వరి దర్గతి నాశిని దుర్గేజయజయ
అంబ పరమేశ్వరి ఆనంద దాయని ఆశ్రిత రక్షిణి
అంబపరమేశ్వరి ఆనంద దాయిని ఆత్మస్వరూపిణి

2. ప్రత్యాహార ధ్యాన సమాధి స్తితి భాజామ్
నిత్యమ్ స్తితై నివృతి కాష్ఠామ్ కలయంతీ
సత్య జ్ఞానా నంద మయీమ్ తామ్ తను రూపామ్
గౌరీ అంబా అంబురు హాక్షి మ హామీడె ॥ దుర్గామహేశ్వరి ॥

3. చంద్రా పీడా లంబిత మందస్మిత వక్త్రామ్
చంద్రా పీడా లంకృత నీలాలస భాలామ్
నిరూపేంద్రార్చిత పాదాంబుజ యుగ్మామ్
గౌరీ అంబా అంబురుహాక్షి మహామీడె ॥ దుర్గామహేశ్వరి ॥

4. ఆదిధ్యాంతా మక్షర మూర్జః విల సంతీమ్
భుతే భూతే భూ తగదంబా ప్రచరిత్రీమ్
శబ్ద బ్రహ్మనంద మయీమ్ తానుతది తాపామ్
గౌరీ అంబా అంబురు హాక్షి మహామీడె ॥ దుర్గామహేశ్వరి ॥

5. మూలధారా విధృత విద్య విధదండమ్
గౌరం శాంతమ్ వ్యాప్త విహారద్గ లితాంగీమ్
ధ్యేయం సూక్ష్మాతి సూక్ష్మ తనుస్తామ్స్తితరూపామ్
గౌరీ అంబా అంబురుహాక్షి మహామీడె ॥ దుర్గామహేశ్వరి ॥

6. నిత్యః శుద్ధో నిష్కల ఎకో జగదీశః (జగదంబా శ్రీమాతా)
సాక్షీ యశ్యతర్గవిదౌ సంహరణేశ
విశ్వత్త్రాదన క్రీడన లోలామ్ విలతంత్రీమ్
గౌరి అంబా అంబురుహాక్షి మహామీడె ॥ దుర్గామహేశ్వరి ॥

7. యత్యాపుచ్ఛోళీన మఖంతమ్ జగదండమ్
భుయో భూయః ప్రాదుర భూతిద్ధిత మేవ
సత్యామార్గమ్ తాను తజితాం తౌ విహరం తీమ్
గౌరీ అంబా అంబురు హాక్షి మహా మీడె ॥ దుర్గామహేశ్వరి ॥

8. యశ్యామోసం క్రోధమశేషం మణిమాల
భూతేయద్వత్ త్వాపి చరంత్యాప్య చరంత
కామధ్యాత్మ జ్ఞాన పద వ్యాగమనీ యామ్
గౌరీ అంబా అంబురు హాక్షి మహా మీడె ॥ ॥ దుర్గామహేశ్వరి ॥

9. నానాకారై శక్తి గదంబై భువనారీ
వ్యాపత్యైనం క్రీడతి ఏవమ్ స్వయమేవ
కల్యాణం తామ్ కల్పలతా మానసి భాయా
గౌరీ అంబా అంబురు హాక్షి మహ మీడె ॥

10. ఆశాపాశ క్లేశ వినాశమ్ విదధానామ్
ఫాలాం భోజ ధ్యాన పరాణాం పురుషాణామ్
ఈశామీశార్ధ్యామ్యహరమ్ తామ్ మధిగామామ్
గౌరీ అంబా అంబురు హాక్షి మహమీడె ॥ ॥ దుర్గామహేశ్వరి ॥

11. ప్రాతః కాలే భావ విశుద్ధః ప్రణిధానామ్
భక్త్యా నిత్యమ్ జల్పతి గౌరీదశకమయః
వాచామ్ సిద్ధిమ్ సంపద మగ్ర్యామ్ సిద భక్తిమ్
తస్యావశ్యమ్ పర్వత పుత్రీమ్ విధధాతిమ్
గౌరీ అంబ అంబురుహాక్షి మహమీడె ॥ దుర్గామహేశ్వరి ॥
జయ జయమా జయ గౌరియా, జయమా జయమా జయగౌరిమా ॥

## 140. ఆపీత కుచాంబాష్టకమ్

ఆనందశింధులహరీ మమృతాం సుమౌళే
ఆసేవినామమృత నిర్మిత వర్తి అక్షోః
ఆనందవల్లి వితతే అమృతార్త సిద్ధ్యః
అంబాస్మరామ్య హమపీత కుచేవపుస్తే
నిర్మిద కోకనత కోమల కాంతమంబా
నిత్యం సుధానికర వర్షి పదం తదీయం
ముర్ఛాకరీ జ్వర రుజా మమతాపి తస్య
మూర్ద్వీక్షణం సకృదపీతకుచేనిదేహి
సీతాంషుకోటి షుషమా శికరైః కటాక్షైః
అవ్యాజ భుతకరుణా రసపూర్ణైః
కర్పూర ధూళిమివ దిక్షు సమాధిరధ్భిః
అంబా క్షణం స్నపయమాం అరుణాద్రి మామ్నొ
ఆవిర్భవక్షణ మపీతకుచే పురస్తాత్

అంబా జ్వరేణ మహతా మమతాపితస్య
యోన త్వదం ఘ్రి రుచిజాల సుధా ప్రవాహె
మగ్న స్త్వ దీయ తనుతాపమం త్యజేయం
నానావిధైః నళిన జాత లిపి ప్రహృతైః
ఆనీతమూర్ఛ మధికం సృజరితైః జ్వలాభైః
ఆశ్వాసయక్షణమపీతకు చే కరాగ్రక్రీడా
కనతకనక హల్యకస్తారభేణ
కంఠేవిషం విషముతో భు జ గాః కపర్దే
పార్శ్వేఛ భూతపతయః ప్రమథాశ్చ భీతః
శోణాచలే చ ఉపశ్రుత్వా భజేత కోవా
నశ్యాత్తవాంబ సన్నిధేయది సన్నిద్ధానం
శక్తి జగజ్జన పాలన భంజ నేషు
బోధేషు దివ్య మహిషీ కరుణేందు మౌళే
సిద్ధిః కర ప్రణయనీ తవసన్నిధానం
యన్నాసి తదంబబతదపీతకుచే నజానజానే
త్వం సాక్షిణీ ప్రళయ తాండవ భైరవాణాం
త్వం శేషిణి సహ విధాకృచ చరాచరాణాం
త్వం లోచనీ సకల సంస్కృతి జాల కానాం
త్వాం బ్రహ్మ సమ్మిద మపీత కుచేనమస్తె

జయ జగదంబా జయ జయమా
జయ దుర్గమా జయ దుర్గమా
జయమా జయమా జయ జయమా ! జయ దుర్గమా.....
అపీత కు చాంబపీ జయ జయమా
అరుణాచలేశ్వరీ జయ జయమా ! జయమా జయమా
సీతారాధ రుక్మిణి జయ జయ
ఉమరమా బ్రహ్మణీ జయ జయ
జయ జయమా జయ జయమా... ॥

## 141. పూతాను కంపా సమేత మాతా

పూతాను కంపా సమేతా మాతా ।
అగ్రగణ్య అచింత్యరూపా బ్రహ్మాత్మైక స్వరూపిణి
గౌరి గంధర్వ సేవితా ఉమాశైలేంద్ర తనయా ॥ పూతా ॥

ఆదిరూపా అనంతరూపా శివాత్మైక స్వరూపిణి
అప్రమేయ స్వప్రకాశ అయోనియోని నిలయా ॥ పూతా ॥

ఆ బ్రహ్మకిట జననీ ప్రేమ రూపాప్రియ స్కరి
బిందు మండలవాసిని ఓఢ్యాణ పీఠనిలయా ॥ పూతా ॥

శాంభావీ శాంకరీ శ్రీమత్ సింహాసనేశ్వరి
త్రిపుర సుందరి శివంకరి శ్రీచక్రరాజనిలయా ॥ పూతా ॥

భూతాని దుర్గ భువనానిదుర్గ స్త్రియో నరర్చాపిపశూశ్చ దుర్గా
యద్యయద భిరూపమ్ ఖలు దైవ దుర్గా
దుర్గాశ్చరూపమపరన్న కించన

## 142. రాధా రాధా రాధా రాధా రాధా గోవింద

రాధా రాధా రాధా రాధా రాధా గోవిందా బృందావన చందా
అనాథ నాథ దీనబంధో రాధా గోవిందా
శ్యామ సుందరా మనోహరాంగా రాధా గోవిందా ॥ బృం। అ ॥
పాండురంగా పురంధర రాధా గోవిందా ॥ బృం। అ ॥
పాండు రంగా పండరినాథా రాధా గోవిందా ॥ బృం। అ ॥
పాండురంగా జైరఖుమామి రాధా గోవిందా ॥ బృం। అ ॥
రాసబిహారి రసకబిహారి రాధా గోవిందా.. ॥ బృం। అ ॥
రూపరసాల నయనవిశాల రాధా గోవిందా ॥ బృం। అ ॥
జైజై విఠల జైహరి విఠలా రాధా గోవిందా, ॥ బృం। అ ॥
భక్తవత్సల భాగవతప్రియ స రాధే గోవిందా ॥ బృం। అ ॥

## 143. రాధారాణీకి జై మహారాణికి జై

రాధారాణీకీ జై మహారాణీకిజై । బోలో బరసానెవాలీకి జైజైజై ॥
బోలో ప్రేమ బరసానెవాలీకి జైజైజై । బోలో అమృత బరసానెవాలీకి జైజైజై।
బోలో కీర్తికుమారికి జైజైజై బోలో వృషభానుదులారికి జైజైజై ।
రాధే గోవిందా రాధే గోపాల ॥ రాధా ॥

రాధా రాసేస్వరి రాసవాసిని । రాధా రాసేస్వరి రసిక వాసిని ।

రాధా రాసేస్వరి కృష్ణ స్వరూపిణి । రసికేశ్వరి కృష్ణా కృష్ణ ప్రియా ।
కృష్ణ వామాంగ సంభూత పరమానంద రూపిణి ।
కృష్ణా బృందావని, బృందా బృందావన విహారిణి ।
బృందా బృందావన వినోదిని । చంద్రా చంద్రావరి చంద్రకాంతా శరశ్చంద్ర ప్రదాననా ॥

కీరతి కీరతి కువరికి కహి కహి థకె గణేశ
దశ శతముఖ వరణ కరత పారన పావత శిష ॥

అజ శివ సిద్ధ సురేష ముఖ జపత రహత వ్రజధామ
బాధా జినకి హరత్హై రాధా రాధా నామ
రాధా రాధా జేకహై తేన పరై భవపంథ
జాసు కంధ పర కమల కర ధరె రహత వ్రజచంద

రాధా రాధా కహత్హై జోనర ఆఠోయామ్
తె భవ సింధు ఉల్లంఘికై బసత్ సదా వ్రజధామ ॥ రాధారాణీకిజై ॥

సురరఖవారి సురరాజరఖవారి సుఖ।
శంభురఖవారి రివి చంద్ర రఖ వారిహై

ఋషిరఖవారి విధి వేద రఖవారి కరి
జానె రాణి కీరతి కి కీరతి సుభారీహై

దిక్ రఖవారి వ్రజ రాజ రఖవారి హరి
జన రఖ వారి వృషభాను కి దులారిహై ॥ రాధారాణీకిజై ॥

కోవూ వుమా రాజ రమారాజ జమరాజ కోవూ
కోవూ రామచంద్ర సుతకంద నామ నాధ్యేవి

కోవూ ధ్యావై గణపతి ఫణపతి సురపతి
కోవూ దేవ ధ్యాయె ఫలలేతె ఫల అధె మై

హరికో ఆధార నిరాధార కోఆధార తుహి

జప తప యోగ యజ్ఞ కచువైన సాధేమై
కటైకోటి బాధె ముని ధరత సమాధివ సె
రాధెపదె రావరె సదాహి అవరాధె మై ॥ రాధా రాణీకిజై ॥

నవనీతగులాబతె కోమలహై
హరి కంజకి మంజులతా ఇనమె
గులలాల గులాల ప్రబాల జపాఛబి
ఐసి ఢేఖిలలా ఇనమే
ముని మానస మందిర మధ్య బసై
బసహోతహై సూధే సుహా యినమె
రహూరెమన తూచిత చాహన సో
వృషభానుకుమారికె పాయనమె ॥రాధా రాణీ కి జై ॥

గిరికీ జై గోధన మయూర నవ కుంజనకో
పశుకీ జై మహారాజ నందకెవగర కో
నరకోను కోను జౌను రాధే రాధే నామ ర టై
తటకీజె వరకుల కాళింది కగరకో
ఇతనెపై కోయి కచు కీజై కువరకాన
రాఖియేన ఆనఫేర హరికో జగర కో
గోపీ పద పంకజ పరాగ కీ జె మహారాజ
తృణ కీ జె రావరోయి గోకుల నగరకో ॥ రాధారాణికీ జై ॥

## 144. శ్రీ అంజనేయ త్రికాలస్తుతి

### ప్రాతః కాలము

ప్రాతః స్మరామి హనుమన్త మనన్తవీర్యం
శ్రీరామచంద్ర చరణాంబుజ చంచరీకమ్
లంకాపురీ దహన నన్దిత దేవబృందం
సర్వార్థసిద్ధి సదనం ప్రథిత ప్రభావమ్ ॥

### మధ్యాహ్నకాలము

మాధ్యం నమామి వృజినార్ణవ తారణైకా
ధారం శరణ్య ముదితాఽనుపమ ప్రభావమ్
సీతాఽఽధిసింధు పరిశోషణ కర్మదక్షం
వందారు కల్పతరు మవ్యయ మాంజనేయమ్ ॥

సాయం భజామి శరణోపసృతాఖిలార్తి
పుంజప్రణాశనవిధౌ ప్రధిత ప్రభావమ్
అక్రాంతకం సకలరాక్షస వంశధూమ
కేతుం ప్రమోదిత విదేహసుతం దయాలుమ్ ॥

అతులితబలధామం స్వర్ణశైలాభ దేహం
దనుజవనకృశానుం జ్ఞానినా మగ్రగణ్యమ్
సకలగుణనిధానం వానరాణా మధీశం
రఘుపతిప్రియభక్తం వాతజాతం నమామి ॥

## 145. సంకటమోచన హనుమానష్టకమ్

బాల సమయ రవి భక్షి లియో తబ
తీనహుఁలోక భయో అఁధియారో,
తాహిసోఁత్రాస భయో జగకో
యహ సంకట కాహు సోఁ జాత న టారో.

దేవన అని కరీ బినతీ తబ
ఛాఁడి దియో రవి కష్ట నివారో,
కో నహిఁ జానత హై జగమేఁ కపి
సంకటమోచన నామ తిహారో.

మారుతాత్మజ : నీవు బాల్యమునందు సూర్య బింబమును ఫలమను భ్రాంతితో భక్షించితివి. అప్పుడు ముల్లోకములు అంధకారావృతములయ్యెను. ప్రపంచమంతయు భయకంపిత మయ్యెను. ఈ ఆపదను యెవరును తొలగింప లేకపోయిరి. అప్పుడు సర్వదేవతలు నీకడ కేతెంచి, ప్రార్థించగా నీవు సూర్యునివదలి వేసి ప్రపంచ కష్టమును నివారించితివి. అట్టి సంకట మోచనుడవైన నీ నామమును ఈ లోకమున ఎవరెరంగరు!

వాలికీ త్రాస కపీశ బసై గిరి
జాత మహాప్రభు పంథ నిహారో,
చౌఁకి మహా ముని సాప దియో తబ

చాహియ కౌన బిచార బిచారో ।।
కై ద్విజ రూప లివాయ మహా ప్రభు
సో తుమ దాసకే సోక నివారో ॥ కో ॥

వాలి భయమువలన సుగ్రీవుడు ఋష్యమూక పర్వతముపై వసించు చుండెను. మతంగముని శాపమువలన వాలి ఆ పర్వతముపై అడుగిడ జాలకపోయెను. ఎట్టి ఆలోచన చేసితివోగానీ బ్రహ్మణరూపమును ధరించి ఆ మార్గమున వచ్చుచున్న శ్రీరామచంద్రమూర్తిని ఆ ఋష్యమూక పర్వతముపైకి తీసికొని వచ్చితివి. నీవు దానుల శోకమును నివారించినవాడవు. అట్టి సంకటమోచనుడవైన నీ నామమును ఈ లోకమున ఎవరెరుంగరు!

అగంద కే సంగ లేన గయె సియ
ఖోజ కపీశ యహ బైన ఉచారో,
జీవత నా బచిహౌ హమ సోఁజు
బినా సుధీ ల్వా ఇహాఁ పగు ధారో ॥
హేరి థకె తట సింధు సబై తబ లాయ
సియా - సుధి ప్రాన ఉబార్యో ॥ కో ॥

అంగదునితో కూడ వానరులందరు సీతాన్వేషణమునకై బయలు దేరిరి. అప్పుడు సుగ్రీవుడు సీతావృత్తాంతము తెలిసికొనక యిచట అడుగు పెట్టినచో మీ ప్రాణములు నిలువజాలవని చెప్పగా, వానరు లందరు వెదకి వెదకి అలసి సముద్రతటమున జేరిరి. అప్పుడు నీవు లంకకు ఒంటరిగా వెళ్ళి సీతావృత్తాంతమును కొనితెచ్చి అందరి ప్రాణములను రక్షించితివి. అట్టి సంకటమోచనుడవైన నీనామము ను ఈ లోకమున ఎవ్వరెరుంగరు !

రావన త్రాస ద ఈ సియ కో సబ
రాక్షస సోఁ కహి సోక నివారో,
తహి సమయ హనుమాన మహాప్రభు
జాయ మహా రజనీచర మారో ॥
చాహత సీయ అసోక సోఁ ఆగిసు
దై ప్రభు ముద్రికా సోక నివారో ॥ కో ॥

లంకలో రావణుడు తన రాక్షసబలముచే సీతను మిక్కిలి బాధించెను. ఆ సమయమున మహాపరాక్రమశాలివైన నీవువెళ్ళి, రాక్షసులందరిని నాశనము

గావించితివి. అ శోకవాటికలో నున్న సీతామహాదేవికి రామముద్రిక నిచ్చి ఆమె శోక మును బాపితివి. అట్టి సంకటమోచనుడవైన నీ నామమును ఈ లోకమున ఎవరెరుంగరు !

బాన లగ్యో ఉర లఛిమన కే తబ
ప్రాన తజే సుత రావన మారో,
లై గృహ వైద్య సుషేన సమేత
తబై గిరి ద్రోన సు బీర ఉపారో ।
ఆని సజీవన హాథ దఈ తబ
లఛిమన, కేతుమ ప్రాన ఉబారో ॥ కో ॥

ఇంద్రజిత్తు యొక్క బాణములచే లక్ష్మణుడు మూర్ఛిల్లెను. అంతనీవు గృహ వైద్యుడగు సుషేనుడను వానితో ద్రోణాద్రికిబోయి. సంజీవినిని దెచ్చి లక్ష్మణుని ప్రాణములను కాపాడితివి. అట్టి సంకటమోచనుడవైన నీ నామమును ఈ లోకమున ఎవరెరుంగరు:

రావన యుద్ధ ఆజాన కియో, తబ
నాగ కి పాఁస సబై సిర డారో,
శ్రీరఘునాథ సమేత సబై ధల
మోహ భయో యహ సంకట భారో ।
ఆని ఖగేస తబై హనుమాన జు
బంధన కాటి సుత్రాస నివారో ॥ కో ॥

యుద్ధమునందు రావణుడు నాగపాశములచే నందరిని బంధించెను. శ్రీరామచంద్రునితో కూడ అందరు మూర్ఛిల్లిరి. ఈ యాపదను జూచి నీవు గరుత్మంతు డవై నాగపాశములను ఖండించి ఆపదనుండి కాపాడితివి. అట్టి సంకట మోచనుడవైన నీ నామమును ఈ లోకమున ఎవరెరుంగరు:

బంధుసమేత జబై అహిరావన
లై రఘునాథ పతాల సిధారో,
దేవహిం పూజి భలీ విధి సోఁబలి
దేఉ సబై మిలి మంత్ర విచారో ।
జాయ సహాయ భయో తబ హీ
అహిరావన సైన్య సమేత సంహారో ॥ కో ॥

అహిరావణుడు రామచంద్రుని లక్ష్మణ సమేతముగ పాతాళమునకు తీసుకొనిపోయి, వారిని తమ దేవతలకు బలినొసగ దలచెను. అప్పుడు నీవు రామచంద్రునకు సహాయభూతుడవుగపోయి అహిరావణుని ససైన్యముగ సంహరించితివి. అట్టి సంకటమోచనుడవైన నీనామమును ఈలోకమున ఎవరెరుంగరు!

కాజకియే బడ దేవన కేతుమ
బీర మహాప్రభు దేఖి విచారో,
కౌన సో సంకట మోర గరీబ కో
జో తుమ సోం సహిం జాత హైటారో ।
బేగి హరో హనుమాన మహాప్రభు
జో కచు సంకట హోయ హమారో ॥ కో ॥

మహాపరాక్రమశాలివైన నీవు గొప్ప గొప్ప దేవకార్యములను కూడ నెరవేర్చితివి. అట్టి నీకు నాబోటి అకించనుని యొక్క కష్టములను తొలగించుట ఒక లెక్కలోనిది కాదు. కాన ఓ హనుమత్ప్రభూ! త్వరగావచ్చి మా కష్టములను తొలగింపవేడెద. అట్టి సంకటమోచనుడవైన నీ నామమును ఈ లోకమున ఎవరెరుంగరు !

దోహా ॥ లాల దేహ లాలీ లసే అరు ధరి లాల లంగూర,
వజ్ర దేహ దానవ దలన జయ జయ జయ కపి సూర.

నీ యెఱ్ఱని శరీరముపై రక్తకాంతి శోభించుచున్నది. నీవు యెఱ్ఱని వాలమును కలిగియున్నావు. వజ్రశరీరుడవు. రాక్షసులను చంపితివి. ఓ కపివరా! నీకు జయము జయము.

## 146. రామనామ వాలేహో

అంజనిసుత పవనదులారే హో తుమ్ రామనామవాలేహో
రామనామవాలే హో తుమ్ రామనామవాలే ॥ రామ ॥

1. సాగర లంఘనవాలేహో తుమ్ సాగర లంఘన్ వాలేహో
లంకాజారి ఉజారే హో తుమ్ లంకాజారి ఉజారే హో ॥ రామ ॥

2. మూలసంజీవనిలాయేహో తుమ్ మూలసంజీవనిలాయేహో
లక్ష్మణప్రాణ ఉబారేహో తుమ్ లక్ష్మణ ప్రాణ ఉబారేహో ॥ రామ ॥

3. రామభక్తరఖవారేహోతుమ్ రామభక్తఖవారేతుమ్ హో
హరికోపరమపియారేహో తుమ్హరికో పరమపియారేహో ॥ రామ ॥

4. తుమ్ హమకో అబ అపనా లో ప్రభు తుమ్
హమకో అబ అపనా లో ॥ రామ ॥

శ్రీరామ జయరామ జయ జయ రామ

నీవు అంజని కుమారుఁడవు, వాయుదేవుని గారాబు పుత్రుఁడవు. రామ నామము స్మరించువాడవు. సముద్రమును లంఘించినవాఁడవు. లంకను గాల్చి ధ్వంస మొనరించినవాడవు. సంజీవని మూలికను దెచ్చినవాడవు. లక్ష్మణుని ప్రాణములను నిలిపినవాడవు. రామభక్తులను గాచువాడవు. హరికి పరమప్రియుడవు, ప్రాణ ప్రియుడవు. ఇప్పుడు మమ్ము నీవారినిగా గ్రహించి రక్షింపుము.

## 147. రామపూజారి పరఉపకారి

రామపూజారి పరవుపకారి । మహావీర బజరంగబలీ
సద్ధర్మచారి సద్బ్రహ్మచారి । జ్ఞానగుణససాగర రూపవుజాగర ॥ మహా ॥
శంకర సువన సంకటమోచన । కేసరినందన కలిమలభంజన ॥ మహా ॥
రాఘవదూత జయ హనుమంత । అంజనినందన అసురనికందన। మహా ।
మంగల మూరతి మారుతి నందన । జయ రణధీర జయ రణరోర। మహా।
జయ బలభీమ జయ బలధామ । మారుతి రామ మంగళధామ॥ మహా ॥

## 148. జయ జయ శ్రీమారుతి

1. జయ జయ కపి శ్రీరామప్రియ ధన్య ధన్య హనుమంత
నమో నమో శ్రీమారుతీ బలిహారీ బలవంత.

శ్రీరామప్రియుడైన కపికి జయము, జయము, హనుమా ! నీవు ధన్యుడవు. బలవంతుడవగు మారుతీ! నీకు నమస్కారము.

2. నమో నమో శ్రీమారుతీ జాకే బస శ్రీరామ
కరహు కృపానిశిదిన జపౌఁ శ్రీసియ సియ పియనామ

రాముని హృదయమందుగల మారుతీ! నీకు సమస్కారము. సీతాప్రియుని నామమును రాత్రింబవళ్ళు జపించెదను. దయజూడుము.

3. సియాదులారే పవనసుత మమగురు అంజనిపూత
సతసంగతి నిజచరణరతి దేహు సియ పియదూత.

సీతా ప్రియపుత్రుడవు. అంజనీ పవనుల పుత్రుడవైన నీవే నాకు గురువవు. సీతకు ప్రియదూతవైన నీవు - సత్సాంగత్యము, మరియు నీ పాదసేవయం దనుగ్రహము ప్రసాదింపుము.

4. శ్రీసియ పియ పదకమల అవిరల అమల సనేహు
యుగల చరన కైంకర్య పుని మోహి కృపాకరి దేహు

సీతా ప్రియపదకమలములయందు అవిరళమగు ప్రేమయు, యుగళ చరణముల పూజయును మాటిమాటికి కలుగునటు లనుగ్రహింపుము.

5. సేఇయ శ్రీహనుమాన్ భుక్తిముక్తి హరి భక్తప్రద
జనరక్షక భగవాన్ వీరధీర కరుణాయతన.

భక్తి, ముక్తి, హరిభక్తుల నిచ్చువాడా! జనరక్షకా ! వీరుడా! ధీరుడా! కరుణా స్వరూపా ! భగవాన్ హనుమా! మమ్ము రక్షింపుము.

## 149. జయ జయ హారతి రామ జితుమ్హరి

జయజయ హారతి రామ్‌జీ తుమ్హారీ । ప్రాణదాత రఘునాథ మురారీ
॥ జయ ॥

1. పీతవసన వైజయంతి మాలా । శ్యామ వరస తను నయనవిశాలా॥ జయ ॥
2. క్రీట ముకుట కర శారంగ సోహే । సీతారమ నిరఖ మన మోహే॥ జయ ॥
3. నారద శారద మంగళ గావే । భరత శత్రుహన చవ(ర డులావే ॥ జయ ॥
4. శత్రుహనహో జయ లక్ష్మణ భ్రాతా । హారతి కరే( కౌసల్యా మాతా॥ జయ ॥
5. సమ్ముఖ చరణ రహే హనువీరా । హరిహరకే గుణగణగావే( కబీరా। జయ।

ప్రాణదాతా ! రఘునాథా ! మురారీ! నీకు జయ జయ హారతి.

పీతాంబరముగలవాడా! వనమాల గలవాడా, శ్యామల గాత్రా విశాల నేత్రములు గలవాడా శిరమున గిరీటము, కరముల శార్ఙ్గధనువును శోభించు చుండ సీతారాముని జూచిన మనమున మోహ ముదయించుచున్నది.

నారదుడు, శారదయు మంగళగానము సేయుచున్నారు. భరత శత్రుఘ్నులు వీవనలు వీచుచున్నారు. కౌసల్యామాత హారతి నిచ్చుచున్నది. చరణసన్నిధిని వీరుడగు హనుమంతుడు విరాజిల్లుచున్నాడు. కబీరు హరియు హరుడు నగు రాముని గుణ గానము చేయుచున్నాడు.

## 150. మంగళహారతి ప్రియా ప్రీతమకి

మంగళహారతి ప్రియా ప్రీతమకీ । మంగళ ప్రీతి రీతి దోవునకీ
మంగళ కాంతి హసని దసననకీ । మంగళమురళీ బీనా ధునకీ ॥

మంగళబనిక త్రిభంగీ హరికీ । మంగళసేవా సబ సహచరికీ
మంగళ శిరచంద్రికా మకుటకీ । మంగళ ఛబినైననమేఅటకీ ॥

మంగళ ఛటా ఫబీ అంగఅంగకీ । మంగళ గౌర శ్యామరసరంగకీ
మంగళ అతికటి సియరేపటికీ । మంగళ చితవని నాగరనటకీ ॥

మంగళ శోభా కమలనైనకీ । మంగళ మాధురిమృదులబైనకీ ।
మంగళ బృందావన మగ అటకీ । మంగళ క్రీడనయమునాతటకీ ॥

మంగళచరన అరున తరువనకీ । మంగళకరని భక్తి హరిజనకీ ।
మంగళ యుగళ ప్రియా భావనకీ । మంగళ శ్రీరాధా జీవనకీ ॥

శ్యామసుందకి, మురళిధరకి, పీతాంబర ధరకి ।
బృందావన చందకి మోర ముకుటకి కమలనయనకి ॥ మంగ ॥

ప్రేయసియగు రాధికకు, ప్రియతముడగు శ్రీకృష్ణునకు మంగళ హారతి నిచ్చుచున్నాను. వారి ప్రీతికిని, రీతికినీ మంగళహారతి నిచ్చుచున్నాను. వారి మందహాస సుందరమైన దంతకాంతికి మంగళ హారతి నిచ్చుచున్నాను. మురళీవీణా ధ్వనికి మంగళము.

శ్రీ కృష్ణుని త్రిభంగీలలితమైన రూపమునకు మంగళము. వారికి సేవ జేయు సేవకురాండ్ర కందఱకు మంగళము.

శ్రీ కృష్ణుని శిరమునందలి నెమిలి పింఛపు గిరీటమునకు మంగళము, కన్నులందలి సొయగమునకు మంగళము. ప్రత్యంగమున నుట్టిపడుచున్న సౌందర్యమునకు మంగళము.

రాధికయొక్క పసిండినిమించు సొయగమునకును, శ్రీకృష్ణుని శ్యామసుందర స్వరూపమునకును మంగళము.

కటితలమున శోభించు పీతాంబరమునకు మంగళము. నటనాగరుడగు శ్రీకృష్ణుని చూపులకు మంగళము.

శ్రీకృష్ణుని తామరపూలనుబోలు కన్నుల శోభకు మంగళము. అతని మృదువచనములందలి మాధుర్యమునకు మంగళము.

శ్రీ కృష్ణుని బృందావన సంచారమునకు మంగళము. యమునాతీర ఖేలనమునకు మంగళము.

అతని యెఱ్ఱని పాదములకు మంగళము. బృందావనము నందలి తరువులకు మంగళము.

హరిభక్తుల భక్తి మంగళములను సమకూర్చునది. యుగళకిశోరుల (రాధా కృష్ణుల) ప్రేమ భావమునకు మంగళము. శ్రీరాధా ప్రాణనాథునకు మంగళము.

## 151. మంగళ హారతి గోపాలకి

మంగళ హారతి గోపాలకి, నితవుఠి మంగళ
హోతని రఖి ముఖ చితవనినైన విశాలకి ॥ మంగళ ॥

మంగళరూపు శ్యామసుందరకి, పీతాంబరధరకి, మోరముకుటకి,
రాధావరకి, మురళిధరకి, బృందావన చందకి,
మంగళరూపు శ్యామసుందరికి, మంగళ బృకుటి ఫాలకి
చతుర్భుజదాస సదామంగళ నిధి బాణిక గిరిధర లాలకి॥ మంగళ ॥
మంగళహారతి మంగళ హారతి మంగళ హారతి గోపాలకి..."

## 152. హారతి కీ జై హనుమాన లలాకీ

హారతి కీ జై హనుమాన లలాకీ । దుష్టదలన రఘునాథ కలా కీ
జాకే బలసే గిరివర కాంపై । రోగ దోష జాకే నికట నఝాంపై ॥
అంజని పుత్ర మహాబలదా ఈ । సంతన కే ప్రభు సదా సహా ఈ ॥
దే వీరా రఘునాథ పఠాయే । లంకా జారి సీయ సుధి లాయే ॥
లంకా సో కోట సముద్ర - సీ ఖా ఈ । జాత పవనసుత బార న లాఈ ॥
లంకా జారి అసుర సంహారే । సియా రామజీ కేకాజ సంవారే ॥
లక్ష్మణ మూర్ఛిత పడేసకారే । ఆని సజీవన ప్రాణ ఉబారే ॥
పైఠి పతాల తోరి జమ -కారే । అహిరావనకీ భుజ ఉఖారే ॥
బాఁయేఁ భుజా అసుర దలమారే । దహినే భుజా సంతజన తారే ॥
సుర నర ముని ఆరతీ ఉతారే । జై జై జై హనుమాన ఉచారే ॥
కంచన థార కపూర లౌ ఛా ఈ । ఆరతి కరత అంజన మా ఈ ॥
జోహనుమాన (జీ) కి ఆరతి గావై । బసి వైకుంఠ పరమపద పావై ॥

దుష్టశిక్షకుడు, రఘునాథ కళామూర్తి, అంజనాప్రియపుత్రుడవైన హనుమంతునకు నీరాజనమివ్వండి.

అతని పరాక్రమము వలన గిరిధరము లన్నియు కంపించినవి. రోగ దోష ములు సమీపమునకైనను రాజాలవు. అంజనాసుతుడు, మహాబలవంతుడు సాధు జనులకు సదా సహాయకుడు. శ్రీరామచంద్రుడు ముద్రికనిచ్చి లంకకు పంపెను. లంకకు పోయి సీతావృత్తాంతమును తెలిసికొని వచ్చెను. లంక సముద్రము అగడ్తగా కలిగిన కోటను అవలీలగా దాటినాడు. లంకకు పోయి రాక్షస సంహారము గావించి సీతారామచంద్రుల కార్యములను నెరవేర్చెను. సంజీవిని తెచ్చి మూర్ఛితుడైన లక్ష్మణుని ప్రాణములను కాపాడెను. యమపాశములను ఛేదించి పాతాళ లోకమున ప్రవేశించి, అహిరావణుని భుజములను ఖండించెను. తన వామహస్తముతో అసుర సంహారము చేసెను, దక్షిణ హస్తముతో సాధురక్షణ చేసెను. సుర నర మునులు హారతులనిచ్చి హనుమంతునకు జయ జయాకారములు పలికిరి. అంజనాదేవి బంగారు పళ్ళెముతో కర్పూరా నీరాజనము నిచ్చెను.

ఎవరు హనుమాన్‌జికీ మంగళహారతిని గానముచేయుదురో వారు వైకుంఠమున వెలసి పరమపదమును పొందుదురు.

## 153. శ్రీరామరక్ష

శ్రీరామరక్ష - సర్వజగద్రక్ష । భవభయభక్ష రామ రక్ష ॥ శ్రీ ॥
అసురశిక్ష రామరక్ష । ఆశ్రితపక్ష రామరక్ష ॥ శ్రీ ॥
ధర్మాధ్యక్ష రామ రక్ష । భక్తాపరిరక్ష రామరక్ష ॥ శ్రీ ॥
రామ రక్ష రఘురామా రక్ష ఏకైకరక్ష రామరక్ష ॥ శ్రీ ॥
రామ రామ రామ రక్ష శ్రీరామ శ్రీరామ శ్రీరామ రక్ష ॥ శ్రీ ॥

## 154. అనాథకోన

అనాథ కోన హైయహా త్రిలోకనాథ సాథహై ।
దయాలు దీన బంధుకే బడే విశాల హాథహై ॥

## 155. అసతోమ సద్గమయ

అపతోమా సద్గమయ,అసతోమ సద్గమయ తమసోమా జ్యోతిర్గమయ
మృత్యోర్మా అమృతంగమయ శాంతిః శాంతిః శాంతిః

## 156. నామ సంకీర్తనంయస్య

శ్లో ॥ నామసకీర్తనం యస్య - సర్వపాప ప్రణాశనమ్ ।
ప్రణామోదుఃఖశమనః - తం నమామి హరిం పరమ్ ॥

శ్లో ॥ యత్ఫలం నాస్తి తపసా - న యోగేన సమాధినా ।
తత్ఫలం లభతేసమ్యక్ - కలౌ కేశవకీర్తనాత్ ॥

శ్లో ॥ హరేర్నామ హరేర్నామ - హరేర్నామైన కేవలమ్ ।
కలౌ నాస్త్యేవ నాస్త్యేవ - నాస్త్యేవ గతి రన్యథా ॥

శ్లో ॥ నాస్తి నాస్తి కలౌ నాస్తి - హరినామ వినా గతిః ।
తస్మాద్యత్నేన జప్తవ్యం - హరేర్నామైన కేవలమ్ ॥

శ్లో ॥ ఆపదా మపహర్తారం - దాతారం సర్వసంపదామ్,
లోకాభిరామం శ్రీరామం - భుయో భుయో నమామ్యహమ్ ॥

తే ॥ చేతులారంగ శివునిఁ బూజింపఁడేని
నోరు నొవ్వంగ హరికీర్తి నుడవఁడేని
దయయు సత్యంబు లోనుగాఁ దలఁపఁడేని
కలుగనేటికిఁ? దల్లుల కడుపుఁజేటు.

క ॥ శ్రీనాయక ! నీ నామము । నానాభవరోగకర్మ నాశమునకు వి
జ్ఞానంబగు నౌషధ మిది । కానరు దుష్టాత్ము లకట కంజదళాక్షా.

క ॥ ఎఱిఁగిన వారల మనుచును
గొఱమాలిన యెఱుక లెఱిఁగి కొందఱు నీ పే
రెఱిఁగియుఁ దలఁపగ నొల్లరు
పఱతు రధోగతులజాడఁ బద్మదళాక్షా.

క ॥ అతి పాపకర్ములైనను । సతతము నారాయణాఖ్య శబ్దము మదిలో
వితతంబుగ వరియించిన । చతురులఁగొనియాడఁ గమలసంభవువశమే.

క ॥ నీపాద కమలసేవయు । నీపాదార్చకులతోడి నెయ్యమును నితాం
తాపార భూతదయయును । తాపసమందార నాకు దయసేయగదే.

శ్లో ॥ కాయేన వాచా మనసేంద్రియైర్వా
బుద్ధ్యాత్మనా వా ప్రకృతే స్స్వభావాత్,
కరోమి యద్యత్సకలం పరస్మై
నారాయణాయేతి సమర్పయామి ॥

నమః పార్వతీపతే హరహర! మహాదేవ ! శంభో!

శ్రీరామచంద్రార్పణమస్తు

# 157. స్వామివారి పరిచయ వాక్యము

భరతఖండమున పశ్చిమ గోదావరి జిల్లాలో ఆరువేల నియోగికుటుంబమున అడవి కొలను గ్రామంలో విష్ణ్వాలయమున మానవ రూపమున 28-11-1914 వైకుంఠ ఏకాదశినాడు మహాపురుషుడు జన్మించెను. తల్లి తండ్రులు (శ్రీ పెమ్మరాజు హనుమాన్‌లు, శ్రీమతి పల్లాలమ్మ) పెట్టిన విశ్వేశ్వరరావు. అనుపేర అసేతు సీతాచలపర్యంతము నాటక కళలో అఖండకీర్తినార్జించి, అనేక సువర్ణపతకములు బడసిరి. పిమ్మట సంగీత కళాభిమానముతో గ్వాలియర్‌లో మహారాజవారి సంగీత కళాశాలలో శాస్త్రీయ హిందూస్తాని సంగీతమును అభ్యసించిరి. బాల్యము నుండియు ఉగ్గుపాలతో పెట్టినది రామభక్తి. భక్తి భావముతో అయోధ్యకు వెళ్ళి రామసాక్షాత్కారము పొందిన సిద్ధపురుషులు శ్రీ జానకీవల్లభశరణజీ మహరాజ్‌గారివద్ద రామ త్రయోదశాక్షరీ మంత్రమును తీసికొని శ్రీసియారఘువరదాస్ అనుపేర ఉత్తర హిందుస్థాన మంతట ఆఖండముగ భగవన్నామసంకీర్తన ప్రచారము చేసిరి. శ్రీ ప్రభుదత్త బ్రహ్మచారి మహరాజ్‌గారివద్ద ప్రయాగలో పది సంవత్సరములు సాధుసేవ, భగవత్సేవ చేయుచు నిత్యము సంకీర్తన చేయుచు - ఆంధ్రుల మహాభాగ్యముగా (1948లో) ఆంధ్రదేశము వచ్చి వాడవాడల భగవన్నామామృతమును వర్షించిరి. ప.ప. శ్రీ సదాశివేంద్ర సరస్వతీ స్వామివారికి శిష్యులై (10-12-1954 పౌర్ణమినాడు దత్తజయంతి పర్వదినమున) తురీయాశ్రమ స్వీకారము చేసి శ్రీ అవధూతేంద్ర సరస్వతీస్వామి అనుపేర విరాజిల్లుచు, అనేక పట్టణములలో, గ్రామములలో, పల్లెలలో భగవన్నామ సంకీర్తనామృతము తాను పానముచేయుచు, అందరిచే చేయించుచు నిత్య నిరంతర సంకీర్తనతో వందలాది సప్తాహములు, ఏకాహములు చేయుచు అపర చైతన్యులై నామామృతముతో ఆంధ్రదేశమును ప్లావితము, పవిత్రము చేసిరి.

స్వామి వారు సాధారణ కుటుంబమున జన్మించిరి. చిన్నతనముననె తండ్రిని కోల్పోయిరి. ఆర్థికముగాను మరి ఇంకా పలువిధములగు ఇబ్బందులకు లోనయిరి. అంత చిన్న తనముననె బాధలు బాధ్యతలను మానసికము రోసి ఆత్మహత్య చేసికొనుటకు ఉపక్రమించి, ఒక పాడుపడిన బావిలో దూకిరి. అందులో జలగలు ముళ్ళకంపలు చాలా వుండినవి. కాని విచిత్రముగా, మునిగి పోయిన వానిని అపూర్వమగు రెండు చేతులు లోననుండి పైకిత్రోసివుచ్చెను. నీటిపైకి ఉక్కిరి

భిక్కిరైన బాలుని చూచి, ఒక అపరిచిత వ్యక్తి తన తలపాగ తీసి విసిరేసి, ఒక కొన పట్టుకోమని నెమ్మదిగా పైకి చేర్చిరి. ఆశ్చర్యముగా అబ్బాయికి ఏవిధమైన హాని కలుగలేదు. అంత నా అపరిచిత వ్యక్తి వీరిని మందలించి "ఏమి అవాంతరము వచ్చింది. ఆత్మహత్య చేసికొనుట తగదు. నీవు చేయవలసిన మహా కార్యములు చాలా వున్నవని" చెప్పి దీవించి వెళ్ళిపోయిరి. మరల విచారించినను వారి ఆచూకి ఏమితెలియలేదు. అప్పటినుండియు వారి జీవితములో ఏ సంఘటన కలిగినను అభావమనిపించలేదు. స్వామివారు నరసారావుపేటలో గుండె పోటుతో ప్రాణము పోవు పరిస్థితి వచ్చినప్పుడు మీరు యతీశ్వరులు కదా, ఒక వేళ దేహత్యాగము చేసిన, ఉత్తర క్రియలు ఏమి చేయవలయునో తెలియదు కానీ, వివరించండి అని ప్రార్థించగా, వారు, పై సంఘటన చెప్పి, అందువలన "జలసమాధి" చేయవలెనని తెలిపిరి. వారి ఇచ్ఛానుసారము వారి భౌతిక కాయమును విజయవాడ దగ్గర కృష్ణలో వదలి వేసిరి.

స్వామివారు కారణ జన్మలు అని నిరూపించుటకు యింకా చాలా సంఘటనలు వారి జీవితములో గోచరించును. వారు ఏలూరులో సప్తాహము చేయుచుండగా వారికి అత్యంతప్రియమైనారు. శ్రీ. అనంత పద్మనాభశాస్త్రిగారు (అతి ఉత్తమ 'భాగవత పురాణకర్త) సమక్షమున హైదరాబాద్ వాస్తవ్యులగు ఒక భక్తునుద్దేసించి, నీవు వివాహము చేసికొననిచో నేను మీ ఇంట్లో ప్రాణత్యాగము చేసెదనని" బిగ్గరగా నవ్వుచు చెప్పిరి. కాని అందరు ఆ వాక్యములను పట్టించుకొనక హాశ్యమని, వారితో కలసి నవ్విరి. వారి నిష్ఠ వారి వాక్శుద్ధి చేత, వారిమాట సత్యమని, నిరూపమైనది. అదే విధముగా వారు హైదరాబాద్‌లో దేహ త్యాగము చేసిరి.

వారి సమత్వభావన, ఆదర అభిమానములు, నిస్వార్థసేవ నిరూపించే సన్నివేశములు ప్రతి క్షణము గలవు. ఏలూరు సప్తాహములో ఒక బీద బ్రాహ్మణుడు స్వామివారితో, అయ్యా నాకుమారునికి యుక్తవయస్సు వచ్చినది. విధి ప్రకాశము ఉపనయనము చేయవలెను కాని, తాను నిస్సహాయుడై యున్నాడని, చాలా దీనుడై కంటతడి పెట్టెను. అంత స్వామివారు వెంటనే, శ్రీ. అనంతపద్మనాభశాస్త్రిగారితో, శాస్త్రప్రకారము ఉపనయనము చేయుటకు, కనీసము ఎంత ధనము కావలెనని సంప్రదించి, శ్రీ ప్రాతూరి గోపాలకృష్ణమూర్తిగారు తన కుమార్తె వివాహమున రావలెనని కోరి, రైలుఛార్జీకి పంపిన పైకమును కవరుతో సహా ఎంత వున్నదని

కూడా చూడక అటులె ఇచ్చి, దీనితో ఉపనయనము చేయండి శాస్త్రిగారు మీకు సహాయము చేసెదరు. ఇంకా అవసరమైతే తెలుపండి, వెరెవ్వరిని యాచించవద్దని చెప్పిరి. ఆ సప్తాములోనె స్వామివారి ప్రియశిష్యులైన శ్రీమతి మరియు శ్రీ గుండుగొలను ఈశ్వరరాజుగారు, మంచి శ్రేష్టమైన విలువైన మధుర పదార్థములను, స్వచ్ఛమైన, ఆవు పెరుగు, నెయ్యి ఇత్యాది వస్తువులు, "స్వామిజి కేవలం మీ కొరకు తెచ్చినామని" సమర్పించుకొన్న వాటిని వెంటనే "సహ పంక్తిలో నున్న వారందరికి తానే స్వయముగా వడ్డించిరి. అంత ఆ భక్త దంపతులు 'స్వామిజీ మీ గురించి తెచ్చినాము అని" బాధ వెలయబుచ్చిరి. స్వామివారు పరమానందముతో నవ్వుతూ వీరంతా నా స్వరూపముగాదా, వారు ఆనందిస్తే నాకు ఆనందము కదా. మీరు నా గురించి ఇచ్చిన పదార్థము నావే కదా మరి, నా వస్తువులను నా ఇష్ట ప్రకారము వినియోగము చేయవలనా మీ ఇష్టప్రకారము చేయవలెనా? మీరు బాధపడితే, ఆ వస్తువులు నన్నుద్దేశించి ఇచ్చిన వెట్లగునని మందలించిరి.మరియొక సందర్భములో, స్వామివారు చాలా ఆనారోగ్యం చేసియున్నప్పుడు వారియొక్క ప్రసిద్ధి, పేరు ప్రతిష్ఠలు సహించనివారు,ఔషధమని, విషము నిచ్చిరి. ఒక పూట సేవించి, మిగిలినది సేవించుటకు వుంచిరి..అంతవారికి మరణ యాతన ప్రారంభమై, స్పృహలేని స్తితి కలిగినది. దైవికంగా, (విషమును) పిల్లికూడా దూరటానికి వీలుకానటువంటి వారి గదిలోకి, ఒక పెద్ద కోతి వచ్చి మిగిలిన ఔషధ పొట్లములను చింపి, చెండాడి మట్టి నేలపాలు చేసి అదృశ్యమైనది. అది గవాక్షము నుండి దూకిన చప్పుడుకు స్వామి వారు లెవలేని స్థితిలోనుంచె గమనించిరి. కాని, ఆ కోతి ఎలా రాగలిగెను ఎలా పొగలిగెనని ఆశ్చర్యమైనది. కొంచెము కోలుకొన్న తరువాత స్వామివారు "రామచక్రము" లో (తులసీరామాయణ పుస్తకములో నున్నది) ప్రశ్న చూడగా, మరణ గండముండినది, రాముని కృపవలన తొలగిపోయినదని విశద మైనది. అంతవారు సత్యాన్ని గ్రహించి మౌనము వహించిరి. కొద్ది రోజుల తరువాత ఆ విషము పెట్టినవారు స్వామివారి సమక్షములో క్షమాపణ వేడి శిక్ష తెలుపమనగా, భగవన్నామము చేసుకొనండి అని చెప్పిరె, కాని ఏమాత్రము ఎన్నడుగాని. ఎవ్వరితోగాని వారిపైన ద్వేషము, ప్రతీకారము, యీసంతైన కనుబరచలేదు.

ఒక పేద భక్తురాలు భిక్షకని ఆహ్వానిస్తే ఇప్పుడు కాదు లేమ్మ తరువాత చెబుతానులే, నీవు నా సంకీర్తనలో నామము చేసితే, అది నాకు భిక్షకాదా ఏమిటి. నేను చేయవలెనను అహంకారమెందుకు అనిరి. కొద్ది రోజుల తరువాత ఒక పెద్ద

ఉద్యోగి, కారు పంపుతాను భిక్షకు రావలెనంటె నిరాకరించి, మీరు స్వార్జితముతో పెట్టినప్పుడు వస్తాను అన్నారు. (అంటె ఆ ఉద్యోగి సంపాదనంతా పాపద్రవ్యమని) వెంటనె వెసవిటెండైన, నడుచుకొంటు పోయి ఆ పెద భక్తురాలి పూరింట కేవలం పచ్చడి మెతుకులతో మహదానందము పొందినారు.

ఒక పర్యాయము ఆరోపణవలన, మానభంగ పరిస్థితి కలిగినప్పుడు, దానిని కప్పిపుచ్చకూడదని, ఆ సన్నివేశమును కరపత్రములలో అచ్చువేయించి, సంకీర్తనకు ముందుగా అన్ని చోట్ల పంచెదను, భక్తులు ఆదరించిన, నిరాదించినా సరెనన్నారు. కాని భక్తులు అలా జరుగనివ్వక కర పత్రములను రూపుమాపిరి. కాని వారు ఆఖరిదశలో భద్రాచల సప్తాహములో ప్రసంగించుచు, 'రామనామము చేస్తే నేను మహత్ముడని అనుకొంటున్నారు. కాని ఈ మనస్సు చాలా చండాలమైనది. అమ్మ కొంపతీసేస్తు. నన్ను అంతారామమయం అనే స్తితికి రానివ్వడము లెదని, ప్రకటించిరి. ఒక చోట వారిని గురించి పరిచయ వాక్యములు వారిని ప్రశంసించి వేదికపై చెబుతూ వుంటె, వారు దూరాన వచ్చువారు విని, వేదికపైకి వచ్చిన తరువాత, భక్తులతో "వీరు చెప్పిన మాటలునమ్మవలదు. వారికి నా గురించి తెలియదు. నా మనస్సులో ఎంత కల్మషమున్నదని" అన్నారు.

మనకు సత్‌పురుషులకు తెడా ఏమిటంటె, ఇద్దరిది పంచభూతములతో ఉత్పన్నమైన శరీరము, త్రిగుణములు, అరిషడవర్గములు కలిగిన మనస్సు. కాని, సత్‌పురుషుల నిశ్చల స్తితిచేత, శారీరక, మానసిక మలినముల అడుగంటి, స్వచ్ఛమైన, జలము పైన నుండువంటి బురదనీరు వలె నుండును. మనవి చెంచల త్వముచేత, బురద (మాలిన్యములు) ఇంకా చిక్కగగుచుండును. ప్రకృతి అనుసారముగా శారీరక మానసిక మాలిన్యము లున్నపుటికిని, సత్పురుషుల నిర్మలతకు ఇబ్బంది లేదు.

ఇంకా ఇలాగెన్నో సంఘటనలు వారి పూర్ణత్వమునకు నిదర్శనము లున్నాయి. వారిని తెలుసుకొనుటకు గీటురాయిగా ఒకటి చాలు. సత్‌పురుషులను గుర్తించుట మన పుణ్య భాగ్యమే. లెని యెడల మన పాప ఫలమే. వాసుదేవ, వాసుదేవ , వాసుదేవ.

" నరుడని చూచినావో గురువును. కృతార్థతనొందజాలవు
ఈశ్వరుడని చూచినావో అల్పబ్రహ్మ పదార్థమెరుంగవచ్చు
నీసరియగు లక్ష్యమొక్కటియే చాలును సాధనలెల్ల గూర్చు
ఈశ్వరుదుని నమ్మి భక్తి మనసా గురుపాదములాశ్రయింపుమా "

# 158. శ్రీ ప్రభుదత్త బ్రహ్మచారి మహారాజ్ సంకీర్తన భవనం - బృందావనం

శ్రీ సియారఘువరదాసు ఆంధ్రదేశమున జన్మించిరి. ఆయన హృదయము బాల్యమునుండియు శ్రీరామపాదారవింద సంసక్తమగుటచే ఆయన పిన్న వయసుననే అయోధ్య కేతెంచిరి. ఆయన శ్రీరామచంద్రుని లీలా భూమి యగు అయోధ్యానగరమున నున్న సమయమున శ్రీ పండిత రామవల్లభశరణ్ గారియొద్ద వైష్ణవ ధర్మదీక్ష గ్రహించిరి. ఆయన ఇంటిపేరెమో తెలియదు కాని నాటినుండి యు సి యా రఘువరదాస్ యను దీక్షానామముతో బరగిరి. ఆయనకు బాల్యము నుండియు సంగీతము నందనురాగము అధికము. కాన శ్రీరఘువరదాస్ గ్వాలియరులో సంగీత కళాశాల యందు శాస్త్రీయ సంగీతము నభ్యసించెను. ఆయనది కిన్నెర కంఠము, ఆయన పంచము స్వరమున గళమెత్తి గానము చేసెనా, పికకూజితమువలె శ్రవణపేయముగా నుండెడిది. శ్రోతలు భక్తిరస ప్లావిత చిత్తులై ముగ్ధులయ్యెడివారు. ఆయన గ్వాలియరు నుండి ప్రయాగకు వచ్చి వైష్ణవ మఠములో కొన్ని దినములుండిరి. అటుపిమ్మట బృందావనమునకు వెళ్ళిరి. బృందావనమునందే నాకు వారితో పరిచయ మేర్పడెను. అపుడు నేను ఆయనను నా వెంటనుండు డని కోరితిని. ఆయన అంగీకరించిరి. నాటి నుండియు ఆయన నాసేవా బారమును తనపై నుంచుకొనెను. ఇంతేకాదు. భగవత్సేవకు వలయు పూజాసామగ్రిని ఫలహారాదులను తానే స్వయముగా సమకూర్చెడివారు. ఆశ్రమమందలి విద్యాలయ కార్యనిర్వహణ భారమును కడుదక్షతతో నిర్వహించెడివారు. ఆదాయ వ్యయములను చూచి పెట్టెడివారు. ఇంత కార్యభారమును శిరస్సుపై నుంచుకొనియు నిరంతరము భగవన్నామ సంకీర్తనములో మునిగి యుండెడివారు. నేడు, ఆంధ్రప్రదేశ్‌లో, గ్రామ గ్రామమున శ్రీ సీతారామనామ సంకీర్తనము ఇంత యవిచ్ఛిన్నముగ జరుగుచున్న దని యనిని ఆ శ్రేయస్సు శ్రీ సియా రఘువరదాసుదేయని చెప్పవలయును.

నేను ఆంధ్రప్రదేశ్ వెళ్లినప్పుడు సియారఘువరదాసు నా వెంట నుండెను. నేనప్పుడు దక్షిణ భారత మందలి పుణ్య క్షేత్రములను దర్శించుటకై బయల్దేరితిని. ఆయనయు నా వెంట బయలుదేరి ప్రతి పుణ్యక్షేత్రమునందు మధుర కంఠముతో భగవన్నామ సంకీర్తనము గావించుచు భక్తులను పరవశుల నొనరించెడివారు. మేము తీర్థాటనము చేయుచు మధురకు చేరితిమి. అచట వారము రోజులు భగవన్నామ

రసామృతమున జనసందోహములను ఓలలాడించెను. ఆ దినములు నాస్మృతి పటలమున అటులే నేటికిని అంకితమై యున్నవి. ఇంతే కాదు. తాను గద్గద కంఠముతో అశ్రుపాత మొనర్చుచు తన్మయుడై నామ సంకీర్తనము చేయుచున్న దృశ్యమును నే నెన్నడు మరువజాలను.

ఆంధ్రప్రదేశ్ ప్రజలు సియారఘువరదాసుగారి భక్తిరస పూర్ణ మధుర గానమునకు ముగ్ధులై వారిని ఆంధ్ర ప్రదేశ్ నందే విడచి వెళ్ళుడని నన్ను కోరిరి. వారును అంగీకరించిరి. నాటినుండి ఎన్ని నామసప్తాహములు జరిపిరో ఎంత అఖండనామ సంకీర్తనము కావించిరో నేను చెప్పజాలను. వారినుండి అలౌకికము అద్భుతము నగు నామ సంకీర్తనము జరుగుచుండెడిది. ఆయన బృందావన ప్రాంతమంతయు నామసప్తాహములతో ప్రతిధ్వనింప చేయువలయునని నాతో తరచుగ అనుచుండెడివారు. ఆయన కోరిక అటులే మిగిలిపోయెను. దానిని తలచుకొనిన శరీరము పులకాంచిత మగుచుండును. నే నెపుడు ఆంధ్ర దేశమున కేతెంచినను శ్రీసియారఘువరదాసు ప్రేరణచే భక్త జనులు నాకఖండ స్వాగత సత్కారము లొనర్చెడివారు. ఆయనకు నాయందుగల అవ్యాజగాఢాభిమానము కారణముగా నట్టి ఏర్పాట్లు జరుగుచుండెడివి.

సేవా భావము వారికి వెన్నతో పెట్టిన విద్య. యాత్రలో నా వెంటనుండు సహచరులకే గాక, అతిథులు, అభ్యాగతులకు సహితము పరమ ఆనందముతో భోజనాదికములు సిద్ధముచేసి అతిథ్య మిచ్చుచుండెడివారు. ఆయనకు సంబంధించిన సంఘటనలు ఎన్నో నా స్మృతి పథమున నున్నవి. ఎవరనుకున్నారు. ఆయన నాకన్న ముందు ఈ లోకమును వీడునని! ఆయనను గురించి నేను ఈ మాటలు వ్రాయవలసి వచ్చునని. తన కన్నుల ముందు ఆత్మీయుడగు బంధువు స్వర్గతుడగుట, దుష్టులగు పరదూషకులు నిష్కారణముగ నొనర్చు నిందలు వినుట, యనునవి మహాదుఃఖ హేతువులుగా మార్కండేయ మహర్షి చెప్పియున్నాడు. దేహావయవములవలె నా వెంట నుండి నా సేవలొనర్చు నట్టి నా స్నేహితులు, బంధువులు ఎందరో పరలోక వాసు లగుచున్నారు! ఇది నాదురదృష్టము.

శ్రీ రఘువరదాసుతరువాత కొంతకాలమునకు విజయవాడలో ఒక యతీశ్వరుని కడ కాషాయదండములను గ్రహించి అవధూతేంద్ర సరస్వతీ అనుపేర బడెసెను. కాని కొంతకాలము గడిచిన పిమ్మట ఆయన దండ పరిత్యాగము చేసెను.

సన్యాసి అయినను భావములలో లేశమైనను మార్పురాలేదు. కాలము గడచుకొలది ఆయన ప్రాచీనభావములో దృఢతరము కాసాగినది.

గత సవంత్సరము ఆయన భీమవరములో నున్నప్పుడు కాలుజారిపడి తలకు పెద్ద గాయమయ్యెను. ఈ వార్త తెలియగానే నేను భీమవరము వెళ్ళి పదిరోజులు అట వుండి తిరిగి వచ్చితిని. తరువాత రెండుమార్లు ఆయన నా యొద్దకు వచ్చెను. ఆయన ఒక మహాభావుకుడు. భావుకతతో నొప్పారునట్టి ఎన్నియో లేఖలు ఆయన నాకు వ్రాసియుండెను. కాని లేఖలను సురక్షితముగా నుంచు నలవాటు కలవాడును కాకపోవుటచే నేను వాటిని పోగొట్టుకొంటిని. తరువాత హైద్రాబాద్ నుండి వారు ఒకలేఖ వ్రాసిరి. అదియే అంతిమ లేఖ. ఇంతలో ఆయన 11-6-75న కరాలకాలగ్రస్తులైరి. ఇట్టి భక్తిరసప్లావిత మనస్కుడు భావుకుడు నగు శ్రీ రఘువరదాసింక మనకు కానరార! కాని ఆయన యొనర్చిన నామసంకీర్తనము భక్తుల హృదయములలో నేటికిని, ఎన్నటికిని ప్రతిధ్వనించుచునే యుండును. అట్టి భావుక హృదయమును, భక్తి రసప్లావిత చిత్తమును స్మరించుచు యావ దాంధ్ర ప్రజలు తత్సాధు ప్రచారితమైన నామ సంకీర్తనముచే తరింతురుగాక.

- ప్రభుదత్త బ్రహ్మచారి.

## 159. వాక్సుమాంజలి

**శ్రీరమణాశ్రయులు - అరుణాచలము**

హరేరామ హరేరామ రామరామ హరేహరే
హరేకృష్ణ హరేకృష్ణ కృష్ణకృష్ణ హరేహరే

అరుణాచలశివ అరుణాచలశివ అరుణాచలశివ అరుణాచలా

"రామభక్తి సామ్రాజ్యము యే మానవులకు అబ్బెనో
ఆ మానవులక్కు సందర్శనము అత్యంతబ్రహ్మానందము ॥ రామ ॥
ఈలాగని వివరింప లేను. చాలా స్వానుభవైక వేద్యమే ॥ రామ ॥

అని శ్రీ త్యాగ బ్రహ్మము వారి దివ్యసూక్తికి లక్ష్యభూతముగా వున్న శ్రీవారి సాంగత్యము, వారి సంకీర్తన, వారి ఆప్యాయత, ఆత్మీయత, సౌలభ్య సౌశీల్యమును అనుభవించని వారు, వాటిని గురించి విననివారు, అందుచే ముగ్ధులుగానివారు

చాలాకొద్దిమంది అనుట అతిశయోక్తిగాదు. ఇది నిశ్చయముగా శ్రీవారియొక్క నిర్హేతుక కృపచేత లభ్యమై అందరినీ కృపా పాత్రులుగా చేయచుండును. అట్టి తీర్థపాదుల, పుణ్యశ్లోకుల వాక్కులను. విననివారు మననము చేసికొనుచూ, వాటిని ఆయా సందర్భములనూ తలచి తలచి ముగ్ధులై తన్మయమందుటకు విననివారు. వారి సూక్తులప్రయోజనము పొందుటకు గాను ఆ శ్రీహరి కృపయే యీ సూక్తుల రూపమున విరాజిల్ల బోవుచున్నది. ఇటువంటి అపార శ్రీ హరికృపను వుపయోగించు కొని పఠించి, మననము చేసుకొని, జీవితమును భగవన్మయము చేసి కొందుము గాక!

అదియే శ్రీవారికి ప్రధాన ఆదేశమైన కలి సంతరణోపాయ మగు భగవన్నామ సంకీర్తనమునకు మనము సమర్పింపగల్గినది నిజమైనజోహారు! అదియూ వారి అనుగ్రహము చేతనే సిద్ధింపగలదు.

నామసంకీర్తనమునకు మించిన సులభము, సుందరము, శ్రేష్ఠము, సర్వస్వ తంత్రము, వేదప్రతిపాద్యము అయిన ఏకైక వుపాయము లేదులేదనియే శ్రీవారి ప్రధాన సూక్తి. ఉపేయము గూడ అదియే. దాని నాశ్రయించుటచే అదియేతాను... అంతయూ అదియే...అని అనుభవసిద్ధమగును. ఈ ప్రధానసూక్తినే పలువిధములగ అనేక సందర్భములలో శ్రీవారు ప్రతిపాదించి హృదయమున ధృఢముగా నెలకొల్పుటచే చెప్పినవే ఈసూక్తులు.

వారిసూక్తులలో మూర్తీభవించిన వారిజీవితమే ప్రధానసూక్తి. కావున నామసంకీర్తనాచార్యులు అని సర్వకాలమున విరాజిల్లుచున్నారు. పరబ్రహ్మము "భగవంతుడు" "భగవన్నామము" యేకమైనట్లు నామసంకీర్తనగా మూర్తీభవించిన శ్రీస్వామిజీ తదభిన్నులే అను భావదార్ఢ్యముచేత స్వామివారిని గురించి చెప్పుటయన్న ...నామమును గురించి, భగవంతునిగురించి చెప్పుటయె...అవశమై హృదయము స్పందించుట జరుగుచున్నది. శ్రీస్వామివారిని గురించి, వారి సద్గుణములను గురించి, వారి జీవిత విధానమునుగురించి సంగ్రహముగా చెప్పవలెనన్న శ్రీవాల్మీకి మహర్షి వివరించిన శ్రీరామకథ యందలి శ్రీరాముని పరముగా ప్రతిపాదింపబడిన పదునారు లక్షణములు ఆధారము, ఆ రామకథనే ఆధారాముగా గొని తులసీదాసు, రామదాసు మొదలైన మహాత్ములు తనివితీర కీర్తనలుగా పాడుకొని, అందరికీ శ్రీరాముని దివ్యగుణ కీర్తనమునకును ఆశ్రయభూతులైరి. అట్లే రామనామ సాంగత్య

ముచే ఉపాసకుడు ఆరాధించినమూర్తి తానేయగునట్లు శ్రీస్వామిజీ తన ఆరాధ్యమూర్తి యగు శ్రీరామచంద్రమూర్తికి ప్రతిబింబరూపమై మనలో సంచరించిరి. రామాయణమున వివిధ సన్నివేశములలో రాముని నడతయే స్వామిజీలో... పెద్దలకు వినయముగాను, ప్రజలకు ప్రభువుగాను, చిన్నవారికి ఆదర్శభూతులుగాను, జిజ్ఞాసకులకు గహనమైన శాస్త్రీయ విషయములను సహితము స్పష్టముగా, దృఢముగా, సులభముగా అందజేసెడివారు అట్లేకష్టములోనున్న వారిపట్ల వారిహృదయము కరుణతో ద్రవించుటయేగాక వారికష్టమును నివారించి ఆనందించువారు. స్వామి ధనముపట్ల నిర్లిప్తులు. భక్తులు సమర్పించెడి ధనమును మనసుననైననూ స్పృశించక పాత్రులగు వారికి గుప్తముగా వినియోగించు చుండెడివారు. వారి దర్శనార్థము వచ్చువారిలో యేధోవిధమున వారి సహాయప్రసాదమును పొందనివారు లేనేలేరు.

వారివినయము యింతని చెప్పలేము. తమకు ఆశ్రమమిచ్చిన బ్రహ్మీభూత శ్రీశ్రీశ్రీ ప.ప సదాశివేంద్ర సరస్వతిస్వామి వారికి గురుశుశ్రూషగా చేసిన మరపురాని యాత్రాచరణ వారి గురుభక్తి వినయమునకు నిదర్శనము. వారిపాదముల దగ్గర క్రింద కూర్చొని "మాగురువుగారు... మాగురువుగారు" అని అమితగురు భక్తితో ప్రస్తావించెడివారు. అట్లే మంత్రగురువులగు శ్రీజానకీ వల్లభ శరణజీ (అయోధ్య) వారి యందు, పూజ్యపాద శ్రీ ప్రభుదత్త బ్రహ్మచారిగారి యందు చివరి క్షణమువరకు ఒకేరీతిగాను ప్రేమ, గౌరవము, పూజ్యభావము, వినయములతో నుండిరి.

ఇతరుల స్వల్పగుణములను పెద్దజేసి ప్రశంశించి ఆనందించెడివారు. ఐతే వారిగుణ విశేషములను యెరుగకుండకాదు. అంతియేగాదు. దగ్గరకు చేరిన భక్తవేషధారులు వారికిగల అసూయచే వీరిని ద్వేషించి దుష్ప్రచారము చేయువారిని సైతము ఆదరించి, గౌరవించి, పూజ్యులుగా లోకమునకు వెల్లడిచేసినారు. ఈవిషయమ్మున తన్ను హింసించిన చోరులను భాగవతోత్తములుగా ప్రకటించి పూజించి సమ్మానించిన జయదేవుల జీవితసన్ని వేశమును శ్రీవారి జీవితములో అనేకసార్లు చూచితిమి. అన్నిటికంటె గొప్పదైన మానమున ఛాయామాత్రముగా గూడా తలయెత్త కుండా జీవించినారు.

అంతా నామమయముగా ... అంతా రామమయముగా ... అంతా చిద్విలాసముగా,స్వస్వరూపముగా ... అభ్యసించి, అనుభూతమును పొంది, ఆరూఢులై

ప్రతిక్షణమూ ప్రతిమాటలోను ఉచ్ఛ్వాసనిశ్వాసలోను ఈ అనుభవమునకు వచ్చిన సత్యమును సామాన్య జనులకు సైతము హృదయమునకు హత్తుకొనినట్లు, యిది మనకూసత్యమే అనుపించునట్లు ఆక్షణమున అనుభూతిపొందునట్లు చివరజరిగిన సప్తాహములలో మంగళహారతి సత్సంగములలో త్రివిక్రముని అవతార సమయమున జాంబవంతుడు దండోరా వేసినట్లు చాటినారు.

పెంకిపిల్లలను తల్లిదండ్రులు మచ్చికచేసి దారికి తెచ్చినట్లు శ్రీవారునూ వారివారికి తగినట్లు కొందరికి తల్లివలె, కొందరికి స్నేహితునివలె, కొందరికి గురువులె, కొందరికి భగవంతునివలె ప్రవర్తింపజేసి ఆనందించిరి.

"సత్పురుషులు ... తీర్థకుర్వంతి తీర్థాని" అనుమహర్షి సూక్తికి లక్ష్యభూత ముగా అరుణాచలము, బృందావనము, ప్రయాగ, మొదలైన దివ్యక్షేత్రములను గూర్చి భక్తుల హృదయములను చైతన్యవంతముచేసిరి. అరుణాచలమునుగూర్చి మారుమూల పల్లెలలో సైతము ప్రస్తావించుట యేగాక సామాన్య జనులకు వూహించుటకు సైతము అలవిగానిదియు, బహుకష్ట సాధ్యమైనదియు నగు అంగప్రదక్షిణమును హృద్రోగపరిస్థితిలో డాక్టరు వలదన్ననూ సునాయాసముగా .. లీలామాత్రముగా ... చేసిరి. అట్లే "సచ్ఛాస్త్రీకుర్వంతి శాస్త్రాణి" అను శ్రీనారద మహర్షి సూక్తికి లక్ష్యభూతముగ శ్రీమద్భాగవతమును చదివి మననము చేసుకొనుడని యెంతమందినో ప్రోత్సహించిరి. అట్లే తులసీ రామాయణమును నవాహ్నికపారాయణ యెన్నోమార్లు తాను జరుపుకొని యితరులసైతము జరుపుకొనేట్లు ప్రబోధించిరి.

ఉపనిషత్ ప్రతిపాద్యమైన కలిసంతరణ మహామంత్రమును తాను సంకీర్తన చేయుచూ యితరులచే చేయించిరి. ఆ నామసంకీర్తన శాస్త్రమునగల సౌలభ్యమును యితరమంత్రనియములచే గజిబిజి పడకుండా స్పష్టపరచి శాస్త్రీయముగా పలువిధ గ్రంథములనుండి, ఆచార్య సూక్తులనుండి, సర్వాంగ సుందరముగా సర్వ స్వతంత్రమైనదిగా వున్న సత్యమును సర్వులూ నిస్సంశయముగా నుండునట్లు స్థాపించిరి.

ఎవరైననూ ఆకలి అనిన ఆకలిబాధచే "చెవులుఘుడియుల పడువారి" కంటె యెక్కువ బాధపడి తానుతినబోవుదానినైననూ వారికి యిచ్చి వారుతిని తృప్తి పొందినపుడు ఆనందించెడివారు. అందుననూ వున్న వాటిలో శ్రేష్ఠమైన వాటినే యితరులకు పెట్టవలెనని పెట్టి ఆనందించెడివారు.

వారినిగురించి యిట్లుయెంతని చెప్పిననూ తనివితీరదు. అంతుచేరలేము. వేదములే అంతుచిక్కక తిరిగినవన్న బ్రహ్మాభిన్నులైన శ్రీవారిని గూర్చి యెట్లుచెప్ప గలము.

వారిని గూర్చి, ఆధ్యాత్మికముగా వుపయోగపడురీతి వారే సత్సంగము లలోనే గాక సంకీర్తనలలోను, సప్తాహ మంగళహారతి సత్సంగములలోను ప్రస్తావించిన దివ్యవిశేషములను, టేపురికార్డు మూలమునను వారే స్వయముగా దూరముగానున్న భక్తులకు జాబుల ద్వారా ప్రబోధించిన విషయములను, వాటితో పాటు శ్రీవారి జీవిత విశేషములను బహుశ్రమతో సేకరించి తీర్చిదిద్ది గ్రంథరూపమున బహుజనో పకారముగా శ్రీవారి పాదసన్నిధిలో సమర్పింపవలెనని ఆశ, ఆశయము, కృషి ... శ్రీవారి అనుగ్రహమున, భక్తులు సహకారమున ఈ సత్సంకల్ప రూపారాధన జయప్రదముగ, సర్వ శోభాయమానముగా నెరవేరునట్లు శ్రీహరి అండయై, తోడునీడయై మారుతి ముందునడువ ప్రార్థింతుముగాక ! శ్రీరమణాశ్రయి (వెంకటరత్నం)

జయతు జగన్మంగళం హరేర్నామ !

## 160. అవధూతాష్టకము

శ్రీవిష్ణు చరణోద్భాసి హృత్కుశేషయ సుందరం
వందేత్వాం అవధూతేంద్రం విశ్వ గౌరాంగ రూపిణం

తృణీభూతం జగద్యస్వ మేరుభూతం హి కీర్తనమ్ ॥ వందే ॥
నామైవ జీవనం యశ్వనామైవ పరమంధనం ॥ వందే ॥
తీర్థభూతం మహాత్మానాం తీర్థ సేవన తత్పరం ॥ వందే ॥
భాసయంతం హరేర్నేమ సర్వవేదో పరిష్ఠితం ॥ వందే ॥
యశ్వ దర్శనమాత్రేణ నాస్తికో ప్యాస్తికోభవేత్ ॥ వందే ॥
సంకీర్తన మాహాచార్య ఆంధ్రామ్ భక్తి ప్రవర్ధనమ్ ॥ వందే ॥
అష్టకంహి అవధూతస్యయః పఠేత్ శృణుయాదపి
అభ్యక్త్యో భక్తి మాప్నోతి భక్తో విష్ణోరనుగ్రమ్ ॥ వందే ॥

## 161. అవధూతాయ వందనమ్

1. మునిమానస హంసాయ మార సుందరమూర్తయే
చిదాబ్జ పత్రనేత్రాయ అవధూతాయ వందనమ్



గీతాభవన్ ఏలూరు సప్తాహములో



గీతాభవన్ ఏలూరు సప్తాహములో



షపూర్‌వాడి హైదరాబాద్ సప్తాహములో



అరుణాచల సప్తాహములో (6-9-1974) నుండి (13-9-1974) నగరసంకీర్తన



శ్రీమతి శాంతాజి, వారి మతారామ్, శ్రీవేణుగోపాల్‌రెడ్డి గారి పరివారముతో (30-3-1969)



స్వామివారి భౌతిక శరీరము చాలించిన స్థలము ( హిమయత్‌నగర్ హైదరాబాద్)

2. హర్నేనామావతారాయ గురుదేవాయ స్వామినే
శివనామానురక్తాయ అవధూతాయ వందనమ్

3. వాసుదేవ స్వరూపాయ వాసుదేవైక భాషిణే
యతిలోక వరిష్టాయ అవదూతాయ వందనమ్

4. శిష్యవాత్సల్య చిత్తాయ సంకీర్తన పరాయచ
చిదానంద స్వరూపాయ అవధూతాయ వందనమ్

## 162. నామావతార

గురు దేవా గురుదేవా, నామావతారా వాసుదేవ ॥ గురు ॥
విశ్వేశ్వరునిగా విద్యలు బడసి రఘువర దాసై సంకీర్తనలసల్పిన ॥నామా॥
అవధూతేంద్రవై అఖిల జగంబున "హరేరామ హరేరామ రామరామహరేహరే
హరేకృష్ణ హరేకృష్ణ కృష్ణ కృష్ణ హరేహరే "
నామా మృతమును ప్రసాదించితివి నామ వాహినిగా ప్రవహించితివి ॥నామా॥
సరస్వతి స్వామి సచ్చిదానంద, నిరతము నిను సద్భక్తి తో తలచెడి
శిష్యమనంబున వశించు స్వామి అందుకొనుము మాప్రేమ సుమాంజలి
॥ నామా ॥

## 163. మధురం మధురం

మధురం మధురం అతి మధురమ్ సద్గురునామం అతిమధురం
అవధూతేంద్రనామం అతిమధురమ్
నామావతారం అవధూత రూపం ప్రేమావతారం ప్రణవ స్వరూపమ్
పతిత పావనమ్ పాపవిమోచనమ్ అవధూత్రేంద్రుని అవతారమ్ ॥ మ ॥
అద్వైత భావం సరస్వతి రూపం సుజ్ఞాన దీపం సాధు స్వరూపం
సంగీత సారం సత సంగనిలయం, అవధూతేంద్రుని అవతారం ॥ మ ॥
రామనామ మె నిరతము గానము విష్ణు నామమె మదిలో ధ్యానము
శంకర రూపమే నృత్య స్వరూపము అవధూతేంద్రుని అవతారము ॥ మ ॥
హనుమదంశగా ఆంధ్రావనిలో అవతరించిన త్యాగ స్వరూపివి
భక్తకోటికొక బాట మరించి సతతము బోధెడి సద్గురుస్వామి ॥ మ ॥

## 164. మంగళహారతి సద్గురు స్వామికి

మంగళహారతి సద్గురు స్వామికి । అవధూతేంద్ర సరస్వతి స్వామికి
మంగళప్రదమగుగురు చరణములకు ॥ మం ॥

అవనిలో జనులకు ఆధారం బగు హర్నే నామమును ఆనందముతో
అమృతధారలుగా కురిపించిన య ఆవధూతేంద్ర సరస్వతి స్వామికి॥ మం॥

అనవరతము తన మనమున మరువక మననము చేసిన మహా
మంత్రమును
"హరేరామ హరేరామ రామ రామ హరేహరే హరేకృష్ణ హరేకృష్ణ కృష్ణ కృష్ణ
హరే"
ప్రేమచే తన భక్తులకు ఘనమున నొసగిన ఘనుడుయతీంద్రుడు
అవధూతేంద్ర సరస్వతి స్వామికి ॥ మం ॥

## 165. అవధూతసూక్తులు

నామామృతము సర్వదోషములను బోగొట్టుతుంది. భోజనసయమమున భగవన్నామము తప్పక చేయవలెను. పూజ, పాఠముకన్న సర్వోపరిశ్రీరామనామము. నామజపమున సమస్తధర్మములు ధర్మఫలములు ప్రాప్తించుననుట, సత్యము. కృత, త్రేత, ద్వాపరయుగ ధర్మములకన్న కలిలో భగవన్నామస్మరణమున పదిరెట్లధిక పుణ్యము గులుగును. యజ్ఞ, దాన, తపములకన్న శ్రీరామనామము మిన్న. సాధకుడు భోజనము మితముగా భుజించుటవలయును, రుచులకొరకు లోభుడై అదికముగా భుజించుట భోగియొక్క లక్షణము. భగవదారాధన కొరకు సాధకుని వస్త్రములు గూడ సాదాగానే వుండవలెను. ఆడంబరముగా నుండరాదు. ఒక్కభగవన్నామము విడువక జేయుచుండిన యీజన్మలలోనే జయము నిశ్చయము. మలవిసర్జనముచేసి ప్రక్షాళనము జేయని వాడు ఎంతనికృష్టుడో, అంతకన్న అధమాధముడు భగవన్నామము వదిలినవాడు. భగవన్నామము నిష్ఠతో జపించిన సర్వమూ బృందావనమని స్థిరత్వ మేర్పడును, ఆస్థిరస్థితిలో బృందావనమే ప్రపంచమగును. నిరంతరము జరుగు నామజపంచేత అన్నియు స్థిమితమగును. నామస్మరణ నిరంతరం చేయాలి. నామంచేస్తే విశ్వరూపుడైన పరమేశ్వరుని దర్శనం నీకు విశ్వమంతటా కలుగుతుంది. కనుక నామాన్నే ఆశ్రయించు.

సకల తపస్సుల ఫలమగు శ్రీహరినామమును మరువకుండుటయే జన్మసాఫల్యము. మరణము - మానవుడు - మాధవుడు - సకల సుఖములు సకల దుఃఖములు - స్వర్గనరకములు ఆత్మే. అన్యము ( అధ్యాస) తదధిష్ఠానము ఆత్మే. భ్రాంతివలన ఏమేమో అనుకుంటారు. అంతయు ఆత్మ విలాసమె. అస్తు. శరీరము ఉన్న ఆత్మకు అభిన్నమె. శరీరము పోయినా ఆత్మకు అభిన్నమె, రాకపోకలు ఆత్మయందు అధ్యాసయే. అధ్యాసకూడ ఆత్మే శ్రీహరిని మరచుటకన్న - ఆయన నామమును మరచుటలో ఎక్కువ కష్టము లున్నవి. మానవుడు సావధానుడైసతతము తనజీవితము సత్పురుషులవలె గడచుచున్నదా! లేక పశువులాగ గడచుచున్నదా! యని జూచు కొనవలయును. పితృ, గురు, జనని, బంధు, పతి దైవతంబులలో నెవ్వరును సంసారరూప మృత్యురహితంబైన మోక్షమార్గంబు జూపకుండిరేని వా రెవ్వరును హితులు గానేరరు. సర్వఫలములకు ఫలస్వరూపము భగవన్నామము. భోగవాసనలను నశింపజేయును - హరినామము. పవిత్రమునకు - పవిత్రము, మంగళమునకు - మంగళము భగవన్నామమే. సర్వేశ్వరుని నామారాధన సర్వలోకాల వారికి మంగళప్రదమగు అద్వితీయ సాధన.

సోమసూర్యాగ్నుల మించిన స్వప్రకాశము రామనామము. సర్వకాలము లందు మేలుకోరు మిత్రము భగవన్నామము. సకలతీర్థములు. దానములు కర్మలు - వీనియొక్క ఫలమే సత్పురుషదర్శన, సల్లాపములు. చెట్టుకుపిందె పుడుతుంది. అది వగరు, పులుపు గలిగివుంటుంది. అది చెట్టునే వుంటె పక్వమై పండు అవుతుంది. అలాగుననే భగవన్నామాన్ని వదలకుంటె మనస్సుక్రమంగా పక్వమయి పరమాత్ముని యందు హత్తుకొని పోతుంది. ఏవిధంగానైనా సరే నామసంకీర్తన, జపము వదలకుంటేచాలు. మనస్సుజోలి వదిలేసెయ్యి. నామంజూచుకుంటుంది. భగవంతుని నమ్మినవారికే, విశ్వసించినవారికే పరమశాంతి లభించును. ప్రాపంచిక వస్తువుల అధీనమందుండుట బుద్ధి మంతునకు, సారగ్రాహిఅయిన మానవునకు నరకసమానముగ దోచును. ఏడవకుండా, దుఃఖంలేకుండా ఎవరు భగవంతుని పొందగలరు?. మానవుడు, భగవంతుడు ఏదో ఒకరూపంతో ఎప్పుడు సన్నిహితుడై యుంటా డని విశ్వసించిన ఎంత ఆనందముగానో ఉండగలడు. సుఖసమయంలో కంటే దుఃఖసమయంలో విశేషించి సన్నిహితంగా యుంటాడు.

అంతఃకరణము శాంతిగా యుండుటకు ఉపాయము, అన్నివిషయముల యందు భగవదిచ్ఛానుసారంగా నడచుటయే. ఎల్లపుడు గలసియుండుటయే

కేవలము అనాదరమునకు గారణము. పవిత్రమగు గంగాజలమును విడచి గంగ సమీపమునవుండు మనుష్యులు పారిశుద్ధ్యమునకు నూతుల దగ్గరకు వెళ్ళెదరు. అటులనే సత్పురుషులవద్ద వుండువారు సత్పురుషులను గౌరవించలేరు. స్వామీ! మీకు భయముకలదా? - నాకు పెద్దభయము కలదు. అదేది? "కోరికలనిన". స్వామీ! మీరు సంకీర్తన ఎందుకు చేయుచున్నారు? ప్రచారమునకా? కాదు నాయనా? సంకీర్తనచేయడం నామానికి సేవచేయడం. దుఃఖానికి కారణం దేహబుద్ధి. సుఖానికి కారణం ఆత్మబుద్ధి. భగవన్నామ మహిమకు శివసాయుజ్యము, బ్రహ్మపదవి గూడ సరిరావు. భగవంతునికి - భగవన్నామానికి భేదంలేదు. సత్సంగం దొరికితే సర్వేశ్వరుడు లభించినట్లే గాదా.

కలిలో సత్సంగం అయిదునిముషము లయినను చాలు, మానవుడు తరించడానికి. తల్లి, తండ్రి, హితులు, సోదరులు, భార్య, పుత్రులు, వీరిలో ఒక్కొక్కని వలన ఒక్కొక్కలాభమే కలుగును. సర్వలాభములు కేశవునివలన కలుగును. అనేక జన్మల తపస్సంపన్నతచే భారతభూమి యందు జన్మదొరుకును. ఇక్కడే ముక్తిసంపన్నత. జ్ఞానంవలన అహంకారం పోతుంది. భక్తివలన మమకారం నశిస్తుంది. ధ్యానానికి యెక్కువ ప్రాధాన్యం యివ్వటం చాలమంచిది. ఆంతరిక సాధన చాలా మంచిది. మానసికముగా భగవత్ లీలాచింతనం మహోపకారం జేస్తుంది. అవసరమైన గురుసేవ భగవత్ప్రాప్తికమూలం. శ్రీహరిని సర్వభూతమయునిగా దెలిసి, భక్తులైనవారు సకల భూతములయందు నిశ్చలమైన భక్తి జేయవలయును. సర్వభూతస్వరూపుడగు భగవంతుని వీడుపుణ్యాత్ముడు, వీడు పాపి, వీడు దుర్మార్గుడు అనుప్రసక్తి వదిలి సర్వత్రవున్న నారాయణుని భజించవలెను. మనస్సు బహిర్ముఖము గనున్న విపత్తులకు లోటు ఏమీవుండదు. బహిర్ముఖ మనస్సే సర్వానర్థకారణము.

నేను అబాధ్యము, అనామయము, అజరము, అనన్యము. అట్టి అపరిచ్ఛిన్నముగనున్న నేనును ఎవరు కుంగదీయుదురు? బాధింతురు?. మనసు చెడ్డది. మోసం చేయిస్తుంది, మోసంలో పడేస్తుంది. దానికి విరుగుడు శ్రీరామనామమే అందరికి గతియని మహాత్ములు చాటినారు. గాయత్రీజపము మాత్రముచేతనే బ్రహ్మణుడు సిద్ధిపొందగలడు. తల్లి, తండ్రి, గురువు, దైవము - భగవద్విభూతులు,. వీరిసేవ వలన భగవదనుగ్రహము తప్పదు. మాతాపితలు ప్రత్యక్ష దేవతలు. వీరిసేవ వలన భగవదనుగ్రహము అతిసమీపము. రోగి మనోవాక్కాయ కర్మలతో మందులు తీసికుంటున్నా అసలు ఆత్మబలం కావాలి. ఏసమయంలో దేహబుద్ధిగలచోట

దైవబుద్ధి యుంటుందో ఆ రాత్రులన్ని శివరాత్రులే. భగవన్నామము చిత్తమునందలి భోగవాసనలను బోగొట్టును. భగవత్స్మరణతో జరుగుపనులన్నియు శివమయములే. భౌతికముగా యీదేహము ఎవరిదో వారిని జపించుట మానవుని ధర్మం.

కంటికి కనుపించిన దంతయు నశించునదే. ఒక్క భగవన్నామమే నశించనిది. అన్ని ప్రాణులు భగవత్పరమే యని నిశ్చయబుద్ధితో ప్రవర్తించుటయే అత్యుత్తమకోటికి చెందిన సాధన. ఈసృష్టిలో భగవంతుడంత దయగలవాడు లేరు. శరీరా లస్థిరాలు, శరీరి సుస్థిరుడు. యతులకు మరణం - మంగళం. భగవంతుని కిష్టంలేకపోతే రాయివంటి శరీరంగూడ రెప్పపాటు కాలంవుండదు. ఆయన వుంచదలిస్తే వూడిపోతున్నట్టున్న శరీరంతోనే అద్భుతంగా సేవలు అందుకుంటాడు. జీవునికి ఉత్తమసేవ ఒక్క భగవన్నామమే. శ్రీమద్భాగవతం తాపత్రయోన్మూలనం. సత్యం! సకల సాధనలలో శ్రీమద్భాగవత శ్రవణ పఠనములు శ్రేష్ఠమైన సాధన. సగుణము - నిర్గుణము అంతయు బ్రహ్మస్వరూపమే. సత్పురుషులుగల స్థలములు పరమపవిత్రములు. ఈశ్వరేచ్ఛను ఎవరును ఉల్లంఘించలేరు. రెప్పపాటుకాలమైన సత్సాంగత్యం మహాలాభం. నేను దేహమను బుద్ధియే నరకము - అది కలవాడే నరకుడు. దానిని నశింపజేసికొని, స్వయంజ్యోతియగు ఆత్మగా వెలుగుంటే దీపావళి పండుగ.

సాధకుడు మితముగ మాటాడవలెను. మితముగా పరుండవలెను. ప్రాపంచిక విషయములనుండి అలిప్తుడుగా నుండుటకై ప్రయత్నించవలెను. త్యాగ వైరాగ్యములు లేనిచో భగవత్ప్రాప్తి గలుగదు. ఒకభక్తుడు 72 సం॥ములు సాధన చేసినను తనదగ్గర నున్న రెండువస్తువులను విడుచువరకు భగవత్ప్రాప్తి గలుగలేదు. సాధకుడు ఎంతెంత శ్రద్ధగలవాడగునో అంతంతగా విపత్తులు సంపత్తులుగా మారును. శత్రువులు మిత్రులగుదురు. జగత్తు ఇష్టదేవుని స్వరూపముగా నుండును. ఖాళీసమయంలో నోటితో భగవన్నామం జేయుచుండుము. తత్ఫలితంవల్ల మనస్సు అన్యాయత్తం గాదు. నోటితో అభ్యాసఫలమే మానసికము. హరిభజన జేయనివారు దుర్దైవులు. అనగా దురదృష్టవంతులు. హరిభక్తియే యథార్థమైన భాగ్యము. హరి భక్తివలన భయ, మోహ చింతలనుండి విముక్తి గలుగును. నీకు ఆయన్ని (భగవంతుని) ప్రేమించటం చేతకాకపోయినా ఆయాన సతతము నిన్ను తననుగా ప్రేమిస్తున్నా డని గుర్తుంచుకొనుము. నిష్కామ నామస్మరణ వలన పాపము తొలగి సత్వగుణము వృద్ధి పొందును. అన్నిధనములకన్న నామధనము గొప్పది, తరగనిది,

జుట్టినకొలది పెరుగును.

నిత్యము నిష్ఠతో భగవన్నామ జపం జేయువారు దుర్లభ మని జ్ఞానేశ్వరులని నారు. కొనఊపిరి ఉన్నతంవరకు శరీరముద్వారా హరినామసంకీర్తనలు జేయించు కుంటే యింక కావలసిన దేమున్నది? భౌతికధనం ఇహంలో సుఖాన్ని యివ్వవచ్చు. గాని ఆధ్యాత్మికధనం, వాసుదేవుడనే ధనం పరమశాంతినే ప్రసాదిస్తుంది. అభయ స్థానాన్ని యిస్తుంది. వాసుదేవ తత్పరుడే సర్వధర్మఫలాన్ని అందుకునేది. అందరిని వదిలి భగవంతునితో సంబంధం పెట్టుకోవటం భక్తి యంటారు. ఈజన్మలో నేను తరించలేకపోతే నరకమైనను అనుభవించెదను, గాని వాసుదేవుని వదలను యని ధృఢనిశ్చయముతో నుండుము. గాలిపటము ఎంతదూరంలో నైనావుండనీ, దారంనీచేతిలో వుంటె అది మనస్వాధీనమే నన్నమాట, అలాగే భగవన్నామాన్ని పట్టు కొన్నావా భగవంతుని పట్టుకున్నట్లే. "రామకృష్ణ"

వాసుదేవసేవే అక్షయమైననిధి. అది అనంతం అవ్యయం, సచ్చిదానంద మయం. అసలుసుఖం అదే. మిగిలిన సుఖాలు అంతం గలవి. అసత్యములు. మనసు యెలాఉన్న అభ్యసించితే నిరంతరం భగవన్నామము జరుగగలదు. రోజుకి 3 నిముషములు కంటికి కనబడు, లేక మనస్సుకుతోచు వస్తువులకు ప్రాణులకు - (చరాచరములు) నీయిష్టదేవునిగా భావించి చేతులు జోడించి వందనము జేయుము. ఎన్నో పూజల ఫలం వస్తుంది. ధనవంతు డగుట దైవయోగము కాదు. తన ధనమును తానైనా అనుభవించుట భగవ దనుగ్రహము. ధనము సంపాదించుట దైవయోగముగాదు. సంపాదించిన, సద్వినియోగము చేయుట భగవ దనుగ్రహము. నీవు నామంచెయ్యి. ఆ నామధారి విడువక నిన్నంటి పెట్టుకుంటాడు. నీవనుభవించు ప్రతిది భగవంతున కర్పించి యనుభవింపుము. అంతయు నాయన యిచ్చినదేగా. ఈ భావము మరువరాదు. మనస్సు బాహ్యవిషయములందు ఇట్టే తన్మయం అవుతూ యుంటుంది. దానిని భగవత్పరం జేస్తూ వుండటమే మనప్రయత్నం. దానికి భగవంతుడు ఎంతో బలాన్ని యిస్తాడు. పాపం వుందనుటకు గుర్తుఏమిటి? మనస్సులో వాసన లుండుటయే.

వాసనలు పాపబీజములు. భగవంతుడు డగ్నితో సమానంగా అందరి దుఃఖములను పోగొట్టును. నాకు నీ ధర్మములు అవసరములేదు. వాటిని వదిలి నాయొక్క శరణు నొందుము - భగవదాజ్ఞ. నాగురించి నీయొక్క అభిమానాన్ని

వదిలి పెట్టుము - భగవంతుడు. తనకు తనను అద్వితీయ బ్రహ్మనని ఎరుంగుటయే అజ్ఞానము. నీయొక్క బుద్ధి నిశ్చయించినా, నిశ్చయించకపోయినా నీవు బ్రహ్మవే. బుద్ధి నీయందు కల్పితం. అవిద్యానివృత్తి తత్వజ్ఞానంతో కలుగుతుంది. శరీరాదులు మిథ్య యని తలచక, సాధనను మిథ్యయని తలచినవారు మాత్రము ఆత్మద్రోహులౌదురు ఈశ్వరుని యందు విశ్వాస ముంచితె ఆచార దోషం నివర్తక మౌతుంది. వాసనా నివృత్తికొరకు ఈశ్వరభక్తి అవశ్యకము. ఈశ్వరుని విశ్వాసముంటే సంసారికమైన యోగక్షేమముల చింత తొలగి పోతుంది. సంసార వివేకమే పరమార్థము. అట్టివివేకం కావలిస్తే ఈశ్వరుణ్ణి విచారించుము. అంతా వాసుదేవుడు - అట్టి బుద్ధిగలిగితే సంసారమునం దనురాగ ద్వేషములు వదిలిపోవును.

సర్వత్ర సమానరూపంతో యుండు ఈశ్వరుని చూచుట (సమం). ఆత్మఘాతకు డెవడు? పరమాత్మను తెలియనివాడు. జ్ఞానస్వరూపమగు తనను అజ్ఞాని ననుకొనుట ఆత్మహింస. భగవన్నామము యోగసారం, భక్తికిప్రాణం, జ్ఞానస్వరూపం అనంతం. అఖండం, అవ్యయం, అనామయం, ఆత్మస్వరూపం, స్వసుఖం. మానవునకు ఆస్తి మాధవుడుగాని మాయగాదు. మాధవుని స్మరింపక, ఆశ్రయింపక మానవుడు మాయను తొలగింపజాలడు. అంతంగలది మాయ - అనంతుడు భగవంతుడు. ఇతరుల మంచిచెడ్డలు వినవలదు - అనవలదు. ఈ రెంటిలో ఏ ఒక్కటి వున్నా నష్టము పొందుదురు. ఎన్నికష్టములు వచ్చినను భక్తుల సాంగత్యమునుండి దూరము చేయరాదని భగవంతుని ఎల్లపుడు ప్రార్థించవలయును. భగవద్భక్తులు ధర్మమునే ఆశ్రయించి యుందురు. వారి కదియే కవచము. భగవన్నామ భగవత్కథలు శరీరం వదలు వరకు విన్నవారు ధన్యులు. ఆశ్రమాలలో కలిప్రవేశం తక్కువగాలేదు. (ఎక్కువ). భగవన్నామము ఎక్కడుంటే అక్కడే సర్వతీర్థ క్షేత్ర - యజ్ఞ - యాగఫలములు వచ్చి సేవించుచుండును.

ఆత్మకే జీవుడని, జగత్తని - ఈశ్వరుడు డని, అంటే ఆత్మేతర ముందను కొనుట పొరపాటు. జ్ఞానప్రాప్తి సాధనలో సాధకునకుముఖ్యంగా ఇతరుల మంచిచెడ్డలకు బోకుండా యుండాలి. నిందాస్తుతులు సాధకునకు పనికిరావు. ఈ పాడుమనస్సుకు బాగా యీదురలవాటు యిష్టము. ప్రయత్నపూర్వకముగా ఈ ఆత్మఘాతకము జేసే దుష్టస్వభావాన్ని తరిమే సెయ్యాలి. తన పాపములవలెనే ఇతరుల పాపములను తలంపని వానికి పాపములు సంభవించుటకు కారణము

లేదు. ఎవడు మనస్సుచేతగాని, వాక్కులచేతగాని శరీరముచేతగాని ఇతరులకు అపకారము జేయునో, వానికి అట్టికర్మ యనెడి ఫలము గలగుచున్నది. గొప్ప దుఃఖమున్ను గలుగుచున్నది.

భగవన్నామము ముందర విషము - అమృతము. ముఖ్యసాధన ఉన్నది ఉన్నట్లు పలుకుటయే. సంగం అంటే వాసన - సంగం పోవాలంటే సత్సంగం. సుఖదుఃఖాలకు అతీతమైన ఆనందమే "నేన" ను స్ఫురణ కలుగవలయును. భగవన్నామం పరమార్థగాములకు సంబళం. నామజపం వలన భుక్తి - ముక్తి - మోక్షం అరచేతికొస్తుంది. నామజపంవలన మృతత్వంపోయి అమృతమయం అని తోస్తుంది. నాలుకలో వున్న అసత్యమనే మైల నశించాలంటే ఒక్క హరినామంతోనే నశించాలి. తీర్థోదకాలతో కడిగితే పోదట. క్రియా, కర్మ, ధర్మల చింత మాని నామ ధనాన్ని పుంజుకున్నవారు ధన్యులు. నామం అమృతంయొక్క నిధి. సమ్యక్ కీర్తన - సమ్యక్ జ్ఞానమె. నామముతో యోగము - సమాధి సాటికావు. రామానుగ్రహమున జడచేతనము లన్నిటికి ఉచ్చస్వరముతో భగవన్నామములు వినిపించే భాగ్యమే భాగ్యము. సంసారములో సుఖప్రదము - సద్యోఫల దాయకము ఒక్క సత్పురుష సాంగత్యమే. గౌరవముగల స్థలమువలన దేహధ్యాన అధిక మగును. అట్టి స్థలమునకు దూరముగా నుండవలయును.

హరినామ మహిమ భక్తులకు వినిపించవలెను, విముఖులకు వలదు. ఎంతో పుణ్యముచేసి సంపాదించుకొన్న జన్మను అనేకమంది మట్టిపాలు చేయు చున్నారుగదా !. సకాలసంధ్యవార్చు వారందరికి నారాయణ స్మరణలు. స్వధ ర్మానుష్ఠానం విడచి నామస్మరణచేయుట వృధ. పరోపకారపరాయణులకు ప్రారబ్ధము అతివేగముతో ముగియుచుండును. అగాథమైనదని అనుకుంటున్న ఆత్మవస్తువు అత్యంతం సులభమనుమాట అరటిపండొలిచి యిచ్చినట్లు అందరకు అందుతుందని సాధక సత్పురుషుల అభిప్రాయం. ఎవరి నాలుకమీద ఎల్లప్పుడు శ్రీహరి నామము ఆడుచుండునో వాడే మానవుడు. హరిస్మరణ లేనివాడు మానవు డయ్యు మానవుడు కాడు. మూడు యుగములలోని ఫలము కలిలో కేవలము హరినామము యిచ్చును. సత్యము. అన్ని యింద్రియముల సుఖము యిచ్చునది భగవన్నామమే.

ధ్యాన, జప, తప, యోగ, సంకీర్తనాదులు చెయ్యటం, సులువేమోగాని

నిరహంకారంగా సాధుసేవ చేయటం సుదుర్లభం. జడ మనుకుంటున్న ఔషధం గూడ యెంత సుకృతం చేసుకుంటేనో మహాత్ముల నోటిలో పడుతుంది. భగవంతుణ్ణి గురించి చెప్పడం ఎంత అసాధ్యమో, అంతకన్న అసాధ్యం భక్తుణ్ణిగురించి చెప్పటం. సారగ్రాహులైనవారు బట్టను (కాషాయం) చూడకుండానే మాటతో మహాత్ముని స్థాయిని అందుకుంటారు. ఉంచదలిస్తే వుంచుతాడు. ఇష్టంలేకపోతే అవతల ఒక సెకండు ఆలస్యం గాకుండా పారేస్తాడు. నిందాస్తుతులులేక,పెట్టినదానితో తృప్తి, పిలవకుండా వెళ్ళకుండుట, ఓర్చుకొనుట యీ నాల్గులక్షణములు ధామనిష్ఠవలన కలుగును. హరినామము రోగ, శోకములను నశింపజేయును. అసారమైన సంసారమున సారమైనది భగవన్నామమే.

"ఆత్మ" భోగమువలన, కర్మవలన వృద్ధి క్షయములు గలిగి యుండదు. మనస్సులోకివచ్చి పోయినవాటితో బ్రహ్మజ్ఞానికి ఇసుమంతయు చింత యుండదు. మానవుడై జీవించుచు యెవడు వాసుదేవుడ్ని స్మరించడో వాడు గొప్ప నష్టమును పొందుచున్నాడు. అత్యంత దుస్తరమైన మానసిక పాపములతో దూషితమైన హృదయము గలవాడైనప్పటికీ విష్ణుభగవానుణ్ణి స్మరించినట్లయితే అతడు లోపల బయట పవిత్రుడవుతాడు. తులాపురుషదానము (పురుషుణ్ణి తూచిన స్వర్ణము), రాజసూయ - అశ్వమేధాది యజ్ఞముల యొక్క ఫలము విష్ణుస్మరణఫలముతో తుల్యము గాజాలదు. కలియుగంలో వేదహితమైన కర్మానుష్ఠానములు సరిగా జరగవు. కేవలం హరిస్మరణ సంపూర్ణ ఫలాన్ని ప్రసాదిస్తుంది. రాముని రాముడై చూచినవాడు పొందే పరమానందము, పరమనిత్యసుఖము., రాముని కన్యమై దర్శించుటలో అంత ఆనందము లభింప నేరదు.

రామునిలో తన్మయుడవై పంచదార బొమ్మ నీటిలో కలసినప్పుడు తద్రూపమును చెందులాగున దర్శించిన, దర్శించుటయే యదార్థ శ్రీరామదర్శన మునకు ఆదర్శనీయము. నామము చేయగా చేయగా ఆవక్కనామమే కృతార్థత నొసంగును. నామజపమువలన ఆత్మారాముని అభిన్న దర్శనముకూడా జరుగును. నిరంతర నామసంకీర్తనచే నామ - నాములకు భేదము లేదను సత్యము గోచరమగును. మనస్సు కోతిలాంటిది. దీనికి నామ మనేకళ్ళెం వేసి మాటిమాటికి మరల్చు చుండవలెను. శరీరము ధనాది కార్యములతో కూడుకున్నది. సత్పురుష సాంగత్యమనే ప్రయాగలో స్నానము చేయుటే దానికిశాంతి. కాకి కోకిల

కాకపోవచ్చును. గాని సత్పురుష సహవాసమున సత్సంగలాభమున కాకిభావం (కఠోరంగా పల్కువారు) కోకిలవలె అతి మధురంగా పల్క గలరు. భగవదాశ్రయములో నున్నవారికి రోగము కూడ అనుగ్రహరూపముగానే గోచరించును.

రోగికి నామముకంటె పరమౌషధం ఇంకొకటి లేదు. దేహమునకు రోగమని దీనికి సుఖమును గల్గజేయుటకు ప్రయత్నించిన, విషయములలో జొచ్చిన విషముకంటె ప్రాణహానిని గల్గజేయును. పరుల దోషముల జూచువాడు ధర్మాత్ముడు కాడు. తనయొక్క, ఇతరులయొక్క దోషములు జూచువానిలో ధర్మము ప్రవేశించదు. తన దోషముల చూచుకొన్నవానికి సర్వత్ర ఈశ్వరనిష్ఠ కుదురును. లోకమున మానవుడు చేయదగినది హరినామమె. సర్వకోరికల నిచ్చు కామధేనువు హరినామమే. నాలుగా శ్రమములవారు, నాలుగు జాతుల వారు చేయతగిన ప్రధానకర్మలలో హరినా మము మిన్న. అన్ని కోర్కెలు త్యజించి ప్రతిజీవిలో "భగవాను" డున్నాడను దృఢభావన చేసి వివేకముతో సత్పురుష పథము అవలంబించిన నాడు నామానుగ్రహము తొందరగా ఫలించును.

రామాయణపఠనం - నామస్మరణ ఒక్కటే. భగవన్నామ ప్రపన్నతయే సర్వోత్తమము. మనస్సునుబట్టి చూస్తే అన్నీ దొంగవేషములే. నిరంతరం ఏదోవిధంగా భగవన్నామం చేయటమేగాని దాసోఽహం చేతకాదు. సోఽహం అసలే చేతకాదు. భగవన్నామమం తృప్తిని, సుఖాన్ని, శాంతిని పరమానాందాన్ని ప్రసాదించును. ఎప్పటికైనాసరే దృఢంగా, గాఢాను రాగంతో నామంలో మునగాలి. భగవన్నామం సులభం. దానియందు శ్రద్ధ గలుగుట దుర్లభం. ప్రయత్నించిన ప్రేమ లభించి తీరుతుంది. రాగద్వేషములు గలిగి యుండుట ఆత్మహింస. పరిచ్ఛిన్ను డనుకొనుట ఆత్మహింస. ఏవిలేకున్నను ఆత్మవుండనిదికాదు. ఆత్మను చంపువా డెవడూలేదు. అనారోగ్యం అనాథనాథుని అనుగ్రహ విశేషం.

దుఃఖం దైవానుగ్రహం కాకపోతే కారణమేమున్నది? సర్వార్పణము జేసికొన్నవాడు భగవదిష్టమని సంతోషించుతాడు. అట్టివానికి కష్టాలు లేవు. పరీక్షాలేదు. నిత్యసంతోషంగా యుంటాడు. స్థిరత్వము నొందువరకు నామజపము చేయవలయును. భగవదనుగ్రహమున హరినామము నాశ్రయించి ప్రాపంచిక విషయములలో ముగ్ధులై యుండక యుండువారే భాగ్యవంతులు. సదా మనస్సును వశపరచుకొనుము. మనస్సు మహానీచమైనది. అది బందిపోటు దొంగ. దైవీసంపదను

అపహరించును. మృత్యువు సమీపమందున్నదని గుర్తించి నామజపము చేయుట యందు ప్రమాదమును పొందవలదు. నిరంతరము భగవదనుకూల కార్యమే చేయ వలెను. ఏకార్యమువలన భగవంతుడు ప్రసన్నుడగునో అదియే జేయవలెను. భగ వంతుడు నేను జేయుకర్మను జూచుచున్నాడని తెలిసికొనుము. దానిచే నీచకర్మ చేయజాల కుందువు.

దృశ్య పదార్థములయందు మనస్సు పోనీయక భగవంతునియందే మనస్సు నుంచుము. దుఃఖమును సుఖముకన్న యెక్కువగా తలంచుము. సంసార దుఃఖము నిన్నేమియు చేయజాలదు. కలిలో భగవన్నామం భాగవతం ప్రధాన సాధనాలు. భగవన్నామాని కున్న సిద్ధులు మరియే సాధనకూ లేవు. భగవన్నామం చైతన్యం. తన నిజస్వరూపాన్ని తెలుసుకున్న వాళ్ళందరు భగవంతుని కఠిన్నమని చెప్పుటకు పరమసాహసం భగవన్నామం వల్లనే అందుతుంది. నామం చేయగా చేయగా దృఢత్వము, అనురాగము, ఏకాగ్రత నామం ప్రసాదిస్తుంది. ఇతరులకు బోధించుటకంటె, తను ఆచరించిననాడు వారిని ఆదర్శముగా గొని తరింపగలరు. తనతప్పు తాను చూచుకొనుటయు - ఇతరులను పొగడకుండుటయు (అంటే భక్తుల ననికాదు అర్థము - ధనమే జీవనముగా గలవారని అర్థము) నామరసాస్వాదనము -నిరంతర నామజపము యీ నాలుగే మహావాక్యాలు.

భగవద్భజనలో సర్వలాభ మున్నది. దాని ఉపేక్షలో సర్వనాశనమున్నది. భగవత్కథాశ్రవణంవలన అపవర్గ మార్గం లోనడుచుటకు యోగ్యత కలుగును. ఇతరములైన యెన్నో మాటలవలన లాభమేమి? గోవిందుని చింతించునదే ధ్యానము. ఎక్కడ కేశవుని కీర్తన జరుగుచుండునో అదేకథ. శ్రీకృష్ణుని ప్రసన్నత చేయునదే కర్మ ఇతర మాటాలవలన లాభమేమి? భగవంతుని పాదపద్మములు కోరికలు లేని వారికి స్వధామము నొసగును. అంతా రామమయం. ఈజగ మంతా రామమయం. ఏనాలుక "శ్రీకృష్ణ - శ్రీకృష్ణ - శ్రీకృష్ణ" అని శ్రీకృష్ణనామమును కీర్తించదో, రోగరూపిణి యైన ఆనాలుక నూరుముక్కలై పడుగాక! సత్యం జ్ఞాన మనంతం బ్రహ్మ సత్యం జ్ఞాన మనంతం నిత్యం. ఏమీ అనడంచేతకాకపోతే "శ్రీరామ" అనే మూడక్షరాలు చెవులారా విన్నాచాలు.

స్వధర్మాచరణం చేయలేని కలిలో నుంచుని కూర్చుని, నడుచు నైనా భగవన్నామం చేసికొనుట పరమధర్మం. ఎవడు జగత్తును చూస్తాడో వానికి దుఃఖం

తప్పదు. ఎక్కడ జూచినా నీయిష్టదేవునిగా జూడుము. శివుని కర్మలు అన్నియు చేసినను, చేయకున్నను "శివ" అనిన చాలును. శివనామము లన్నిటిలో "శి" అనునది చింతామణి. "శివ" అని హేళనగా అన్నా మహాపాపం కూడ భస్మం అవుతుంది. నాలుగువేదాలు చదివినాసరే, భగవన్నామం నిశ్చయం. ఏమీచదవకపోయినా భగవన్నామం చేస్తే అపవర్గం నిశ్చయం. జీవితమును భగవత్పరం చేసుకున్నవాడు జగత్తుకు గురువౌతాడు. ధనపరం చేసుకున్నవాడికి జగత్తు గురువై కూర్చుంటుంది.

పరిశ్రమలేకుండా , చదువులేకుండా, భాష్యశ్రవణం లేకుండా "రామ రామ" అంటే ముక్తివస్తుందా? సందేహం లేదు. రామనామం వేదసారం. భగవదిచ్ఛకు భిన్నంగా ఏమీ జరుగదు. భగవద్భజనకన్న శాంతికి వేరుమార్గంలేదు. భగవంతుని హస్తంలేకుండ ఏమీ జరుగదు. ఈ ఉపాధులన్నీ కేవలం యంత్రములు. భగవంతుని భజిస్తూ సుఖదుఃఖాలు ఆయన అనుగ్రహమే యని భావించుటయే ఆయనను వదలకుండా యుండటము. మానవుడు ఏది చేసినను మంచి బుద్ధితో చేసిన అంతయు మంగళమే. భగవంతుని నమ్మినవాడు ఎన్నడు చెడడు. భగవంతుని కటాక్షము ఎవనియందు ఎపుడు ఏవిధముగా ప్రసరించునో తెలియదు. భగవంతుని ఆజ్ఞలేకుండ గడ్డిపరకకూడ చలించదు. అంతా మనంచేస్తున్నా మనుకొనుట అజ్ఞానము. నామసంకీర్తన తన్మయత్వముతో నాయీ శరీరము భగవంతుని కంకితమగుగాక.

నామమునగల రుచి యేపదార్థమున లేదు. భగవంతుడు సర్వత్ర ఉన్నాడని మరచుటచే హెచ్చుతగ్గులు, ప్రియాప్రియములు, నీచఉచ్చములు మనసున గలుగు చుండును. శ్రీరామ విముఖుని బ్రతుకు వర్షాకాలమున పేడవలె వ్యర్థమగును. శ్రీరామవిముఖునకు చిత్తదోషమున పాపమయమగు వృత్తి జనించును. తనపాప ముల వలెనే ఇతరులపాపములను తలంపని వానికి పాపములు సంభవించవు. త్యాగవైరాగ్యములు లేనిచో భగవత్ప్రాప్తి కలుగదు. సత్సంగ మెంతయుండునో దానికి రెట్టింపు మననము ఉండవలయును. మననము లేకుండ సత్సంగము ప్రయెజనము లేదు. నామజపమువలన విక్షేపనివృత్తి, పదగానమువలన లీలావిర్భావము గలుగును. నిరంతరము నాగుణములను, లీలలను, నామ సంకీర్తనము చేయవలెను. (భగవంతుడు).

జాత్యభిమాని యేజాతిని అభిమానింప జాలడు. శరీరాభిమాని యే జీవుని

యందు దయజూప జాలడు. రామనామము మహావాక్యము - మహామంత్రము. భగవన్నామస్మరణకు దేశ, కాల, జాతి, వర్ణ నియమము లేవు. రామనామాశ్రయులకు కలిభయము, కాలభయము, మృత్యుభయము ఉండదు. ఈకలిలో నామావతారంగా వచ్చిన శ్రీకృష్ణునికి అంతర్ధానవటం చేతకాకుండా పోతోంది. చంచలమైన చిత్తము నలువైపులా పరువెత్తుచుండును. నామోచ్చరణ మాత్రమున భవసాగరము ఎండిపోవును. గురువును నమ్మిన సాధకునకు ఏవిక్షేపములు ఉండవు. ఎపుడు మానవుడు సమస్తకర్మలను పరిత్యజించి నన్ను సర్వాత్మనా శరణు పొందునో అట్టి సమయమున అతడు నాకు విశేషమాన నీయుడు డగును.

కీర్తనద్వారా క్రమక్రమముగా చిత్తమాలిన్యము క్షాళన మగుచుండును. నాభక్తిని బొందగోరు వారు అమృతమయములైన నాకథలయందు శ్రద్ధగలిగి యుండవలయును. ఈశ్వర విముఖమునకు భగవన్మాయచే తన స్వరూప విస్మృతి కలుగును. తనగురువునే ఆరాధ్య దేవునిగా భావించవలెను. దేహాభిమానముగల జీవుడు సంసారచక్రమున అనాది కాలమునుండి భ్రమించుచున్నాడు. భగవంతుని గుణ, లీలలను మననము చేయుట లాభదాయకము. నామసంకీర్తన కన్న మించిన పరమలాభ మింకొకటిలేదు. రామనామము పరమశాంతిని కలిగించును. స్వార్థముతో గాక పరమార్థముతో చేసిన సేవ సమాధివరకు గొనిపోవును. పరేచ్ఛాప్రారబ్ధము కొంత నీసాన్నిధ్యమునకు దూరము చేయును. రామనామమనే అద్భుతమైన రెండునాలుకలు గల కత్తెర ద్వైతభావమును కత్తిరించివైచును. రామనామము జగత్తున కధిష్ఠానము.

రామనామము బ్రహ్మలోకంవరకు ఉన్న సంపదను తలపుకు రాకుండ చేస్తుంది. భగవన్నామం చేసేవారికి స్వర్గం అసహ్యం అవుతుంది. భగవన్నామం పట్టిస్తే గోపబాలురకు వలె జయం నిశ్చయం. దేవతలు పానంచేయు అమృతంకంటే రామనామామృతం గొప్పది. కల్మషచిత్తులు, పాపద్రవ్యముచే జీవించువారు, విధివిహిత కర్మలు చేయనివారు అగు కలిప్రజలకు గోవింద కీర్తనమే గతి. నాభక్తుడు భక్తుడుకాడు. నాభక్తులకు - భక్తుడు నాకు సర్వోత్తమ భక్తుడు. "భగవాన్" దురాగ్రహమే మాయావిజృంభణము. మానవుడు అధ్యాసవల్ల (మిథ్యాజ్ఞానము) అనర్థముల పాలవుతాడు. మహాభక్తుల పాదధూళి శిరమున ధరించుట ఎంతభాగ్యమో. ఎవరితో యేమిచెప్పినా ఈచేతకానివానికి తోచినది యొక్కటియే ఉపాయము. "ఎల్లపుడు భగవన్నామం చేయుట."

బంసీవటమువంటి వటము (మఱ్ఱిచెట్టు) లేదట. సద్విచారాము, సత్సంగము కలవారే ధన్యులు. నిరహంకారముతో నీభక్తుల పాదధూళి అభిషేకము చేసికొను అవసరము ప్రసాదింపుము. భక్తులసేవ భగవత్సేవ కభిన్నము. శ్రీహరి నామము మహాపాతకము లను కొలనులను ఎండించుటకు గ్రీష్మఋతువు. ధనమందాంధులకు భగవన్నామము వెగటు. ఏసత్కారము చేయకున్న శరణన్న వారిని రక్షించును భగవంతుడు. భక్తప్రియుడు భగవానుడు. భగవంతునకు అనంతనామములు జీవుల జీవ భ్రాంతిని తొలగించుటకే. జీవుడా! దేహచింత, అర్థచింత సర్వమును వదలుము. స్థిరత్వము నొందువరకు నామజపము చేయుము. కథాశ్రవణము కీర్తన ద్వారా క్రమముగా చిత్తమాలిన్యము క్షాళిత మగుచుండును.

నామ సంకీర్తనవలన సూక్ష్మ వస్తువు యొక్క యదార్థ తత్త్వదర్శనము లగుచుండును. నాభక్తిని పొదంగోరువారు అమృత మయమైన నాకథలయందలి శ్రద్ధ యుంచవలెను. ఈశ్వర విముఖునకు జగన్మాయచే తన స్వరూప విస్మృతి కలుగుచుండును. అనన్యభక్తి ద్వారా ఈశ్వర భజనచేయవలెను. ప్రారబ్ధ బలము ఎటులాగునో ఎవరికిని తెలియదు. నామజపమున ఎట్టివారికి సిద్ధి కరతలా మలకము. అఖండమైన ఆత్మతత్త్వమును మంత్రాను గ్రహమున పొందగలరు. ఈ సర్వనామ, రూపముల విష్ణువు, విశ్వరూపుడే. గురునిష్ఠపరులకు అలభ్యము, అసాధ్యము ఏమిలేదు. భగవదిచ్ఛకు అడ్డులేదు. ఈశ్వరేచ్ఛకు మానవయత్నం అక్కర లేదు.

భగవదాశ్రయులకు వచ్చేవి పరీక్షలే అన్యంగాదు. సర్వార్పణం చేసికొన్నవాడు భగవదిష్టమని సంతోషించుతాడు. భగవదాశ్రయంలో జారకుండా ఉంటే అన్ని యోగత్యలు కలుగుతాయి. మట్టియొక్క శక్తి కుండే - పరమేశ్వరుని శక్తి ప్రకృతి. అలలు ఆగినపిదప సముద్రస్నానం చేయవలయునని ఆగినవాడు మూర్ఖుడు. శరీరధర్మముయొక్క నాశనా నంతరము నేను ముక్తిని బడయుదు ననుట మూర్ఖత. ఆత్మసందర్శనమున వాసనలు మరలును తనకు పుట్టిన దూడ యొక్క మలమును ఆవు ఏలాగున శుభ్రము చేయునో, తనను పూర్తిగ నమ్మిన భక్తునియొక్క మలమునుగూడ భగవంతుడు శుభ్రమేచేయును. భక్తునికి వచ్చిన కించత్ అహంకారమును భగవంతుడు వెంటనే నశింపచేస్తాడు. జీవభావం వచ్చినపుడల్లా దేహబుద్ధి విజృంభించును.

జ్ఞానసిద్ధికి భక్తియే సులభోపాయము, పరమాశ్రయము. శరీరానికి

ఊహించని బాధలు రావటం మంగళకరము. బుద్ధిని సద్గ్రాశయంలో వుంచకపోతే, శరీరాన్ని చిరంజీవిలా వుంచాలనుకుంటుంది. బుద్ధి దేహంతో పొత్తుకలిగి యుంటా నంటుంది. మంచిది కాదు. భగవంతుని కరుణ అపారము. గృహాదులయందు అహంకారముతో నేను నాది యనుకొనుట దుర్జనత్వము. దేహాదులయందు విష్ణు బుద్ధి గలిగి యుండవలయును. పరమపదమును పొందదలచువారు ఇతరుల యొక్క కటు వచనములను సహించాలి. అపకారికి ఉపకారము చేయాలి. అపకారికి - అపకారము చేయట అనర్థము. దుఃఖం దైవానుగ్రహము.

భగవంతుని దగ్గరకు చేరువారికి విఘ్నములు ఎక్కువ. సాధకుని సాధనకు విఘ్నములు భగవంతుని పరీక్ష. "మమమాయా దురత్యయా" ఇది పరమ సత్యము. బుద్ధిలోపలగల సూక్ష్మజ్ఞానంకూడ రామనామంతో పటాపంచలవుతుంది. శ్రీరామ చింతన దంభ రహితంగా జరగాలి. క్షణభంగురమైన శరీరమునందుఁ అహంకారమను మమకారములతో యేప్రాణితోను వైరము కలిగి యుండరాదు. వాసుదేవుని కన్న పరమమంగళం మరి యొకటిలేదు. వాసుదేవునికంటే వేరుదైవము లేదు. వ్యాధిరూప విలాసంగూడ, ఆత్మాభిన్న జగత్తువలె అధిష్ఠానాభిన్నమే.

అన్నిటికి అధిష్ఠానమైన "నేను" సర్వమం గళము. అనుభవం కాకపోయినా అసలు బ్రహ్మవిలాసమే. శరీరము, వ్యాధి, బాధలు, ఏడుపులు, జన్మలు, మరణాలు వాసుదేవుడే. మనకు శాస్త్రమాతయే ఆశ్రయము. తనకు అత్యంత ప్రియమైన వస్తువు ఎప్పుడూ జ్ఞప్తిలోనే ఉండటం సహజం. అంతా బ్రహ్మమె అని సాధనచేస్తున్నా లోపల నున్న అసలు వాసన సమయానికి బయట పడుతుంది. అంతరంగిక వాసనలవలన మనోనిగ్రహము, జిహ్వను అరికట్టడము చేతకాదు. నమ్మినవారిని ప్రేమించి తరింపజేయువారు భగవంతుడు కాక మరెవ్వరు ? వాసనలు పునర్జన్మకు హేతు వగును. జిహ్వ ప్రాణం తీస్తుంది మనస్సు గాలిలో పడేస్తుంది. తనకు తాను ప్రియమైనట్లు అన్యవస్తువులు కావు.

అన్యులవలన సుఖదుఃఖములు గలుగుచున్న వనుట పొరపాటు. ఒకరికి దుఃఖమైనది యింకొకరికి సుఖం కాక తప్పదు. రామనామం కలిదావానలమునకు చల్లని జలం వంటిది. కలిమహా విటపమునకు రామనామం కుఠారం వంటిది. ఉపాసకులకు యిష్టమైన వస్తువు భగవంతుడు. పరచర్చను విషమువలె విడువవల యును. పరులదోషములు వినుటచే పాపము లభించును. అన్యచింతనవలన మనస్సు మలినమగును. బాహ్యదృష్టి త్యాగము గోడమీద వ్రాసికొనవలయును. మనసుకు అన్యచింత కలిగినపుడు ఉచ్చస్వరముతో నామం చేయుము. భగవంతుని

పొందుటకు అనేక ఉపాయములున్నవి.

కలిలో భగవంతుని పొందుటకు ఒక్క భగవన్నామమె ఆశ్రయము. ఏరిఏరి పాపులను రక్షించునది యెవరు? రాముడొక్కడే. రాళ్ళను, పక్షులను, చెట్లను రక్షించినది యెవరు! రాముడేగదా! దేవతలు, దానవులు, మునులు - అందరు మాయావివశులే. ''స్వ'' అనునది అంతులేనిది. ''స్వ'' ఆనందమయము, అద్వయము. భగవంతుడే బుద్ధియోగాన్ని కూడా యిస్తాడు. చచ్చెద ననుకొనుట ఆత్మహింస. భగవన్నామం ముందు అమృతముకూడ తీసికట్టు. తల్లి, తండ్రులు, గురు, దైవములు భగవద్విభూతులు. భగవద్విభూతులను భగవదాదేశానుసారంగా మొదట సేవించాలి. సగుణో పాసన సవ్యంగా జరిగితే తత్వము హస్తగత మౌతుంది.

ఈకాలంలో సగుణోపాసనగూడ సరసంగా చేయలేరు. నిర్ధనుని పాపం నామం పోగొట్టుతుంది. "భాగవతం" అనుమాట దేవతలకుకూడ దుర్లభం. కలిలో అపవర్గసాధనం "రామ" నామమే మరొకటిలేదు. భూలోకలంలో భాగవతం బ్రహ్మ విగ్రహం. భాగవతం సాక్షాత్ శ్రీకృష్ణుడే. భాగవతం విన్నవారికి, వినిపించిన వారికి శ్రీకృష్ణానుగ్రహం సమమె. ఏకాంతవాసంమనోనిర్మలతకుసత్యోపాయం. ప్రపంచము యథార్థముగాదు మిథ్య. నామసంకీర్తన కాలమున నామం దృశ్యమను తలంపు లేకుండ జరుగుట ఉత్తమము. భగవన్నామం ఆశ్రమాహంకారములను నశింప జేయును. శరీర మెచటెచట వచ్చినను - నామాసక్తి కలుగుట భాగ్యము.

దేహము జీర్ణించునదిగాన "శరీర" మన్నారు. అహంకార అంకురము దేహబుద్ధిని గలిగించి సర్వనాశనము జేయును. జీవితమునగల్గు అనర్థములు నామస్మరణచే నశించును. మనము ఏపూటకాపూట మనసును గమనించకపోతే పాచిపడుతుంది. భగవన్నామం కైవల్య మొసగు కామధేనువు. హరినామము పురుషార్థముల నిచ్చును. నామోచ్చారణ మాత్రమున భవసాగర మెండిపోవును. రామనామము సదా శివుడు జపించుచుండును. బుద్ధి యోగము లభింపనివారు దుఃఖం అనుభవింతురు. మంగళము - అమంగళము భగవంతుడే. భగవన్నామం అరిషడ్వర్గాలను తొలగిస్తుంది.

భగవంతుని నామ,రూప, ధామములు - మరియు భక్తిగూడ అమృతమే. భజనకు బలంరావాలంటే వ్యాపకంగా ఉన్న స్వరూపంగూడ మనస్సు అందుకోవాలి. నామార్థచింతనం, రూపార్థచింతనం వీని వలన భగవంతుడు తన వాస్తవరూపాన్ని అందివ్వకుండునా? సగుణోపాసనమే నిర్గుణోపాసనకు చరమోపాయము. సగుణ

పరిచయం పూర్తిగాకుండ యీ దినములలో వేదాంతులకు రాగద్వేషములు పోవడంలేదు. వేదాంతులకు ద్వైతభ్రమ అధికంగా గోచరించుచుండును. సగుణ పరిచయం పూర్తిగా గానిచో వేదాంతం విషంగా పరిణమిస్తుంది. రామనామము జపించువారిని చూచినా, స్పృశించినా, అట్టివారి పాపములు తొలగిపోవును.

**"సకల మిద మహం చ వాసుదేవః"**

ఎవరేమన్నాసరే! ఏమనుభవించినాసరే! నీవు యితరుల చింత ఏల చేసెదవు? అంతా వాసుదేవుడు. అట్టి బుద్ధి కలిగితే, సంసారమునందు రాగద్వేషములు వదలి పోవును. పాపకర్మలు, వాసనలు వదలిపోవును. పాప కర్మల వాసనలు వదలి పోయినవి. కర్తృత్వ భోక్తృత్వములు నివృత్తయినవి ఇదే భక్తి. ఇది అంత్యంలో పదార్థమును శోధించి తత్త్వం పదార్థముల శోధించి రెంటియొక్క వుపాధిని నిరసించి ఏకత్వం జ్ఞానమును కలిగించును.

ఈశ్వరునియందు విశ్వాసముంచితే ఆచారదోషం నివర్తక మౌతుంది. వాసనానివృత్తికొరకు ఈశ్వరభక్తి అవశ్యము. ఈశ్వరుని విశ్వాసముంటే సంసారికమైన యోగక్షేమముల చింత తొలగిపోతుంది. సంసారవివేకమే పరమార్థము. అట్టి వివేకం కావలసివస్తే ఈశ్వరుణ్ణి విచారుంచుము.

**ఇయ మేవ పరాహాని, రుపవర్గో ఉయ మేవ హి!**
**అభాగ్యం పరమం చైతత్, వాసుదేవం నయ త్స్మరేత్**

మానవుడై జీవించుచు యెవడు వాసుదేవుణ్ణి స్మరించడో, వాడు గొప్పనష్టమును పొందుచున్నాడు. గొప్ప ఉపద్రవము పాలగుచున్నాడు. (సంపాదించుకుంటున్నాడు) వాడు పరమ అభాగ్యుడు

**యద్యప్యువహారతః పాపై ర్మనపాత్యన్తేదున్తరైః ।**
**తథాపి సంస్మరన్ విష్ణుం, న బాహ్యాభ్యన్తరః శుచిః॥** - గరుడపురాణము

అత్యన్తదుస్తరమైన మానసిక పాపములతో దూషితమైన హృదయముగలవా డైనప్పటికీ విష్ణు భగవానుడ్ని స్మరించినట్లయితే అతడు లోపల బయట పవిత్రుడౌతాడు. ఏమన హరిస్మరణవలన అన్ని పాపములు నశించి పోతాయి.

తులా పురుషదానము - అనగా పురుషుడ్ని తూచిన స్వర్ణము - రాజసూయ అశ్వమేధాది యజ్ఞములయొక్క ఫలము విష్ణు స్మరణ ఫలముతో తుల్యము

గాజాలదు.

**న్యూనాతిరిక్తతా సిద్ధా కలౌ వేదోక్త కర్మణామ్**
**హరిస్మరణ మేవాత్ర సంపూర్ణ ఫలదాయకమ్ ॥**

కలియుగంలో వేదవిహితమైన కర్మానుష్ఠానములు సరిగా జరగవు - తక్కువ యెక్కువలుగా అవుతుంటాయి. అందుచేత ఫలప్రాప్తిలో సందేహాలుంటున్నాయి. కేవలం హరిస్మరణ సంపూర్ణ ఫలాన్ని ప్రాసాదిస్తుంది. ఇందులో సందేహ మెంతమాత్రము లేదు.

**వాగ్గద్గదా ద్రవతే యస్య చిత్తం రుదత్యభీక్ష్ణం హసతి క్వచిచ్చ ।**
**విలజ్జ ఉద్గాయతి నృత్యతేచ మద్భక్తియుక్తో భువనం పునాతి ॥**

కీర్తనచేయుచూ చేయుచూ యే భక్తునివాక్కు గద్గదమవునో, నామస్మరణ వలన యెవని చిత్తము ద్రవించునో ఎవడు భావావేశంలో క్షణక్షణం ఏడుస్తో వుంటాడో, అప్పుడప్పుడు నవ్వుతూ కూడా యుంటాడో లజ్జా రహితుడై వుచ్ఛ స్వరంతో నామకీర్తన చేస్తాడో మరియు నృత్యంకూడా చేస్తాడో అటువంటి నా భక్తుడు సమస్తవిశ్వాన్ని పవిత్రం చేస్తాడు.

అత్యుత్తమ ఫలప్రాప్తి

అసంగుడై నిస్సంకోచంగా చక్రపాణి భగవాన్ వాసుదేవుని కల్యాణ కరములగు జన్మకర్మలను, అయా లీలలను పురస్కరించుకొని వుంచిన గిరిధారి వంశీవిహారీ మొదలగు ప్రశిద్ధనామాలను వినిపించుచూ తిరుగుచుండ వలెను"శృణ్వన్ భద్రాణి" - "భాగ 11.2.89.

**దేహబుద్ధ్యాతు దాసోఽహం, జీవబుద్ధ్యా త్వదంశకః ।**
**ఆత్మబుద్ధ్యాత్వమేవాహ, మితి మే నిశ్చలా మతిః ॥**

నీవు భగవంతుని మార్గంమీద నడవదలిస్తే ఎవరైనా ధనికుడ్ని ధనంవలన నీకన్న గొప్పవాడని యెంచవలదు. ధనంవలన అతనిని గొప్పవాడనుకుంటె నీయొక్క బుద్ధిగూడ ధనం సంపాదించాలనుకుంటుంది. ఎవరైనా భోగిని భోగకారణంచేత లేక ధర్మాత్ముణ్ణి ధ్మకారణం చేత గొప్పవారని ఎంచవలదు ఎవనిలో భగవంతుని భక్తి యున్నదో అతనినే శ్రేష్ఠుడనుకో! అప్పుడే నీకు భక్తి పెరుగుతుంది.

మీ యొక్క జీవితలక్ష్యం పారమార్థికమైతే మీరు భగవంతునితో యుండాలి. బ్రతుకు భగవంతుని కోసం మరణం కూడా భగవంతునికొరకే గావాలి. ప్రాణాన్ని భగవంతునిలో కలిపెయ్యి. అతడు వాటిని ఈదినం తీసుకుంటె ఏమీ నిష్ఠూరం పలకవద్దు. మనుష్యునకు ప్రతిక్షణం ఈశ్వరునియొక్క సంకేతాన్ని నిరీక్షిస్తుయుండాలి.

సోమరితనమువదలి శ్రీరామనామము జపించుము. శ్రీరామునకు విముఖులైనవారు ఈ కలి కాలమున వ్యర్థులై పోవుచున్నారు. మానవజన్మ ఎంత గొప్పదో తెలియుటలేదు. అంతయు కలిప్రభావము. కాని రామనామముముందు కలి ఆట సాగదు. నమ్మండి.

రామనామముకన్న అన్యులెవరును నిజమైన మిత్రులు కారు. దేహపతనానంతరమున శ్రీరామనామము శ్రీరామధామమును సహితము పొందించును. మిత్రులు, బంధువులు, కుటుంబీకులు వీధివరకు ఊరిచివరివరకు, స్మశానమువరకే వత్తురు. శ్రీరామనామమో శ్రీరామ ధామము చేర్పించువరకు రక్షగా వెంటనుండును. ఇది సత్యము.

ఏ విధముగానైనను, ఎప్పుడైనను, ఒక్కమారైనను భగవన్నామము ఉచ్చరించనివాని జన్మ వ్యర్థము వాని జీవితం అడవికాచిన వెన్నలయే. వేలకొదలి ధనమును చందాలుగా వసూలు చేస్తారు. గొప్పగా ఉత్సవాలు చేస్తామని కరపత్రాలు ప్రకటిస్తారు. కాని ఆ కార్యక్రమములో రోజుకు 1 గంట అయిన భగవన్నామానికి కూడ అవకాశ మిచ్చిన ఉత్సవాలు శోభిస్తాయి. చూచుటకు వచ్చినవారు తరిస్తారు. నాసంకీర్తన ఇటు వంటి కార్యక్రమములో ఎందుకు పెడతారో తెలుసునా! జనాకర్షణ కొరకు, పోనిండు. ఆరూపంగా నైనను నామం పలుకుతారు. వినినను మంచిదే. వాసుదేవ! శ్రీరామ జయరామ జయజయరామ!

కలిలో ధర్మబుద్ధి క్షీణించింది. దైవభక్తి అసలే లేదు. దేవాలయములు జీర్ణ మగుచున్నవి. వానిని చూచువారే లేరు. మానవజన్మ ఎంత గొప్పదో ఎవరును గ్రహించుటలేదు. కోట్ల కొలది జన్మలు ఎత్తినగాని యీనరజన్మ రాదు. ఇట్టి అమూల్యమైన జన్మ వ్యర్థము చేయక, చచ్చి పురుగుగానో, ఏ పశుపక్షిగానో గాక, తుదకు మరల మానవుడుగా పుట్టుటకైనా యత్నించుట మన కర్తవ్యము. సంకీర్తనకు ఎక్కువ జనం రాలేదేం? నిజమే! ఇది ఏమయినా హరికథ నాయనా! హరికథకు ప్రక్కవాద్యములు సంగీతం హంగులు ఉంటాయి. సంకీర్తనకు అవేవియు నుండవు.

రామరామ అని అరచుటయేగా! నాయనలారా! నామస్మరణ చాలగొప్పది మరువరాదు, వాసుదేవ!

భోజనసమయమున మనసులో భగవన్నామము చేయుట చాల పొరపాటు. మానసిక స్మరణము కీర్తన కాదు. అది కేవలము జపమే. నోరార ఉచ్చరించునదే కీర్తనము. మానసికముగా స్మరించుచు చేయుటవలన నీవొక్కడివే ఫల మనుభవించ వచ్చును. నామము యితరులకు వినుపించుటయు పుణ్యమె. భోజన సమయమున మానసిక స్మరణమువలన నీభార్యకు, బిడ్డలకు అన్యాయము చేసిన వాడవగుదువు. నీభార్య, బిడ్డలు నీకెంత ప్రేమపాత్రులో ఆలోచించుకొనుము. బిగ్గరగా నుచ్చరించుచు భుజించుచుండిన, నీ భార్యబిడ్డలు అనకున్నను వారుకూడ విందురుగదా! వారికిని ఫలము గలుగును. గాన బిగ్గరగా గోవింద! కేశవ! శివ! శంకరా! యనుచు భుజించుట మంచిది. "హరహరశంభో".

"ఆహారము"

ఆహారము మానవజీవితమున కాధారముగదా! శరీరధారణకు ఆహారము ప్రధానముగదా! ఆహారమున మనకు తెలియని దోషము లుండును. నీ సంపాదన న్యాయము, పవిత్రమము కావచ్చును. నీ దినచర్యకూడ మంచిదే. నాయనా! నీవు గ్రహించుటకు ముందే అపదార్థమున ఏదో దోషము ఆపాదించి యుండును. అట్టి దోషభూయిష్టమైన ఆహారమును స్వీకరించుట వలన ఆ దోషము నీకు సంక్రమించును. మరియు అపవిత్రమైన ఆహారమును గ్రహించుట వలన మానసము అపవిత్ర మగును. అపవిత్రమగు మనసుతో ఏమిచేసినను అంతయు అపవిత్రమే కదా!

ఆహారము (ద్రవ్యములు) సంపాదించుటలో చాలా జాగ్రత్తగ పవిత్ర భావముతో సంపాదించితి వనుకొనుము. ఏవిధమయిన అపవిత్రతయు లేనటుల నీకు నమ్మకమె, మంచిది. కాని ఆహారము తయారు చేయుటలో మనకు తెలియకుండ అపవిత్ర మగును. తయారు చేయువారు కూడ యిది గమనించరు. ఎట్లందురా! వినండి. ఆహారము తయారు చేయునపుడు (వండునపుడు) స్త్రీలు నోటితో ఊదుట, వాసనచూచుట మొదలయిన పనులు సహజముగా జరుగుచుండును. ఈ పనులు లేకుండ తయారు చేయుట సాధ్యమా! అనవచ్చును. సాధ్యముకాదు. ఇట్టి తరి ఆహారము పవిత్ర మెట్లగు నందురా! వినండి. భగవన్నామము అపవిత్రముల నన్నిటిని పవిత్రము చేయును. ఒక్క ఆహార

పదార్థమెకాదు, అన్నియు పవిత్రము చేయును భగవన్నామము మనకు తెలియకుండ యీ పని జరుగును. గాన భగవన్నామము చేయుచు ఆహారమును గ్రహించవలయును.

పవిత్రమయిన ఆహారము గ్రహించుటవలన ముఖ్యముగా మనసు బాగుపడును. పవిత్రభావము లుదయించును. భగవద్భక్తి గలుగును. నామమునం దభిరుచియు గలుగును. దోషభావములు క్రమముగా నశించును ప్రాణులయెడ దయకలుగును. భోజన సమయమున విధిగా నామనిష్ఠ కలిగి యుండవలయును నీపంక్తిని కూర్చున్న వారిని కూడా భగవన్నామము చేయుచు భుజింపుమని కోరుము. అతిథి, అభ్యాగతులను గూడ యిదేవిధమున ప్రార్థించుము. తుదకు "భగవన్నామము"చేయకున్న మా ఇంట భోజనము పెట్టమనుము. బాధలేదు - పాపము లేదు. ఇందువలన ఎదుటివారికి భగవదనుగ్రహము గలిగించిన వాడ వగుదువు. ఆనాడు భగవన్నామము జేయువాడే నీయింటికి వస్తాడు. ఇందులకు భగవంతుడు కూడ మెచ్చుకుంటాడు.

మానవుడు తరించుటకు నులభోపాయములు చాల కలవు. అమూల్యమైన మానవజన్మను వ్యర్థముగా పశుపక్ష్యాదులుగా మరలపుట్టునటుల చేయరాదు. నీవు యేది గ్రహించినను, అనుభవించినను, భగవన్నామముతోనే చేయుము. నామముయొక్క శక్తి నామాధిష్ఠుడైన భగవంతుడుకూడ చెప్పలేడు. ఆయనయె స్వయంగా చెప్పినాడు. "నాపేరుకు గల శక్తి నాకులేదు." నూతన వస్తువులు, వస్త్రములు, ఆభరణములు, తినుపదార్థములు మొదలగున వన్నియు తొలుత భగవంతుని కర్పించి పిమ్మట నీ వనుభవించుము. మనజీవితావసరము లన్నియు భగవంతుడు డిచ్చినవే కాదా! ఆయనకు సమర్పించినది ప్రసాదము (అనుగ్రహము) అగును. భగవదనుగ్రహముగల వానికి కొరత యేముండును?

ఈకలికాలమున మానవులు తేలికగా తాముపుణ్యము సంపాదించుచు, ఇతరులచేతకూడ సంపాదింప చేయవచ్చును. ఇది రెండువిధముల తరణము - లాభదాయకము. సేవకులచేత, పనివారలచేత భగవన్నామము చేయుచు, చేయించుచు పనులు చేయించుము. "స్వామి! నేను మీ యాజ్ఞానుసారము చేయుదును. జీతగాండ్రు, పనివారు ఎందుకు చేయుదురు? నామము చేయుచుపనిచేయుడనివారుపని కూడమానివేయుదురు"- అంటారా! వినండి, దానికి ఉపాయము వినండి. మీసేవ కులకు, కూలివాండ్రకు, పశులకాపరులకు,

దాసిక్కి - వీరందరకు నీవిచ్చు వేతనము కన్న ఒకరూపాయి యెక్కువ యిస్తాను. భగవన్నామము చేయుచు పనులు చేయు డనుము. ఎంతబాగా భగవన్నామము జరుగునో ! నీ చెవులకు ఎంత ఆనందము. భగవన్నామము చేయుచు పశువులకు మేతవేయవలయును. నామము చేయుచు వంట పాత్రలు తోమవలయును. ఈవిధముగా చెప్పితివానీయిష్ట మొచ్చినటుల భగవన్నామము జరగును. అపుడు నీ గృహము కలకలలాడుచుండును. నీజీవితము, నీగృహము మంగళములకు స్థాన మగును. ఈవిధానమున అనేక విధములయిన సూక్ష్మధర్మములు జరగును. భగవంతుడు నీయింట నుండి నిన్ను, నీకుటుంబమును సదారక్షించుచుండును" తననామము స్మరించిన స్థానమున తానుండుదు ననిగదా భగవంతుని ప్రతిజ్ఞ. మీరందరు ఏమనెదరు? (చాలాబాగున్నది. ఈయాచారము, అలవాటు మనప్రాంతమున తక్కువ. ఉత్తరభారతమున బాగాకలదు. నేను చూచితి.

హరేరామ్. వాసుదేవ శ్రీరామజయరామ జయరామ రామ.

ఒక పండితుడు స్వామితో నిట్లనెను. స్వామీ! నేను కొన్ని సంవత్సర ములుగా నియమముగా మౌనముతో భుజించుచున్నాను. ఇది పుణ్యముకదా!- "ఎంత వెఱ్ఱివాడవు? శాస్త్రము చదివితివి. వేదాధ్యయనము చేసితివి. చేయవలసినది చేయుటలేదు - చేయరానిది చేయుచుంటివి. రెండు విధములా అధర్మమె. ఎంత పొరపాటు. నాయనా! మౌనముగా భుజించుట మహా పాపము. సందేహము లేదు. మౌనముగా భుజింపుమని ఏశాస్త్రము నందైనా గలదా! భగవన్నామముతో భుజించవలయునని శాస్త్రములు నిర్ణయించినవి గదా! "కబళే కబేళే గోవిందకీర్తనమ్" ముద్దముద్దకు గోవిందకీర్తనము చేయమనిగదా! ఇట్టితఱి మౌనముగా భుజించుట దోషముమనికాదా. ఇతరులకు వినబడునట్టు భగవన్నామ ముచ్చరించుచు భుజించవలయునుగాని, మానసికముగా పనికిరాదు. శాస్త్రము ఏమని చెప్పుచున్నదో వినుము."

భోజన సమయమున భగవన్నామోచ్చారణ చేయకుండ తీసికొను మెత్తని ఆహారపదార్థము కుక్క మూంసము - కఠిన పదార్థము కుక్క ఎముకలు - ద్రవ పదార్థము కుక్క మూత్రమువంటివి. చూచితివా! ఎంతశోచనీయము? కనుక భగవన్నామము నుచ్చరించుచు భోజనము చేయుట మానవుని కర్తవ్యము.

సంస్కారము మంచిది కావాలి. ఇందుకు గురూపదేశము మంచిదైన సంస్కారముకూడ మంచిదగును. ఈ కాలమున అందరు ఉపదేశకులే.

అందరుగురువులే. మంచివారి సన్నిదిలో సంస్కారమహిమ లున్నను కొందరు బాగుపడరు. అట్టివారిని సంస్కారముకలవారు కూడ ఏమాత్రము మార్చలేరు. చూడండి. శాస్త్రిగారు గొప్పపండితులు. వేదాంతులు. ఆయన బోధలు ఎందరో విని బాగుపడుచుండిరి. ఎందరినో ఆయన తరింపజేయుచుండిరి. ఆయనకు గొప్పపేరు, గౌరవము కలదు- పుత్రలందరు ఆంగ్లవిద్యాభ్యాసకులు, ఆంగ్లవేష భాషా ప్రియులు. అట్టి పుత్రులకు - నాయనలారా! బ్రాహ్మణ విహితమగు సంధ్యను ఆచరింపుడు. గాయత్రిని జపింపుడ"ని తండ్రి చెప్పలేకున్నాడు. కారణం గట్టిగా చెప్పిన ఏమగునో అని భయము, పుత్రవ్యామోహము అడ్డు తగులును. అట్టి పుత్రుల పురోభివృద్ధికి, విద్యాభ్యాసమునకు, శుభకార్యములకు శాస్త్రిగారికి బాధతప్పుట లేదు. ఆయన సత్పురుషుడే. ఆయనకు సద్గతులే కలుగుగాక! తండ్రి పుత్రులకు హిత ముపదేశించ లేకపోయనంటె, విచిత్రమేమి? ఇంతకు సంస్కారమన్నది కావాలి కదా!

"భాగవతోపదేశము."

జీవునికి సుఖమంటే సహజమైన ప్రేమయున్నది. అందరు సుఖం కోరుతారు. అయితే సుఖముయొక్క నివాసము, లేక సుఖముయొక్క యథార్థ స్వరూపమేమిటి. మూర్తిమాన్. ఈ విషయంలో ప్రజలకు తెలివి తేటలు అనగా జ్ఞానము తల్లక్రిందుగా యున్నది. ఏవో వస్తువులందు లేక వ్యక్తులందు జనులు సుఖమున్నదని నమ్మకం పెట్టుకుంటారు. అట్టిదానిలో సుఖ ముండుట అసంభవముగాక! సుఖముయొక్క ఛాయగూడా లేదు. అటువంటి పదార్థములు, చూచిచూచి దుఃఖమునే సంపాదించుకుంటారు. నాశకరమైన యే వస్తువునుంచైనా సరే నిత్యసుఖము లభించదు. దీనివలన స్పష్టం అయినదేమనగా తనకు యిష్టమైనది సంసారములో యే వస్తువూ లేదు. తనకు యిష్టము (అవినాశి) నాశరహితమైన సుఖము. అటువంటిది కేవలము కృష్ణుడే మానవుని జీవన సర్వస్వము, ప్రియుడు, ఏకైకమైన వస్తువు కృష్ణుడే. ఈ శ్యామలుడు, సుందరుడు, నెమిలి పింఛమువాడు, పీతాంబరధారి, మనమోహన, నందకిశోరుడే అందరి ప్రాణములకు స్వామి, ప్రభువు, హృదయేశ్వరుడు. ఇటువంటి నిశ్చయానంతరమే మానసిక సేవ ప్రారంభమౌతుంది.

పటమని పెట్టి శ్రద్ధగా ఆరాధన చేయగా చేయగా "పటమును నే నెందుకు సేవించాలి, అనువిచారణ కల్గితనకన్న వేరుకాదనే భావముతో పటదృష్టి వదలి పటమునందు తనయందు తనకు పటమునకు మధ్య సర్వవ్యాపక రాముని నేను సేవించుతున్నాననే నిజభక్తి ప్రాప్తించును. కనుక ఎక్కడ ఉన్నను నామమును మరువ

రాదు.

(సాధనకు)

భక్తులయొక్క ధ్యానమును గురించి భగవంతుని యొక్క శబ్దస్పర్శాదుల చింతనము, ధామం, రూపము,లీల, సేవ - ఈనాలుగు ఏకత్రితమైనపుడు సగుణ సాకార భగవధ్యానం అవుతుంది. భగవధ్యానంలో ఆయన లీలలతో పాటు ఆయన చేష్టల యొక్క చింతనము అత్యంతావశ్యకము. చాలా సహాయము చేకూరును. భగవంతుడు కనుబొమలు, రెప్పలు వాల్చుట, బొమలు ముడుచుట - చిరునవ్వు నవ్వుట వీటితో కూడిన సేవ జరుగుతూయుంటే ధ్యానంలో ఆనందము - రసానుభూతి కలుగుతూ యుంటుంది. ఈ విధమైన ఆనంద మనుభవింపనిచో - ధ్యానంలో తన్మయత్వం రాదు. భగవధ్యానం వల్ల మనస్సు సాఫల్యం అవుతుంది. జ్ఞానం వలన బుద్ధిసఫలం, రూపదర్శనమువలన - నేత్రములు సఫలం, ఏ మనస్సు చర్మచక్షువులు లేకుండ, భగవంతుని దర్శిస్తుందో ఆమనస్సు చర్మచక్షువులతో గూడ భగవంతుని దర్శిస్తుంది. ఇది అ వైజ్ఞానికమైన మాటగాదు.

మనుష్యుడు నానావిధములైన కోరికలతో చిక్కుకొని యున్నాడు. మనస్సు కోరికల్లో చిక్కుకుంటే భగవత్సేవ యెలా జేయగలుగుతుంది. భగవంతునితో రాగమెందుకు కలుగుతుంది? ఉన్నటువంటి కోరికలలో భగవత్ప్రాప్తియొక్క ఇచ్ఛను కలిపి మరువకుండా వుంచితే శబ్దస్పర్శ రసరూపగంధాదులు అన్నీ శ్రీకృష్ణుని ద్వారా లభించును. అలాగైతే కోరికలు నెరవేరుతాయి. భక్తుడు యిచ్ఛారహితు డవుతాడు. - భగవత్రాప్తి సిద్ధిస్తుంది.

ఆలంబనము లేకుండా ఉపాసనము - అసంభవము. ఒకటి వదిలితే మరొకటి పట్టుకోవటము, అందుకనే పాదాది శిరః పర్యంతము మనస్సు స్థిరమైతే పూర్ణ స్వరూపము ధ్యానం - జెప్పినారు.

శ్రద్ధ - అనుగ్రహము యీ రెండును జోడా. శిష్యుని యొక్క శ్రద్ధ గురునియొక్క అనుగ్రహము కలసి శక్తి పాతము జరుగుతుంది. సిద్ధే భగవంతుని ప్రకటింపజేస్తుంది హృదయమనే అద్దమును శ్రీకృష్ణ విరహాగ్నిలో వేసి కరిగించు - శ్రీ కృష్ణా కారితము జేయుము. అప్పుడు స్త్రీ పుత్రా ద్యాకారత్వము లేకుండా తనంతటదే నశించిపోతుంది. ఎంతవరకు భగవంతుని గురించి వికారము గలుగకుండునో అంతవరకు సంసారవికారము నశించదు.

భక్తుడు తన అభిమానము - పెద్దరికము వదలి భగవంతునివైపు తిరిగిన అతడు గూడా తన గొప్పతనాన్ని వదలి భక్తునివైపు వచ్చును.

ఎవని హృదయంలో యెంత నిష్ఠ - విశ్వాసము - ప్రేమ యుండునో తదనుసారంగా భగవంతుడు తల్లిగాను - తండ్రిగాను వస్తాడు.

దేవకీవసుదేవులకు - భగవంతుడు లేడు. జ్ఞానం వలన అహంకారము పోతుంది- భక్తివలన మమకారం నశిస్తుంది.

భగవన్నామం అంత్య సమయంలో స్మరిస్తే ముక్తి అని జెప్పినారు. దానికి ఒక జీవన్ముక్త మహానుభావులు జెప్పినారు. అంత్యకాలం అంటే ప్రాణం పోయే ముందు కాదు. ఒకసారి భగవన్నామం వుచ్చరించిన తరువాత - మధ్యలో మధ్యలో ఎంతకాలం జీవించినాసరే పాపం జరుగకుండా వుంటే ముక్తి నిశ్చయం అని చెప్పినారు. ఇంకా అద్భుతవిషయాలు నామాన్ని గురించి జెప్పినారు.

కృష్ణనామానికి - చక్కని భావం జెప్పినారు

క - కంఠస్థానీయ స్వప్నాభిమానియైన మనోరాజ్యంలో సంలగ్న జీవుడు.
ఋ - మూర్ధస్థానీయ పరబ్రహ్మ పరమాత్మ.
ష - ణ - ఇరువుర యొక్క మిలనము యెప్పటికి. కృష్ణ.

కృష్ణ - కర్షతి - కృషతివా = ఎవడు పొలము దున్నుతాడో భక్తునియొక్క హృదయమే పొలం - దున్నేవాడు కృష్ణుడు. కఠోరమైన భూమిని కోమలం జేస్తాడు. ఎండి వుంటే నీళ్ళు పెడతాడు. మమత - మోహం అనే రాళ్ళను ఏరిపారేస్తాడు. వాసనారూపి గడ్డిని పెళ్ళగించేస్తాడు. సద్గుణములనే ఎరువు వేసి, సుక్షేత్రాన్ని జేస్తాడు. ప్రేమ బీజమును నాటుతాడు. దాని అంకురము, పత్రము - పుష్పము - ఫలము జూచి ప్రసన్నుడగును. పరిపక్వమైన పిదప రసాస్వాదనము జేయును. నిజముగా కృష్ణుడు ఒక కృషికుడు. కృష్ణ - అంటే నలుపు - నీలము - శ్యామము - యశోద అనే ఉత్సంగ రూపసరోవరంలో వికసించిన నీల కమలము. యశోద యొక్క స్తన్యపానము జేయు - శిశువు - సాక్షాత్ పరమాత్మ

గొల్ల పిల్లలు ఒకరోజున గోవులను మేపుచూ ఆటలలో పడిరి. అప్పుడు ఆవులు దూరంగా వెళ్ళినవి. ఇందులో భగవంతునికి విముఖతగల హేతువును చూపినారు. ఇంద్రియాలు అనగా "గొ". ఎప్పుడు భగవంతునితో విముఖత్వం గలిగి యుండును? వానిలో లోభము యెప్పుడైతే వస్తుందో మన ఇంద్రియాలు

గోపాలునితో విముఖమై విషయ వనములలో ఎందుకు తిరిగినాయి? వానిలో తృణము యొక్క లోభము వచ్చినందున విషయవనాల్లో పడినాయి. భగవంతునితో విరాగము - గడ్డితో రాగము. ఫలమేమైన దనగా వనంలో నిప్పంటుకున్నది. దావాగ్ని ప్రకటమైంది. అందరూ కాలిపోసాగిరి. అందరూ కృష్ణుని పిలవగా యేమిలేదు, కొంచెం దోషం వుంది మీ కళ్ళకు. ఇది దృష్టి సృష్టి - ఈశ్వరుణ్ణి చూచుటమాని సంసారాన్ని చూస్తున్నారు. కళ్ళు మూసుకోండి. అప్పుడు అంతా కళ్ళు మూసుకొంటే శ్రీ కృష్ణుడు దావానల మంతయు త్రాగినాడు.

ఆ శ్యామసుందరుడు - మనం లేస్తే లేస్తున్నాడు - కూర్చుంటే మనతోనే కూర్చుంటున్నాడు - తింటే తింటున్నాడు. చూపు వెనుక, చెవి వెనుక, నాలుక వెనుక, నాసిక వెనుక - వుండి సహాయం చేసేదెవరు? శ్యామసుందరుడే, శ్రీ కృష్ణుడే. ప్రహ్లాదుని యొక్క ప్రత్యక్ష అనుభవం యిదే. మనకిగూడ అంతే అలాగే జరుగుతూంది. మనం జూసి ప్రయత్నిస్తే తెలుస్తుంది. కృష్ణుడే - ఇంకెవరు? తల్లితండ్రి రూపంగా యెవరున్నారు? చర్మాన్ని - ఆకుల్ని చూస్తే వాడు గుర్తుకు వస్తాడా? ఇవి ప్రపంచక నామరూపాలు. తల్లిదండ్రులు దివ్యస్వరూపులు. అందుకనే వారిసేవ భగవత్సేవ యనినారు. అంతేగాదు. కృష్ణునకు అత్యంత ఇష్టమైన విషయం ఏమిటో తెలుసా? ఆయన భాగవతంలో పునఃపునః జెప్పినాడు. "సర్వభూతదయ కాకోలూకని సేవాయం, సంసారో జ్ఞాత్మవేదినః" అనగా భక్తుడు - ప్రపన్నుడు అంతా కృష్ణ మయంగా జూస్తాడు. ఆ భక్తుడు - ఆ కృష్ణుణ్ణే, ఆనారాయణున్నే ప్రపంచగా జూస్తాడు.

కృష్ణనామం అర్థం కృష్ణుడే. ఆ కృష్ణుని నీ యిష్టం వచ్చిన అలంకారం చేసికొని - నీ యిష్టం వచ్చిన నివేదనలు ఇంకా సేవలు జేస్తూ వున్నట్లుగా, లేక వేణువూదుతుంటే ఆ వేణునాదం వింటూ, లేక గోవులమందతో వాటిని మేపుతూ యున్నట్లూ, హృదయంలో ధ్యానం జేస్తూ జపం జరగాలి. అంతే కాదు, ఏపని జేస్తున్నా నీతోటే వున్నట్లు జూసుకోవాలి. ఉన్నట్లుగాదు వుంటున్నాడు. విచారించు:- నా చిత్తం (హృదయం)లో యే అశాన్తిలేక అసంతోషముందో అదియే లేకపోవుట వలన? నిజంగా నేను అనేకరకములైన ఆభావములతో నిండియున్నానా? ఏది లభిస్తే అన్ని అభావములు పూర్తి యగునో ఆ వస్తువు యేది? నిజముగా నిశ్చయముగా అటువంటి వస్తువు శ్యామసుందరుడే. ఎంతవరకు అతడు ప్రాప్తించడో అంతవరకు ఈ జీవితంలో నున్న అభావములు యెందుకు ఉండవు? నేను ఆ శ్యామసుందరుని నిశ్చయముగా పొందగలను.

ఎప్పుడైతే నాయొక్క అవశ్యకతలను (కోరికలను) నీకంటే ఎక్కువ తెలిసినటువంటి, మరియు వాటిని నెరవేర్చేవాడు సిద్ధంగా యుండగా యింకనీకు కోరికలెందుకు? శ్యామసుందరుని విశ్వసించుము. కొంచెము విచారించు. అతడికి నీయొక్క యోగక్షేమముల గురించి యెంతగా జ్ఞానము ధ్యానమున్నదో?

ఏ భగవంతుని ఆరాధించుటకు యెవరిద్వారా యీ వుపాధి లభించినదో అట్టి భగవత్స్వరూపులైన తల్లి తండ్రులకు అతి శ్రద్ధతో వందనము జేయుచున్నావా? ఇదిలేక గురు, గోవిందుల ప్రసన్నత అసంభవం.

ఎప్పుడైనా నీయొక్క యిచ్ఛకు విరుద్ధంగా భగవంతుడు యేమయినా జేస్తాడు. అప్పుడే ఆయనయొక్క వాత్సల్య స్నేహము అత్యధికముగా ప్రకాశించు చుండును. అతడు నీయిచ్ఛలను తనయొక్క ఇచ్ఛానుసారముగా వుంచదలచును. ఇది అతనియొక్క మహదనుగ్రహము. ఈ విధముగా ఆయన యెలా సంరక్షిస్తున్నాడో జాడతెలుస్తూ యుంటుంది.

నీవు యేం చేస్తున్నావో, యేంమాట్లాడుతున్నావో, యేమి ఆలోచిస్తున్నావో అంతయు భగవంతుని సన్నిధినే యని మరువక గుర్తుంచుకో!

ఎంతవరకు జీవితంలో శ్రీకృష్ణుడు ప్రవేశించడో అంతవరకు దుర్గుణములు నశించి - సద్గుణములు గలుగవు. అంతట శ్రీకృష్ణుని దర్శించుము. ఆకాశాన్ని జూచి భగవంతునియొక్క శ్యామవర్ణమును స్మరించుకోవాలి. మేఘాల్నిజూచి ఘన శ్యాముణ్ణి, గోవులనుజూచి గోపాలుణ్ణి నెమలినిజూచినెమలిపింఛధారిని, ధేనువును జూచి ధేనుకాసంహారుని ఈవిధముగా స్మరించుచుండవలెను.

వ్యాకులతనిజంగా యుంటే భగవంతుడు ఒకరోజు లోగాదు ఒక రెప్ప పాటు కాలంలో లభిస్తాడు.

వృత్తి భగవద్ధామాకారముగా యుండుట, భగవదాకారముగా యుండుట భక్తియనబడును. మనస్సును గోకులానికి తీసికొనిపో ! లేక గోకులమును నీమనస్సు లోకి తెచ్చుకో !

## "భజించు విధానము"

ఇంటికి వచ్చిన అతిథికి యెట్లా సేవజేస్తారు? సేవయే భజన. అలాగే భగవంతుణ్ణి దగ్గరలో దగ్గరగా సంబంధకుడని భావించి (యెంచి) ఆయనను

ప్రేమించాలి. తినిపించాలి, త్రాగించాలి, సేవజేయాలి. తిట్టు - కొట్టుడు, అలాయెందుకు ? అతడు నీవాడే, అక్కడ కపటంయెందుకు ? మర్యాదయేమి చూడనక్కరలేదు. వెన్నవుంటె వెన్నలేకపోతే కొబ్బరే! అయితే అతనితో రోజంతా గడుపు. అతనితో కొట్లాడు - తిట్టు, బ్రతిమాలుకో, ఆడించు - ఆడుకో,శాస్త్రశిష్టాచారం అక్కర లేదు. ప్రేమతో అతనితోటే తిను. స్నానంచేయుము. కూర్చొనుము. పరుండుము. ఆడుము. అతడు నీవాడు నీవు అతనిదానవు ( వాడవు). ఏమీ తోచకపోతే ( రెండుతలముల) నాలుకమీద వానియొక్క మధురమైన నామమనే పటికబెల్లం రసాన్ని ఆస్వాదిస్తూ యుండుము.

హృదయమందిరం భగవంతుడు నీదిగదా ! అక్కడ దేహాభిమానము, ధనాభిమానము, కులాభిమానముల స్పర్శకలుగరాదు. హెచ్చరిక!

భక్తియొక్క సంస్కారము అతిప్రబలంగా యుంటుంది. అదిభక్తుని యెన్నటికి పతనం గానీయదు. అది కాపాడుతూ యుంటుంది.

శ్రీకృష్ణ ప్రాప్తివిషయంలో నిరుత్సాహమే, వార్ధక్యము. మరియు ఆయనతో సంబంధము వదలుకొనుటే మృత్యువు. సర్వత్ర ఆయనను స్మరించుటయే అనగా అన్నిటియందు - అందరియందు ఆయనతో సంబంధము.

శ్రీకృష్ణస్మరణమే స్మరణ, స్మరణయొక్క "స" భగవంతుడు "స" లేకపోతే అనగా భగవంతుడు లేక పోతే స్మరణ "మరణం" అయినది. అలాగే "స్మృతి" స లేకపోతే "మృతి" అందుచేత నిజమైనస్మరణ జేయుము. భగవంతుని హృదయ మందిరంలో యుంచుకో !

సేవజేస్తూ సుఖాన్ని (కోరికలు) కోరుట. లేక సేవవలన ముక్తి అనగా యిలా యెంతకాలమని, ఎవరికి గలుగుతుందో ! ఆభక్తివలన సుఖము పొందలేరు. అట్టి వారికి భక్తిరహస్యము తెలియలేదు. గాక భక్తి యొక్క సుఖము వారియొక్క హృదయంలో ఉదయించలేదు.

కృపణు డెవడు? భగవంతుడు లభించకపోయినా, ప్రపంచంలో సుఖంగా యుండుటకు ప్రయత్నించువాడు. బుద్ధిమంతుడెవడు? భగవంతుని కొరకు ప్రపంచమును వదలుటకు సిద్ధముగా యున్నవాడు. ప్రపంచమనగా దేహబుద్ధే - (భగవద్బుద్ధియుండాలి). అనగా దాసోఽహం ఇత్యాది. వ్రజంలో వాత్సల్యభావం పైకి కనుపరుస్తారు. ఆంతరికంగా మధురభావం - (వల్లభసాంప్రదాయం).

సాధకున్ని పొగడ్త పడవేస్తుంది. నిందలేక అవమానం పైకి లేవతీస్తుంది.

ఒకసారి గోపికలను వర్ణిస్తూ కృష్ణుడన్నాడు. గోపికలు తమ శరీరములను నాది అనుకునే స్నానం చేస్తారు. అలంకరించుకుంటారు. అందుకని వారికంటేనాకు ప్రేమభాజను లెవరు ఇంకొకరు లేరు అన్నాడు. ఆంతరికంగా నడుస్తూ - కుర్చుంటూ, లేక ఎవరితోనైనా మాట్లాడుతూ - ఆలోచిస్తున్నప్పుడు కృష్ణశక్తితోనో కృష్ణుని ఆధారంతోనో ఆయనను జూస్తూ - ఉండుట అభ్యసించాలి. ఇది లేకపోతే దేహి వాసనలు తమవశం జేసుకుంటాయి. భగవద్విశ్వాం దూరం అయిపోతుంది.

రోగంవస్తే కృష్ణానుగ్రహం అనుకో, ఇంట్లో ఏ ప్రాణిని, యేవస్తువుని కృష్ణుని సంబంధకులుగా భావిస్తూ వుండాలి. దేహసంబంధీకులు అనుకుంటే మమకారం పెరిగి కృష్ణుడు హృదయమందిరంలో లేకుండా పోతాడు. "మమ" రెండక్షరాలే "మృత్యు" రెండక్షరాలే. అనగా 'మమ', మరణమే. మరియెలా గుండాలి? "నమమ" నాదికాదు. కృష్ణునిదే సర్వస్వము. "నమమ" మూడక్షరాలు. అమృతం అన్నమాట. త్యాగంవుంటే కృష్ణుడు వున్నట్లే.

అప్పుడప్పుడు మనస్సు చంచంలంగా వుంటుంది. వుండనీ. ఆశ్చర్యమైన మాటగాదు, అయితే అచంచలత్వము వెంటనే ఇష్టదేవునితో జోడించుము ఏం? అతను తక్కువ చంచలముగలవాడా? మనస్సులో యే ఆలోచన ప్రలోభం వచ్చినా? యెటువంటిదైనా కృష్ణునితో జోడించు. నారద మహర్షి వ్రాశారు. మనస్సులో కామక్రోధాలు వస్తేవాటిని కృష్ణునితో జోడించుము.

భగవంతునియొక్క నామాన్ని పలకటం జపం చేయటం సుగమం. కాని నామంయొక్క మహిమను గుర్తించటం అసాధ్యమేకాదు, కష్టాసాధ్యం గూడాను. గొప్పగొప్ప సాధకులు కూడా నామమహిమను తెలుసుకొనలేరు. ఇక సాధారణ మానవులు ఎలా తెలుసుకొనగలుగుతారు. అయినా ప్రతయ్నం అవశ్యంగా చేయాలి.

భగవన్నామం ఎలా చేసినా ఏ అవస్థలో చేసినా అది వానిని వుద్ధరిస్తుంది. శ్రద్ధలేకుండా మహిమ నెరుంగక పలికిన నామంవలన అంత్యకాలంలో అజామిళు నకు ముక్తివచ్చినది. ఇక శ్రద్ధతో చేసిన నామం వలన ముక్తివస్తుదంటే ఇక సందేహించుట ఎందులకు?

ఆదరణతో భగవన్నామం పలికితే దుర్లభమైన గొప్పఫలం లభిస్తుంది. ఇంక అవహేళనలో పడుచూ, జారిపోతూ, అంగభంగం జరుగుతూ, పాముకరచి నపుడు, కాలినపుడు, దెబ్బతగిలినపుడు "హరే" యనిపలికిన ద్రవించి నహృదయంతో భగవన్నామాన్ని వుచ్చరించునో అతడుకూడ యమయాతన ననుభవించడు.

డబ్బు అనే నిచ్చెన దొరికితే దాని మీద అలా పైకిపోయి కీర్తి - ప్రతిష్ఠలు, స్వర్గసౌఖ్యాలు అందుకో వచ్చుని చాలమంది ఆశపడతారు. కాని యీ నిచ్చెనకు దుఃఖము అశాంతి అనేవిషసర్పాలు పెనవేసుకున్నాయని, వాటినుండి తప్పించుకోవటం చాలాకష్ట మని అందరికి తెలియదు.

డబ్బువల్ల పేరుప్రతిష్ఠలు రావచ్చు కాని చిత్తశుద్ధిరాదు. మాటిమాటికి మానవజన్మవస్తుందనుకొంటున్నావేమో ? ఏ ఇతరయోనిలో పుట్టినా రామనామం చేసుకోవటానికి వీలులేదు. మానవజన్మ వొక్కదానికే అవకాశముంది. ఈ అవకాశం పాడుచేసుకోకండి, ఈ విషయసుఖాలన్నీ అన్ని యోనులలో పుట్టి అనుభవించవచ్చు. కాని రామనామం చేసుకోవటానికి అవకాశం లేదుసుమా !

గోడమీద సూర్యునిబొమ్మ లిఖిస్తే చీకటి పోవటం లేదు. కలియుగంలో ముక్తికి చెప్పినవన్నీ వృధాయే. నామమే గతి. వేదాంతం చెప్పేవాళ్ళకి భక్తి శూన్యమైపోతుంది. ఏవంటే వేదాంతం "విధి క్రియావిహీనానాం" వీరికి రామనామమే ముక్తి. అని వ్యాసులవారే చెప్పారు.

మనిషిలో మార్పుతెచ్చేది కన్నీరే. మనిషిని దేవతగా మార్చేదీ కన్నీరే !

గోడమీద బొమ్మను జూచి యెవడయినా మోసపోతాడా ? అలాగే రెండురోజులు ముఖంకడుక్కోకపోతే దుర్గంధం బయటకు వస్తుంది. అంతేసుమా జగత్తంతా ! దృశ్యమంతా దుర్గంధమే. రామనామం ఒక్కటే దుర్గంధంలేనిది. రామనామంలేనిచోట మంచి నీళ్ళు త్రాగకూడదు. వాళ్ళు అస్పృశులు. రామనామం లేనివాడు నిర్ధనుడు. మాధవం రామనామం. మీ ధనమునకు దొంగలభయం ఉంది. మారామనామధనం దగ్గర ఏభయమూలేదు. ఈ రామనామంధనం మంచి కష్టసమయంలో ఆదుకుంటుంది. రామనామం లేకపోతే మాకు నష్టమేమిటండీ ? అంటావేమో. నీకు వెళ్ళే ముహుర్తం ఒకటి వస్తోంది. వెళ్ళేటప్పుడు నెత్తి, నోరు కొట్టుకుంటూ ఏడుస్తూ పోతావు. జాగ్రత అని అంటారు కబీరు.

ఎవళ్లహృదయంలో రామనామం వుంటుందో వాళ్లు కృతయుగజీవులే. సన్యాసి కుక్కనైనాసరే ఛీ! అంటే వాడి సన్యాసం తగులబడినట్లే. భర్తనువిడిచి బృందావనంలో నివాసమున్నా నీకు నరకమే. ఇది కలియుగమని బాగా విచారించుకో. పెద్దలను అడిగి తెల్సుకో నీయిష్టంవచ్చినట్లు తిరక్కు. విధినిషేధములున్న పనిలో అడుగుపెట్టకు. విధినిషేధములులేని రామనామంలో ప్రవేశించు. హృదయం కరిగేలా నామంచెయ్యి. వేదంలో ఎన్నినిషేధాలున్నాయో అన్నీ నీవు

చేసినట్లే. రామ నామం చెయ్యకపోతే, వేదములలోని ఉత్తమవిధి రామనామం. మణినితీసివేస్తే పామునశించి పోతుంది. రామనామమణిని గ్రహిస్తే జగుత్తులొంగి పోతుంది. రామనామం కల్పవృక్షంలాంటిది. సకలధర్మములలోను పెట్టి సకలభోగభాగ్యములు యిస్తుంది. ఆకల్పవృక్షము. మోక్షము ఇవ్వలేదు. రామనామ కల్పవృక్షము. చివరకు మోక్షముకూడ యిస్తుంది. ఇలా కాశీవిశ్వనాథుడే చెప్పచున్నారు, ఇంకాసందేహిస్తున్నామంటే అది మనదౌర్భాగ్యమే.

హృదయం దయార్ద్రం కానిది భగవత్కృపాకటాక్ష వీక్షణానికి ఏవిధంగా పాత్రుడౌతాడు ?

రామనామముకంటె కలియుగములో రెండవ కల్పతరువు లేదు. సకల కళ్యాణములు రామనామమునందే ఉన్నవి. రామతారకము అందరికి ఆశ్రయ నీయము. శ్రేయస్కారములు నామకల్పతరువునే ఉపాసించవలెను.

మానవజన్మ గెలుపొందాలంటే భగవన్నామం చెయ్యాలి. భగవన్నామాన్ని అడ్డుపెట్టడానికి వీలులేదు జీవితంలో. గుండుసూది గుచ్చినప్పుడు సినిమా చూచే టప్పుడు వలె స్వర్గసుఖాల్లోను, నరకదుఃఖాల్లోను భగవన్నామం కుదరదు.

అద్దెకొంపలో ఉన్నావు. ఏక్షణంలో లేచి పొమ్మంటారో ! జాగ్రత్త. అద్దె కొంపను నమ్ముకోకు సుమా ! చెడిపోతావు.

భగవన్నామం మీయిష్టం వచ్చిననామం కుటుంబసభ్యులంతా సమిష్టిగా చేసుకోండి. ఇందులో యేదయినా మోసంవుంటే మానెయ్యండి. సమిష్టిగా యెందుకని? సమిష్టిగా తింటున్నాముకదా! పిల్లలికి పెట్టి తింటున్నారుకదా! పిల్లలకు పెట్టకుండా మొద్దుల్లా తింటున్నారు? పిల్లలకు పెట్టకుండ తింటుంటే వీడు మనిషా! పశువా? అంటారు. పిల్లలికి రామనామం చెప్పకుండా బ్రతుకుచున్నారు. మానవ హృదయముంటే సమిష్టిగా చేసుకోండి. సమిష్టిగానామం చెపితేనే సద్గృహస్థుడు స్వగృహం అంటారు.

శరీరం మహాసౌందర్యవంతంగా వుంది ఐశ్వర్యవంతంగా వుంది. కాని ఏం లాభం? నోట్లో రామనామం లేదు. కుష్టువాడినోట్లో నిరంతరం రామనామం పలుకు తోంది. వాడుధన్యుడు. దేవాలయంలేని వూళ్ళో ఎట్లా మంచినీళ్ళు త్రాగకూడదో అలాగే ఏయింట్లో రామనామంలేదో అక్కడ మంచినీళ్ళుకూడ త్రాగకూడదు. వాడు అస్పృశ్యుడు. పెదిమలకు రెండు రోగాలుంటాయట. 1) సిగ్గు 2) లోభం. కామ

లీలలు పాడతారుగాని రామనామకీర్తనలు మాత్రం పాడరు. ప్రతిజ్ఞ ఛాలెంజ్ చేసి చెపుతున్నారు. సులభంగా తరించేవుపాయం చెవుతున్నారు. నా జన్మపరంపరలు కత్తిరించు కోటానికి ఈ నామంచాలు. పెనుగాలులు వచ్చినా చలించని విశ్వాసం కావాలి నామవిశ్వాసం "వీడే మీనాన్న అని తల్లి చెప్పితే చచ్చేదాకా నమ్ముతాడు తండ్రియని. అంతేగాని అపనమ్మకం కలుగదు. తండ్రి అవునా - కాదా" అని. అలాగే వేదమాత చెపుతోంది, భగవానుడిగురించి, వీడికి నమ్మకంలేదు.

భగవన్నామం చెయ్యకపోతే మోసపోతావు సుమా ! జాగ్రత్త. ఇన్ని సుఖములు క్షణికములు సుమా ! భక్తులకు ఏవిపత్తువచ్చినా గోటితో తీసిపారేస్తాడు భగవదాశ్రయము ఉన్నవానికి.

అచ్యుతుని ఆశ్రయించినవానికి భయమెక్కడిది ? భయమునకు చోటేది? భక్తులకు సర్వశ్రేష్ఠమగు విషయము వినయము. తల్లియొక్క చంకలో పిల్లాడు ఎట్లునిర్భయముగ ఆడునో అట్లే భగవంతుని ఆశ్రయములోని వానికి యీ ప్రపంచములో సర్వత్రా సుఖమే కలుగుచుండును. ఎవరిహృదయములో శ్రీహరి యుండడో వారిపై కుటిల కలికాలము ఆధిపత్యము వహించును.

భగవన్నామం చెయ్యని నాలుక తోలుముక్క. కనుక కోసి అవతలపారెయ్య మన్నారు తులసీదాసువారు.

జీవాత్మకు పరమాత్మకు భేదం లేదని చెప్పేది రామనామం. కాల్చేసిద్ధి నిప్పుకు ఎలావుందో అలాగే పాపాలను దగ్ధంచేసే శక్తి రామనామంకు వుంది.

రామనామం సంగతి వాల్మీకికి, శివుడుకి విఘ్నేశ్వరుడికి తెలుసును కొంచెంగా !

చాలా గొప్పఔషధం అంటే ఎంతడబ్బయినా యిచ్చు కొనగలుగుతారు. మహర్షులు చెప్పిన రామనామం గుణం తెల్సుకోలేరు.

దరిద్రులకు చాలీసా కల్పతరువు. కామధేనువు వంటిది. మారుతి ఆశ్రయములో ఉన్నవారికి సర్వకార్యములు నెరవేరును. భగవంతుడు మనం ఒకటి అయ్యేవరకు సాధన చెయ్యాలి.

పరుగెత్తుకుపోయే నది సముద్రంలో కలిసి సముద్రమయినట్లు బాణం గురిచూచి కొట్టాలి. అలాగే అలాగే నామం చేసేటప్పుడు ఇష్టదేవతా స్వరూపాన్ని

గురిపెట్టాలి. బాణం వెడుతుంది. లక్ష్యం చేరదు. అలాగే నామం చెప్తారు. భగవంతుని చేరలేదు.

కాశీలో చచ్చిపోతే ఏపుణ్యం వస్తుందో ప్రయాగలో పడి ఛస్తే ఏపుణ్యం వస్తుందో రామనామనురాగం వుంటే ముక్తివస్తుంది. నామం చేసేవాడు ఎట్లా వుండాలి? గడ్డిపరకకన్నా హీనంగా వుండాలి. చెట్టువలె ఓర్పుకలిగి వుండాలి. ఎవరు నిన్ను అగౌరవిస్తారో వారికి గౌరవం ఇవ్వాలి.

ఏదేవుడుని ఉపాసనచేస్తున్నావో ఆదేవుడి యిష్టప్రకారం నడుచుకోవాలి. అన్నీ నీయిష్టప్రకారం చేసుకొని తర్వాత దేవుడిని కావాలంటావు. కానీ ఆయన ప్రకారం నడుచుకొంటేనే ఆయన నిన్ను వెంటనే "యోగక్షేమం వహామ్యహం" నిన్ను ఆదుకుంటారు.

అనసూయ అసూయ అక్కచెల్లెళ్లు అనసూయ కొడుకులకు అంతా సులభం. అసూయ (చెల్లెలుకొడుకులకు) అంతా వ్యతిరేకం. కోటియజ్ఞముల ఫలములకు సమానం ఒక్క రామనామం. కలియుగంలో కల్పతరువులా రక్షిస్తుంది రామనామం.

స్నానం చేసేటప్పుడు, అన్నం తినేటప్పుడు, నిద్దుర, పోయేటప్పుడు భగవంతుని తలుచుకో హరి. కృష్ణా, కృష్ణా అంటూవుండాలి. మహామహా ఆపత్తులు వచ్చిన ద్రౌపదీ మున్నగువారు మహామహావ్యాధులు వచ్చిన వారు భగవన్నామం చేసి సుఖించారు. ఎవరి పెదిమలు ఎప్పుడూ రామనామం చెయ్యకపోతే దుర్దినం.

శ్రీకృష్ణుడు గుట్టలుగుట్టలుగా నున్నపాపములను ఒక్కక్షణంలో భస్మము చేయును. అందరు ఆయననే స్మరించవలెను. పరస్పరంగా స్మరింపజేయవలెను. ఈ విధంగా సాధనభక్తిని చేయుచున్నటులైతే క్రమంగా ప్రేమ భక్తివుదయించును. అతడు ప్రేమోద్రేకంతో పులకితుడై శరీరమును ధరించును.

కామం, క్రోధం, భయం స్నేహంలేక ఐక్యభావంతో యేదో విధంగా భగవంతుడ్లో మనస్సు ప్రవేశింపజేసి సంసారంనుండి వదిలి ప్రాణి భగవద్రూపు డగును.

హనుమాన్‌చాలీసా చూచారుకదా ! నిత్యము పఠించుచున్నారు. ఇది చాలాగొప్పది. తులసీదాసుగారు రచయించిరి. ప్రత్యక్ష ఫలదాయకము. సుందరకాండతో సమానమైనది. నిత్యముపఠించండి. నిత్యము పదకొండు పర్యాయములు చదువండి. మంచిఫలితము. "యహశతవార పాఠకరజోయీ,

ఛూటహి బంది మహా సుఖహోయీ" అన్ని బంధములు వీడిపోయినవి - చూడండి ఏమిసంబంధములున్నవి (అన్నియు వీడిపోయినవి ? అన్నియు ఏమిపోయినవి. బంధములు పోయినవిగా! అని తమను తాము చూపించుకొనుచు) అన్నియు పోయినవి - నాయనా ! చక్కగా చదువుము. మీరందరు చదువుడు. (శ్రీవారితోకలిసి అందరు చాలీసా చదివిరి).

ప్రారబ్ధానుసారము ప్రాప్తించిన వాటితో సంతోషమును సుఖమును ఎవడు కలిగియుండునో అట్టివానికే శ్రీరఘురాముని పాదపద్మములందు ప్రీతి జనించును. కదనము త్రొక్కునట్లు ఎవనిమనస్సు చాంచలసముగ తిరుగుతూ ఉండునో, భజన యందు కూర్చున్నపుడు గూడ మనస్సు చలించుచుండునో అట్టివాడు వనములలో నున్నను. ఇంటిలోనున్నను వక్కటే. వానియొక్క బహిరంగ త్యాగమునకు మహత్వ మేమిలేదు. విషయరసమునందు ఉదాసీనుడై రాముని ప్రేమించవలయును. శ్రీరాఘవేంద్రుని వదిలి అన్యవిషయములందు,విశ్వాసముంచెదరో వారికి సుఖ సంపదలు లేక పోగా నరకమున గూడా తావు దొరకదు.

తపము, తీర్థాటనము, యాగము, దానము, నియమము, ఉపవాసము వీటిఅన్నిటికన్న మహత్వశాలి యగు (అధికమగు) శ్రీరాముని నామజప మొన రింపుము. అని తులసీదాసుగారు చెప్పు చున్నారు. నామమున గల రుచి ఏప దార్థమున లేదు. అమృతముకూడ దీనిముందు తీసికట్టు. గాన నిత్యము నామ జపము చేయుచుండవలయును.( సకుటుంబ నారాయణస్మరణలు.)

**శ్రీరామ జయరామ జయజయరామ**

## 166. అవధూతపలుకులు

భాగవతంలో మహాదేవుణ్ణి నిందించి శివాపరాధం చేసినపుడు దక్షుణ్ణి హెచ్చరికచేస్తూ యీ "శివ" అనేటటువంటి నామంయొక్క మహిమను అమ్మవారు చెప్పింది. ఊరికే హేళనగా అన్నాసరే ... యెంతో పాపం పోతుందట.

**యత్ కృత్యం తన్నకృతం । యదకృతం కృత్యవత్తదాచరితం**
**ఉభయోః ప్రాయశ్చిత్తం । శివ తవనామాక్షర ద్వయోచ్చరితః**

ఇంతకంటె అద్భుతమైన వ్యవస్థ. యెక్కడాలేదు. వేదంలో వున్నది యీ వ్యవస్థ. ఏది చెయ్యవలసియున్నది. చెయ్యకపోతే, చెయ్యకూడనిదిచేస్తే వచ్చే యీ

ఉభయ విధములైనటువంటి పాపములకు ప్రాయశ్చిత్తం "శివ" అనేటటువంటి యీ రెండు అక్షరముల నామము యొక్క ఉచ్చారణే .... వాసుదేవ !

**"అన్యాని శివకర్మాణి కరోతు న కరోతువా"**

ఈ శ్లోకం పురాణంలోదే సుమా ! ఇతరమైనటువంటి మంగళ ప్రదమైన కర్మలు చెయ్యి, చెయ్యకపో...........

**"శివనామ జపే ద్యస్తు సర్వదా ముక్తచేతనః"**

అనే పరమధర్మాన్ని అందిస్తున్నారు. స్వధర్మం చెయ్యలేనటువంటి కాలంలో .... విధిక్రియా విహీనస్థితిలో వున్నటువంటి యొక్క ..... కలికల్మష చిత్తులైన మానవులకు ........ వ్యాసులవారు అనుగ్రహించి కృతార్థులవటానికి యెటువంటి పొరపాటు భ్రాంతిలో పడినవారికీ ఆ భ్రాంతిని బ్రద్దలు కొట్టేటటువంటి, నాశనం చేసేటటువంటి మంగళప్రదమైన ఆత్మనిష్ఠ నందించేటటువంటి సాధన యిది.

**"సర్వాణి శివనామాని మోక్షదాన్యేవ సర్వదా"**

శివనామములన్నీ కూడా ముక్తి నొసగునవి. అయితే........

**"ఏతత్ ఉత్తమనామ శివేతి బ్రహ్మనమ్మితం:"**

వాటి అన్నింటిలో "శివ" అనే నామం వుత్తమ మైనది.

ఈ నామసంకీర్తనచేస్తూ ఒక్కమాట గుర్తుకు వచ్చిందినాకు ..... ఒకసారి ప్రయాగ వెళ్ళాము. మా గురుస్వాములవారు, నేను మాతోటి ఒక భక్తుడు కూడా వచ్చాడు. మాకు భిక్షచేసుకుంటా నన్నాడు. మేడమీద మాగురుస్వాములవారు వుంటేను పైకివెళ్ళి భిక్షచేస్తా నంటున్నాడు. అని చూపెట్టేను. అతనిని ...చూశారు... "క్రాఫింగ్ వుంటే నేను హస్తోదకం తీసుకోను" అన్నారు. క్రాఫింగు తీస్తే అతడికి 300 రూపాయల ఉద్యోగం వూడితే వూడొచ్చు. కొన్ని ప్రిన్సిపుల్సు యేవో వుంటయ్యిగా వాళ్ళ వాళ్ళ ఆఫీసులలో ..... చాలామంది చెబుతూవుంటారు. "బొట్టు పెట్టుకువెళితే కష్టమండీ, మేమందుకే తుడుచుకుని వెడతామండీ" అని యెంతో దైన్యంగా, దీనంగా చెబుతూవుంటారు. ఇంట్లో యెంతో శ్రద్ధాభక్తులతో పూజ చేసుకుంటారు. సుబ్బరంగా ఆబొట్టును తుడుచుకొని వెధవముండలా తయారై యేడుపుముఖం పెట్టుకొని ఆఫీసుకుపోతారు అంటె నేను యెందుకు చెబుతున్నానంటె యిదంతా ... ఆత్మ

విశ్వాసంలేదు. వాడికి. బొట్టు పెట్టుకు వెళితే యేమన్నా అంటారేమో ననిభయం! .... నువ్వు ఆశ్రయించినవాణ్ణి నీవు లెక్క చెయ్యలేదన్న మాట. అసలు నీకు వాడెవడో అర్థంకాలేదన్నమాట ... ఒక్క నిమిషంలో మార్చెస్తాడే యెటువంటి వాడి మనస్సు నైనాసరే !

సరే ... పరిస్థితి గుర్తు చెయ్యటానికి చెబుతున్నా. క్రాఫింగువున్నది గనుక నేను హస్తోదకం తీసుకోను అన్నారు. ఏం చెయ్యాలి యిప్పుడు?... నేను అన్నాను "అయ్యా మీహస్తోదకం కోసం 300 రూపాయల వాడి వుద్యోగానికి యేమి యిబ్బందులు వస్తయ్యో యేమిటో," అని అన్నా, వల్ల కాదన్నారు. సరే నేను తీసుకున్నా. వారు దయాళులు గనక, భక్త వత్సలు గనక, మర్నాడు వారూ తీసుకున్నారు.

ఈమాట నేను యెందుకు ప్రత్యేకముగా చెబుతున్నాను. అంటే .... దీనిని బట్టి మీరు అంచనా వేసుకోండి. స్వధర్మం ఆచరించటం యెంత కష్టమో యీ రోజుల్లో. వ్యాసులవారు యెందుకని యీమాటకంలోక్తిగా చెప్పేరు? అభిరుచి వుందా ... మీకు .......... చక్కగా భగవత్ ప్రార్థన చేసుకోండి .... ద్విజులు కానివారు భగవత్ ప్రార్థన చేసుకోండి ... అదే సంధ్యవారికి "కానికుదరదండీ" ...కుదరకపోతే నుంచొనయినా భగవన్నామం చేసుకోవచ్చే ? .... కూర్చొనయినా చేసుకోవచ్చే ... బట్టలు మార్చక్కర్లెదు .... అటువంటి వ్యవస్థను వ్యాసులవారు మనకందిస్తే ఒకపట్టుదలతో వుండి "స్వధర్మాచరణం చేస్తేనే కుదురుతుంది. లేకపోతే కుదరదండీ" అంటే .... చేస్తేమంచిది కాదని యెవరన్నారు ? స్వధర్మం చేసుకుంటూ వుండండి.

స్వధర్మం అంటే యేమిటి ? ప్రొద్దున్నే నిద్దరలేవంగానే ముందు గడ్డం గీచుకోవటమే స్వధర్మం అయితే ఇది మంచిదా ... మంచిదికాదా చెప్పండి ? మంచిది కాదు. కాని సమాజం యొక్క పరిస్థితి అలా విజృంభించివుంది. వాడికి గౌరవంలేదు. ఆఫీసులోకి రానివ్వరు. ఆగడ్డం గీచుకున్నటువంటివాడు స్వధర్మం యేం చేయగల్లుతాడు? చెప్పండి ? ఒకవారంలేదు... నక్షత్రంలేదు. ప్రొద్దున్నే ప్రాతఃస్మరణీయకాలంలో యిటువంటి విపత్తులన్నీ కూడా ఆక్రమించేయి కలియొక్క ప్రభావంచేత. అందుచేతనే వ్యాసులవారు బాగా అందిచేరు... గోకర్ణుడు చెబుతాడు.

"ధర్మం భజన్వ సతతం త్యజలోకధర్మాన్"

అని. యెందుకంటే ... ధర్మం అంటే యేమిటి? ధర్మం అంటే ఆత్మే ... ఇంకా అర్థం కావాలంటే భగవంతుడే అనుకోండి. అందరకీ అర్థమవుతుంది. ఆ

ధర్మాన్ని పట్టుకోండి. ఈలోకధర్మాల్ని పట్టుకొని నువ్వు వూగులాడటానికి కాదు .... అసలు లోకధర్మాల్లోగూడా పరమార్థమే అందించారు. ఆమాట మర్చిపోయి దాని కోసమై యేడుస్తున్నావుగనుక.

**"ధర్మం భజస్వ సతతం త్యజ లోకధర్మాన్"**
**సేవస్వ సాదుపురుషాన్ జహి కామతృష్ణాం**
**అన్యన్య గుణదోషణ మానుముక్త్వా ॥**

ఈ ఒక్కమాటే ! నిమిషాలమీద భగవత్పరమై పోతుంది. మనస్సు. యెవరయితే యీ విషయంలో హెచ్చరిక చేసుకుంటున్నారో మనస్సుని ఇతరుల యొక్క గుణములుగాని దోషములుగాని యెవడైతే వెంటనే వొదిలిపెడతాడో వాడు సాక్షాత్తు విష్ణువై పోతాడు. అంటే ..... అటువంటి హెచ్చరిక అన్నమాట యిది. అదే భాగవంతంలో వుంది.

**"పర స్వభావ కర్మాణి నప్రశంసేయత్ నగర్హయేత్"**

ఇతరులయొక్క స్వభావములను, కర్మలనుగురించి ప్రశంసించొద్దు. ... నిందించవద్దు. ఇక యేంచేస్తుంది. మనస్సు భగవత్పరంకాక అప్పుడు. అసలువున్న అనర్థమే యిది! ..." అసలు యీ అనర్థం యెందుకొస్తుందండీ?!" జగద్భావం యెవడికివుందో వాడికే యీ ముప్పతిప్పడు వస్తయి. ఎందుకంటే యెవడు జగత్తును చూస్తాడో వాడికి దుఃఖం తప్పదు .... దుఃఖం తప్పదు .... దుఃఖం తప్పదు. జననమరణాలు తప్పవు.... తప్పవు ..... తప్పవు..... "మరి యెవర్ని చూడాలండీ?".... నీ యిష్ట దేవుణ్ణి చూస్తూవుండు ...:. ఒక వేశ్య కనిపించినా సరే, ఒక తుమ్మచెట్టు కనిపించినాసరే.

ఈవిధంగా .... యే నామరూపమైనా సరే. నువ్వు అక్కడ నీయిష్ట దేవుణ్ణి స్థాపన చేసుకుంటే నీకు జననమరణము లేకుండా పోతుంది. ఇది శాస్త్రము యొక్క ప్రతిజ్ఞ. మీయిష్టం!.... మీరు యెంత తొందరగా దీన్ని అందుకొంటారో ... అందుకోండి... వాసుదేవ!

ఇదంతా యెందుకు చెప్పేనంటే .... ఈస్వాముల వారు వూరికే భగవన్నామం చేసుకోమంటారు. సంధ్యా వందనం చేసుకోమని చెప్పరు. స్వధర్మం చెప్పరు అనుకుంటారు. నే నెందుకు చెప్పేది యీ చదవు? స్వధర్మం చేసుకోమని నేను

చెప్పనక్కర్లేదు. భగవన్నామం వాడ్ని యేంచేయాలో ... యేమి కాల్చాలో .. యెక్కడికి తీసి కెళ్ళాలో అదే చేస్తుంది. భగవన్నామం జడమా ? అది నేను చెప్పాలా ? .... ఈ మాట యెవడికి తెలియదు ? నేనేం చెయ్యనక్కర్లేదు. ఏం చెయ్యాలో అది భగ వన్నామమే చేస్తుంది. కత్తిరించి పారేస్తుంది. "అద్భుతమైనటువంటి కత్తెరసుమా యిది" అని తులసీదాసుగారు అంటారు.

రామనామం అనేటటువంటి అంకం వున్నదే ......... యీ రెండూ ..... యిది "ధర్మ అంకురకే పావనద్వైదళ" ధర్మరూప అంకురానికి పవిత్రమైన రెండు దళములట. ఇదికత్తిరించి పారేస్తుంది. "దేన్ని కతిరిస్తుంది?" ... జననమరణములు అనే టటువంటి యొక్క ఆభావన యేదయితే వుందో ఆద్వైతభావాన్ని నాశనం చేసిపారేస్తుంది ..... వాసుదేవ !

**రామనామం అంటే ఏమిటి ? .......... చిన్మయః**
**"రామయేవ వరం బ్రహ్మ రామయేవ వరం తవః**
**రామయేవ వరం సత్యం శ్రీరామో బ్రహ్మతారకం."**

అన్నసంగతి గుర్తులో వుంచుకుంటే యేమీ సందేహం లేకుండా వాళ్ళు కృతార్థు లౌతారు. ఐతే షరతేమిటయ్యా అంటే .... యేపని చేస్తున్నా వదలకూడదు. నామాన్ని ఆమాటే హెచ్చరికచేశారు.

**"సదా జంతు ముప్తైతి ముక్తిః"**

అని. ఇటువంటి అభ్యాసం చేసుకోండి ... ఇంట్లోకి వెడుతున్నాసరే ... ఇంట్లోకి వచ్చినాసరే.... అదే శ్రీరామరక్ష జ్ఞాపకం వుంచుకోండి. ఈ శ్రీరామరక్ష అనాది కాలంనుంచీ వస్తోంది. ఇప్పుడూ వుంది ....... ఎప్పుడూ వుంది ........ సర్వత్రావుంది. ఒక్క మాట చెబుతున్నాను ....... మదన మోహన మాలవ్యాజీ చెప్పులు యెక్కడైతే వుండేవో అక్కడ "నారాయణ" అనే నామాం వ్రాసి వుండేది. ఆ చెప్పుల్లో కాళ్ళు పెట్టేముందు "నారాయణ" అని కాళ్ళు పెట్టెవాడు. మళ్ళీ వొచ్చేవాడు. "నారామణ" అని చెప్పులు వదిలేవాడు .........

ఈ "నారాయణ" అనే టటువంటి నామం యేంచేస్తుంది ? ...... జడం కాదుగా ! ........ ఈ పాదరక్షలు యీకాస్తే రక్షిస్తాయి. "ఈనారాయణ" అనేది యేం చేస్తుందో తెలుసా? ...... వాణ్ణి అచ్ఛాదన చేసి వూరుకుంటుంది, ప్రహ్లాదుణ్ణి చేసినట్లు...

అట్లా కాపాడుతూ వుంటుంది. ఎందుకంటే ........... ఈ మనస్సుకు యేది అధిష్ఠానమో అదే రామఅంటె ........... ఈ జగత్తుకు యేది అధిష్ఠానమో అదే రామ అంటె ........... వాసుదేవ ! వాసుదేవ !

**"శ్రీరామ నామము యెంతో మంచిమధురము,**

**మధురాతి మధురము మనకందే అమృతము"**

రామనామాన్ని అమృతంగా చెప్పేరు. దేవతలు పానం చేసినటువంటి అమృతం అనుకుంటారేమో మీరు అంతకంటే కూడా ఉత్కృష్టమైనటువంటి అమృతంగా చెప్పేరు. ఆదేవతలు పానం చేసినటువంటి అమృతంవున్నదే, రామనా మామృతం యిచ్చే ఫలాన్ని యివ్వజాలరు.

రామనామామృతం యేఫలాన్ని యిస్తుందో ఆఅమృతానికి ఆయోగ్యత లేదు. రామనామామృతాశ్రయంవల్ల వచ్చేటటువంటి ఆఅమృతాన్ని పానంచేసినటు వంటి వారికి రాదు. కాని అది మనకందే అమృతం అన్నారు. స్వర్గంలో వున్నవారికి ఇది అందే అమృతం కాదు.... మనకందే అమృతం. దేవతలు అనుకుంటారట. "మాకు ఒక్క ఛాన్సు వస్తేచాలు. కలియుగంలో ... భగవన్నామం చేసుకొని తరిం చటానికి అవకాశం వుంటుంది.

**"ఖలౌ ఖలు భవిష్యంతి నారాయణ పరాయణాః"**

అని వాళ్ళు అనుకుంటారట ... యెందు కనుకుంటారు ? .... మనకందే భాగ్యం వారికి అందనదికనుక. అక్కడ ఆఅమృతంవంటిది గాదుయిది. అదితరిగే అమృతం - యిది తరగనటువంటిది . అవ్యయం అన్నారు. పౌర్ణమినాడు చంద్రుడు నుండి స్రవిస్తూవుంటుంది అమృతం. ఇక్కడేం చెప్పేరో తెలుసునా ? సదాశివుని యొక్క ముఖచంద్రుడిలోంచి నిరంతరం స్రవిస్తూ వుంటుందట. ఈ రామనామా మృతం ........ యీమాట యెందుకు చెపుతున్నానంటే యింతకంటే ప్రమాణం యేదీ అక్కరలేదు. తెలిసుకున్న వాడికి రామనామం విషయంలో సందేహం పడ టానికి పెద్దప్రబలమైన ప్రమాణం యిది. ఏది? .... ముక్త్యర్థం ...... కాశిలో ... రామనామాన్ని ఉపదేశం చేస్తాడు. ... మహాదేవుడు .... ఇక దీనివిషయంలో సందేహిస్తే నమ్మకపోతే వాళ్ళఖర్మ వాళ్ళది. ఇలాగ మాటిమాటికిగూడ తులసీదాసుగారు యిది ప్రమాణము వేదసమ్మతము అని చెపుతూ యెక్కడెక్కడ నామప్రసక్తి వచ్చిందో అక్కడక్కడ స్పష్టంచేసి చెప్పేరు యీమాట.

రామనామము రావణాది రాక్షసులను వధించినదిగదూ ! రాతిని స్త్రీగా చేసినది రామనామమము. అంటే యేమిటో తెలుసునా ! చాలామందికి తెలిసి వుంటుంది... చాలామందికి తెలియకపోవచ్చును.

విన్నాసరే విశ్వాసం లేకపోవచ్చును... రామనామము రావణాది రాక్షసును వధించినది అంటే ..."రామనామమే రాముడు - రాముడే రామనామము" అనేమాట మీరు ఎప్పటికి, ఎల్లకాలము మరిచిపోకుండా గుర్తులో వుంచుకుంటే మీకు నామ మహిమ విషయంలో ఏమాత్రము సందేహంరాదు. మిమ్మల్ని ఎవరు నిరుత్సాహ పరచలేదు. రామనామ విషయంలో ఎటువంటి నిరుత్సాహమాటలు చెప్పినాసరే మిమ్మల్ని ఎవ్వరూ నిరుత్సాహ పరచలేడు. రామనామమే రాముడు - రాముడే రామనామము.

ఇప్పుడు మీకు రామనామాన్నిగూర్చి చెప్పినటువంటి మహిమంతాకూడా పూర్తిగా మనసుకు పడుతుంది. లేకపోతే మీకు సందేహం కలుగుతుంది. రామ నామానికి యింత మహిమ యెట్లాగా అనిచెప్పి, ఈ మాట గుర్తులో వుంచుకోండి. నేనూయిదే గుర్తుచేస్తూ వుంటాను. "రాముడే రామనామము - రామనామమే రాముడు" అని ఇక మీరు రామనామముగురించి చెప్పినటువంటి మహిమ విషయంలో వ్యభిచారమబుద్ధి వుండదు......... సందేహం వుండదు...... ఏలాగయితే మీ అమ్మచెబితే మీ నాన్న విషయంలో యెంతధృఢంగా నమ్మేరో అలాగా వేదమాత చెప్పినటువంటి యీమాట పరమ సత్యం అని అలా నమ్మేస్తారు. మీతల్లి చెపితేనేగదా మీ తండ్రివిషయం మీకు తెలుసును. లేకపోతే తెలుసునా ? ఎవ్వడికి తెలియదు ...... నేను యెవ్వడికి పుట్టేనో తల్లి చెపుతుంది... అలాగే అనంతకోటి తల్లులవంటి వేదమాత చెప్పిందన్నమాట.

**"రామ ఏవ వరంబ్రహ్మ, రామ ఏవ వరంతవః**
**రామ ఏవ వరంతత్వం, శ్రీరామో బ్రహ్మతారకమ్**
**అదో్య రా తత్పదార్థస్యాత్, మకరాః త్వం పదార్థవ్యా**
**తయోస్సంయోజన మసీతర్థం బ్రహ్మవిదోవిదు ః।।**

ఇది బ్రహ్మవిదులే తెలుసుకుంటారట. "రామనామము మహావాక్యము, మహామంత్రము ...... అని. ఈ మాట యెందుకు వేసేరు.... సాధన చిన్నది అవటంచేత సందేహిస్తూ వుంటారు... నిజంగా రామనామంచేత యింత ముక్తివస్తుందా?" అని నిశ్చయంగా మరచిపోకుండా వుండండి...... ఇక రామనామంవల్ల ఏంజరగదో

ఆలోచించుకోండి. రామనామంవల్ల జరగనిదేమన్నా వుంటుందా? సమస్తమూ జరుగుతుంది. అంతే రాముడేం చేయలేడు.?.... రామనామం యేంచేయలేదు?.... నామానికి నామికికూడ భేదంలేదు. ఈమాట గుర్తులోవుంచుకోండి.

పరిశ్రమలేకుండా, చదువులేకుండా, భాష్యాదులన్నీ, వినకుండా "రామరామ" అంటే ముక్తివొస్తుందా ? అని ప్రశ్న వస్తుంది. ఒక్కమాట గుర్తుంచుకుంటే పండితుడికైనా సరే యీవిషయంలో సందేహం వుండదు. ఎందుకంటే... నామము నామి రెండు కాదనేటటువంటి మాట యెవడికి గుర్తుంటుందో వానికి నిస్సందేహంగా "రామనామమేవముక్తిస్స్యాత్" అనేటటువంటి మాట యెవ్వుడూకూడా హృదయంలో వుంటుంది. ఎందుకంటె యిది భగవదభిన్నము. భగవంతుడే భగవన్నామము భగ వన్నామమె భగవంతుడ యినపుడు భాష్యంశ్రవణం చేస్తే వచ్చేటటువంటి సహాయ సంపత్తి యిక్కడకు రాదూ? అన్నిటికీ గూడా అర్థమే యిది. సమస్తమైనటువంటి వాఙ్మయానికీ అర్థమే, "వేదేషు సారమఖిలేషు ఆగమ మంత్ర తంత్ర సారేషు సారమపి" శబ్దసముద్ర సారమైనటువంటి భగవన్నామాన్ని అంటుంటె ఆస్ఫురణరాదూ! ఆనిష్ట కుదురదూ ! ....... నిశ్చయంగా కుదురుతుంది కనుకనే ........

**"యత్ఫలం నాస్తి తపసా న యోగే న సమాధినా**
**తత్ఫలం లభతే సమ్యక్ కలౌ కేశవకీర్తనాత్."**

అనివ్యాసులవారు కంఠోక్తిగా చెప్పేరు. వాసుదేవ!

ఇలా భగవత్పరం చేసుకున్నటువంటి వారికి జగత్తు వెంటబడుతుంది. ధనపరం చేసుకున్నటువంటి దరిద్రుడకి జగుత్త గురువై కూర్చుంటుంది. ఎవడు బుద్ధిని ధనపరం చేసుకుంటాడో వాడికి గురువు యెవరూ? జగత్తే ! వాడు యోగి అయినాసరే! ......... అసలువాడు యోగెట్లా అవుతాడు?......... కుయోగే.....కాన భగవత్పరం చేసుకుంటాడా వాడు జగత్తుకు గురువౌతాడు. ధనపరం చేసుకుంటాడా జగత్తే వాడికి గురువవుతుంది.

కనుక యిక యెట్లా జీవించాలన్నమాట? ..... ఇళ్ళు వాకిళ్ళు వదలక్కర లేదు. చక్కగా భగవన్నామం చేసుకుంటూ జీవితం భగవన్మయం చేసుకుంటే జయం తప్పదు. గోపాలకు లెట్లా అయితే కృష్ణమయం చేసుకున్నారో, ఆ విధంగా కూర్చున్నా లేచినడుస్తున్నా........ భగవన్నామాన్ని పట్టిస్తేమాత్రం జయంనిశ్చయం.

## బోల్‌భక్తవత్సల భగవాన్‌కీజై! వాసుదేవ!

హరిగోవింద !............................. జయగోవింద ! వాసుదేవ !

ఈసారి గెలిచే గెలుపే గెలుపు. ఓడిపోవుటమే ఓడిపోవటం. అంటే! .... మనుష్య యోనిలోనే గెలవటమూ... ఓడటమూ. పశుయోనులలో గెలవటమూ లేదు... ఓడటమూ లేదు. అక్కడ మజా అనుభవించటమే. అక్కడ రామ భజన చేయనక్కరలేదు. ఇక్కడ రామ భజన చేయకపోతే మళ్ళీ ఆ కోటిలోకి చేరుతారుట. వాసుదేవ! ఏకోటిలోకి?........ పశుయోనిలో పుడతారట!........

కాని రామ భజన చెయ్యని వాడిని "పశువు" అంటే మాత్రం పశువుకి కోపం వస్తుందట. మనుష్యుడై పుట్టి "రామ" అనలేకపోతే మాతోటి పోలుస్తారేమిటి? మాకంటే కూడా అధముడు అనిచెప్పి. అంత కోపం వస్తుందట. పశువుతో పోలిస్తే. రామనామం చేయనటువంటి వాడిని.... వాసుదేవ!

అందుకని అవికూడా సహించలేవు... "భగద్విముఖుడైనటువంటి వాడిని మాతో పోల్చడానికి వీలులేదు. వాడికి యోగ్యత ఉండికూడా "రామ" అని అనలేక పోతున్నాడు కనుక మాకంటే కూడా అధముడు" అని చెప్పి అవ్వి అనుకుంటాయ్యిట. వాసుదేవ! .......వాసుదేవ! ....... వాసుదేవ!

అందుకనే ఈసారి గెలిచే గెలుపే గెలుపు, అంటే..... బాగా పంటలు పండించుకుంటేనా?.. ప్రమోషనులు వస్తేనా?...... ప్రమోషను కోసమే పాలు పడాలి. ఏం ప్రమోషను?...... అథవా మళ్ళీ పుడితే చచ్చి...... మళ్ళీ రామ నామము చేసేటటువంటి ప్రమోషనే రావాలి. వాసుదేవ! నిజమైనటువంటి ప్రమోషను అది..... మళ్ళీ ఒకవేళ చచ్చిపోయినట్టయితే ... మళ్ళీ పుడితే.... వాసుదేవ! మళ్ళీ యిటువంటి... అఖండంగా నోటితోటి.. కాళ్ళతోటి.. ఈ కళ్ళతోటి.. ఈ సకలేంద్రియాలతోటి రామరసాన్ని జుఱ్ఱుకోటానికే మళ్ళ జన్మయెత్తాలి. అదే ప్రమోషన్ అంటే !.. వాసుదేవ.

అదే మహాత్ములంతా కోరుకుంటూ వుంటారు.... యేమని?.... "పోనీలే!... ఈ జన్మ రాకపోయినాసరే!.... పురుగై పుట్టినా సరే!... పుల్లై పుట్టినా సరే!... గోవింద! ...........వాసుదేవ!...... నా మనస్సు నీయందు లగ్నమైయుంటే చాలు" అని. అటువంటి వారికి మళ్ళీ ఆ యోనియెందుకు వస్తుంది? వాళ్ళు అలా కోరుకోవటంలో

చమత్కారం వుంది... "నిన్ను స్మరిస్తేనేచాలు, అయోనులు రావటానికి వీలు లేదు... అసలు యోనన్న మాటే లేకుండా చేస్తావు.... వాసుదేవ! నీవు" అని. వారినిష్ఠ వారికి బాగా తెలుసు.

రామనామం కూర్చున్నా , లేచినా, తింటున్నా, తిరుగుతున్నప్పటికీ కూడా వాసుదేవ!.... యెప్పుడూ నోట పట్టివున్నట్టయితేనే "అబ్ కేజీత్‌జీత్‌హై" అంటే యీసారి గెలుపే గెలుపవుతుంది. ఈసారి ఓడేడా!... మళ్ళీయేమైపోతాడు?.... తింటో, కంటో కూచుంటాడు! యేమయి?... పశువై!.... వాసుదేవ!..... "యింత భయం కరమైన శిక్షండీ!"..... ఏమోమాకేం తెలుసు?... భగవానుడే చెప్పేడు. నాకువిముఖుడైతే మాత్రం ఆవిధంగా అయిపోతాడని...

భక్తి వేరు జ్ఞానంవేరు కాదు. అసలు అద్వైతికి, వేదాంతికి ఒకటి నిషేధింపదగింది యేదైనా వుంది అంటే వాడు అద్వైతి యెట్లా అవుతాడు ! వేదాంతి యెట్లా అవుతాడు !... కనుక భక్తి అనేటటువంటిది మూర్తీభవించి వుంటేనే నిజంగా వేదాంతం పండితులీ కలియుగంలో లేక పోయినట్టయితే అది వాడినే మోసగిస్తుందేమో ! అంత ప్రమాదం వుంది యీ భక్తి లేనటువంటి పరిస్థితులో యెందుకంటె....

"ఏతస్మిన్ నమయే కలిః హి కిల ప్రబలకామాదిభి ర్దూషితః"

ఇది కలియుగం. ఈ కలియుగంయొక్క ముచ్చటవచ్చినపుడు యెంత హెచ్చరిక చేసిచెప్పేరంటే మహాత్ములు... ఇక్కడ కామప్రకోపం బాగావిజృభించి వుంటుంది. ప్రతి వాడికీ పేరు ప్రతిష్ఠలు బాగా కావలసివస్తూ వుంటాయి... అట్టి పరిస్థితిలో వాడికి యేంపడుతుంది...

"వేదాంత శ్రవణాది నర్వమకరో న్నిర్వీర్య మూర్వీతలే"

నిర్వీర్యంగావుంటాయట వేదాంత సంబంధమైనటువంటి శ్రవణాదులన్నీ కూడా. ఒక్కడబ్బుకోసం తహతహలాడుతూ వుంటారు. ఈ మహావాక్యములు వినేటు వంటి వారు... ఈ శ్రవణం చేసేటటువంటివాళ్ళు... అని చెప్పి మన పూర్వులు చెప్పేరు అంటే మనమీద వాళ్ళకు ద్వేషమా!.. అసూయా!... ఈర్ష్యా!.. లేదు. వాళ్ళకీ తెలుసును. యోగులకి అంతావర్తమానమే... భూతము, భవిష్యత్ అంటూ లేదు యోగులకి వర్తమానమే... వాళ్ళకి తెలుసును....

"కలికేవల మలమూల మలీనా పాపపయోనిధిజల మనమీనా"

మనస్సులు అగాధమైనటువంటి నీటిలో చేపలు యెట్లా తన్మయంగా వుంటాయె, పాపరూప సముద్రంలో యీ కలిజీవుల చిత్తములుకూడా అట్లాగే తన్మయంగా వుంటూవుంటాయి అని చెబుతూ... అట్టివారుకూడా భగవంతుని యొక్క అనుగ్రహాన్ని సంపాదించుకోటానికి మహదవకాశం వున్నది. యేమిటయ్యా అంటే...

"భగవత్ కథ... భగవన్నామం..."

భగవత్ కథ విషయంలో భాగవతం తీసుకోండి... భాగవతాన్ని గూర్చి యేం చెప్పేరు... బ్రహ్మసూత్రములకు, ఉపనిషత్తులకు, భగవద్గీతకు కూడా అర్థమని చెప్పేరు. అటువంటి భాగవతాన్ని గనక శ్రద్ధా, భక్తితో సేవించినట్టయితే వాడికి యేమి లోటువుంటుంది !.... వాసుదేవ...

"కథాకీర్తు కలివిషే భవసాగర్ కీ నావ్"

చక్కగా భగవంతునికథ యెంత చక్కగా మీరు అనుసంధానంచేస్తే అంత మీకు భగవంతునియొక్క అనుగ్రహం కలుగుతుంది. అనుగ్రహం కలగటం యేమిటి... దీనియందు అభిరుచి కలగటంయేమిటి! ... వాసుదేవ... వాసుదేవ...

ఆత్మ అర్థం అయినట్టే భగవన్నామం అర్థం అయితే... భగవన్నామం అర్థం అయితే ఆత్మవంతుడే!... ఆత్మవంతుడికి భగవన్నామం వేరుకాదు అనేటటువంటిది స్పష్టంగా శివుడికి అర్థమైనట్లు, ఆ హనుమంతుడికి అర్థమైనట్లు, శుకులవారికి అర్థమైనట్లు, త్యాగరాజులవారికి అర్థమైనట్లు అర్థం అవుతుంది... వాసుదేవ!

యేమొస్తుంది భగవన్నామం చేస్తే?.... అనుకుంటారు సామాన్యులు.. వాళ్ళఖర్మఅది... వాళ్ళఖర్మ... వాళ్ళు చదువుకున్నవాళ్ళు అయినాసరే! భగవంతుని గురించి అంటే యెంతో భగవన్నామాన్ని గురించికూడా అంటే అనేటటువంటిమాట వాళ్ళకి తెలియకపోగా యేంచేస్తుంది రామ నామం అంటే... అంటాడు... యేం చేస్తుంది?... కత్తిరిస్తుంది రామనామం. ఈ "ర" కార "మ" కారములు కత్తిరించి పారేస్తాయి సంసారవృక్షముయొక్క కూకటివేళ్ళని... అని చెప్పి... నేను కాదు చెప్పటం! శ్రీధరులవారే చెప్పేరు....

**"సదా సర్వత్రాఽస్తే నను విమల మాద్యం తవ పదం తథాఽపి..**
**ఏకం స్తోకం నహి భవతరోః పత్ర పభినతు?"**

"స్వామి! భగవాన్ ! ప్రభో!.... ఉన్నదంతా నువ్వేనయ్యా!... అయితే... సంసార వృక్షము యొక్క చిగురుటాకులుకూడా త్రుంచలేకపోతున్నావు. నువ్వు!... అని చెబుతూ తర్వాత ఒకమాట అన్నారు...

**"క్షణం జిహ్వాగ్రస్థం తవను భగవన్నామనిఖిలం.**
**సమూలం సంసారం కషతి కతరతు సేవ్యమానయోః"**

ఒక్కక్షణం కనక జిహ్వామీద భగవన్నామమును నృత్యం చేయించి నట్లయితే కూకటివ్రేళ్ళతోటి పెకలించి కత్తిరించి అవతలపారేస్తుంది నీనామము!... యేది సేవించమంటారు స్వామి! అని చెప్పి శ్రీధరులవారు భగవన్నామ విషయంలో ఈ శ్లోకం చెప్పేరు.... వాసుదేవా!....

అందుచేత... శ్రవణం చేసుకోండి,..... అన్ని సాధనలు చేసుకోండి,.... కానీ అన్నిటికికూడా ప్రాణం భగవన్నామం అనేటటువంటిమాట మర్చేపోవద్దు. ఈ ప్రాణం భగవన్నామం అనేటటువంటిమాట యెవనికి బాగా హత్తుకుంటుందంటే... నామము, నామి రెండే వేరు, కాదనేటటువంటి యొక్క విషయం తెలుసుకొనేటటువంటి సాధకునకే!... వాసుదేవా !... భక్త వత్సల భగవాన్‌కీ.... జై .....

శ్రీవిద్యా శంకర చంద్రశేఖర సరస్వతీ స్వామి.

## ఈగ్రంథముద్రణకు సహాయము చేసిన భక్తులు

1) కీ.శే. శ్రీ ప్రాతూరి గోపాలక్రిష్ణమూర్తి గారి జ్ఞాపకార్థము కుటుంబము (హైదరాబాద్)
2) కీ.శే. శ్రీ జూలూరి జగదీశ్వరయ్యగారి జ్ఞాపకార్థము కుమారులు (హైదరాబాద్)
3) కీ.శే. శ్రీమతి భట్టిప్రోలు మందాకిని గారి జ్ఞాపకార్థము కుమారుడు (హైదరాబాద్)
4) కీ.శే. శ్రీ కాసాజ సత్యనారయణ, సతీమణి శ్రీమతి కమలమ్మ గారి జ్ఞాపకార్థము కుమారులు (హైదరాబాద్)
5) కీ.శే. శ్రీమతి పత్రి కమలమ్మ గారి జ్ఞాపకార్థము కుమార్తె (హైదరాబాద్)
6) శ్రీ కోటానత్యనారయణగారు, ధర్మపత్ని శ్రీమతి అన్నపూర్ణమ్మగారు (నరసరావుపేట)
7) శ్రీ మంత్రాల రామసోమయాజులుగారు, ధర్మపత్ని శ్రీమతి కరుణమ్మగారు (పిఠాపురం)
8) శ్రీ ముదిగంటి రామశర్మ గారు, ధర్మపత్ని శ్రీమతి సర్వలక్ష్మి గారు (గార్ల)
9) శ్రీ బి. గురుమూర్తి గారు (సికింద్రాబాద్)
10) శ్రీ దేవేందర్ మెహతా గారు (హైదరాబాద్)
11) శ్రీమతి అన్నపూర్ణ ఎ.యస్.రావు గారు (బొంబాయి)
12) శ్రీ యమ్.యస్. మూర్తి గారు ధర్మపత్ని శ్రీమతి వేదావతి గారు (హైదరాబాద్)
13) శ్రీమతి కె. లోహితమ్మ గారు (బళ్ళారి)
14) శ్రీ. పి. కేశవరెడ్డి గారు, ధర్మపత్ని శ్రీమతి అంజనా గారు (హైదరాబాద్)
15) శ్రీ. పి వెంకటేశ్వరులు గారు (హైదరాబాద్)
16) శ్రీ గురుస్వామి మొదలియార్ గారు, ధర్మపత్ని శ్రీమతి మీనాక్షమ్మగారు (భీమవరం)
17) శ్రీ. సుందర రామారావు గారు (భీమవరం)
18.) శ్రీ పెరుమాళ్ వెంకటరత్నం గారు ( భీమవరం)
19) శ్రీ యర్రగుంట్ల రామచంద్రరావు గారు (సికింద్రాబాద్)
20) శ్రీ. కె.జె. సూర్యనారాయణశర్మ గారు (రాయచూర్)
21) శ్రీ మంత్రి చంద్రశేఖరరావు గారు ( హైదరాబాద్)
22) శ్రీమతి జి హైమావతి గారు (బాపట్ల)

# జయ పంచకము

జయత్యతి బలో రామో లక్ష్మణశ్చ మహాబలః
రాజా జయతి సుగ్రీవో రాఘవేణాభిపాలితః ॥

దాసోహం కోసలేంద్రస్యరామస్యా క్లిష్ట కర్మణః
హనుమాన్ శత్రుసైన్యానాం నిహంతా మారుతాత్మజః

నరావణ సహస్రం మేయుద్ధే ప్రతి బలం భవేత్
శిలాభిస్తు ప్రహరతః పాదపైశ్చ సహస్రశః

అర్ధయిత్వాపురీం లంకామభివాద్యభమై ధిలీం
సమృద్ధార్థో గమిష్యామి మిషతాం సర్వరాక్షసామ్

అస్త్ర విజ్జయతాం రామో లక్ష్మణశ్చ, మహా బలః
రాజా జయతి సుగ్రీవో రాఘవేణాభిపాలితః

దాసోహం కోసలేంద్రస్య రామస్యాక్లిష్ట కర్మణః
హనుమాన్ శత్రుసైన్యానాం నిహంతా మారుతాత్మజః
నరావణ... రాక్షసామ్.

జయత్యతిబలోరామో లక్ష్మణశ్చ మహాబలః రాజా జయతి
సుగ్రీవోరాఘవేణాభి పాలితః అహం కోసల రాజస్య దాసః పవన సమ్భవః
హనుమానితి సర్వత్ర నామవిశ్రావితం, మయా ।

జయత్యతి బలోరామో లక్ష్మణశ్చ మహాబలః
రాజా జయతి సుగ్రీవో రాఘవేణాభిపాలితః

ఇత్యేవంఘోష యం తశ్చగర్జంతశ్చ ప్లవంగమాః
అభ్యధావంత లంకాయాః ప్రాకారం కామ రూపిణః ।

జయత్యతి బలోరామో లక్ష్మణశ్చ మహాబలః
రాజా జయతి సుగ్రీవ ఇతి శబ్దో మహానభూత్

## ప్రార్థన

అతులితబలధామం స్వర్ణశైలాభదేహం
దనుజవనకృశానుం జ్ఞానినా మగ్రగణ్యమ్
సకలగుణనిధానం వానరాణా మధీశం
రఘుపతి ప్రియభక్తం వాతజాతం నమామి ।

గోష్పదీకృత వారాశిం । మశకీకృత రాక్షసమ్
రామాయణమహామాలా । రత్నం వందే ఽనిలాత్మజమ్

యత్రయత్ర రఘునాథ కీర్తనం । తత్ర తత్ర కృతమ స్త కాంజలిం
బాష్పవారి పరిపూర్ణ లోచనం । మారుతిం నమత రాక్షసాంతకమ్ ॥

# హనుమాన్ చాలీసా

దోహా : శ్రీగురుచరణ సరోజరజ । నిజమనముకుర సుధారి
వరణౌ౯ రఘువర విమలయశ । జో దాయక ఫల చారి
బుద్ధిహీన తను జానికై । సుమిరౌ౯ పవన కుమార్ !
బల బుద్ధి విద్యా దేహు మొహి । హరహు కలేశ వికార్.

జయ హనుమాన జ్ఞానగుణసాగర । జయ కపీశ తిహు౯ లోక వుజాగర
రామదూత అతులిత బలధామా । అంజనిపుత్ర పవనసుత నామా,
మహావీర విక్రమ భజరంగీ । కుమతి నివార సుమతికే సంగీ
కంచనవరణ విరాజ సువేశా । కానన కుండల కుంచిత కేశా
హాథ వజ్ర అరు ధ్వజా విరాజై । కాంథే మూంజ జనేవూ ఛాజై
శ౯కరసువన కేసరీనందన । తేజప్రతాప మహాజగవందన
విద్యావాన గుణీ అతి చాతుర । రామకాజ కవివేకో ఆతుర
ప్రభుచరిత్ర సునివేకో రసియా । రామ లఖన సీతా మన బసియా
సూక్ష్మ రూప ధరి సియహి౯ దిఖావా । వికటరూప ధరి లంక జరావా
భీమరూప ధరి అసుర సంహారే । రామచంద్రకే కాజ స౯వారే
లాయ సజీవన లఖన జియాయే । శ్రీ రఘువీర హరఖి వుర లాయే
రఘుపతికీన్హీ బహుత బడాయీ । కహాభరత సమ తుమ ప్రియభాయీ
సహసవదన తుమ్హరో యశ గావై౯ । అసకహి శ్రీపతి కంఠ లగావై౯,
సనకాదిక బ్రహ్మాది మునీశా । నారద శారద సహిత అహీశా
యమ కుబేర దిగపాల జహా౯తే । కవి కోవిద కహి సకై కహా౯తే
తుమ వుపకార సుగ్రీవ హి౯ కీన్హా । రామ మిలాయ రాజపద దీన్హా
తుమ్హరో మంత్ర విభీషణ మానా । లంకేశ్వర భయే సబ జగ జానా
యుగ సహస్ర యోజన పరభానూ । లీల్యో తాహి మధురఫల జానూ

ప్రభుముద్రికా మేలి ముఖ మాహీం । జలధి లాంఘి గయే అచరజ నాహీం
దుర్గమ కాజ జగతకే జేతే । సుగమ అనుగ్రహ తుమ్హరే తేతే
రామదుఆరే తుమ రఖవారే । హోత న ఆజ్ఞా బిను పైఠారే
సబ సుఖ లహై తుమ్హారీ శరనా । తుమ రక్షక కాహూకో డరనా
ఆపన తేజ సమ్హారో ఆపై । తీనోం లోక హాంకతే కాంపై
భూత పిశాచ నికట నహిం ఆవై । మహావీర జబ నామ సునావై
నాసై రోగ హరై సబ పీరా । జపత నిరంతర హనుమత వీరా
సంకట సే హనుమాన ఛుడావై । మనక్రమ వచన ధ్యాన జో లావై
సబ పర రామరాయ సిరతాజా । తినకే కాజ సకల తుమ సాజా
ఔర మనోరథ జో కోయి లావై । తాసు అమిత జీవన ఫల పావై
చారోం యుగ పరతాప తుమ్హారా । హై పరసిద్ధి జగత పుజియారా
సాధు సంతకే తుమ రఖవారే । అసుర నికందన రామ దులారే
అష్టసిద్ధి నవనిధికే దాతా । అస వర దీన్హ జానకీమాతా
రామరసాయన తుమ్హరే పాసా । సాదర తుమ రఘుపతికే దాసా
తుమ్హరే భజన రామకో భావై । జన్మ జన్మ కే దుఖ బిసరావై
అంతకాల రఘుపతిపుర జాయీ । జహాంజన్మి హరిభక్త కహాయీ
ఔరదేవతా చిత్త న ధరయీ । హనుమత సేయి సర్వ సుఖకరయీ
సంకట హటై మిటై సబ పేరా । జో సుమిరై హనుమత బలవీరా
జై జై జై హనుమాన గోసాయీం । కృపా కరో గురుదేవ కీ నాయీ
యహ శతవార పాఠ కర జోయీ । ఛూటహిబంది మహాసుఖహోయీ
జో యహ పఢై హనుమానచాలీసా । హోయ సిద్ధి సాఖీ గౌరీసా
తులసీదాస సదా హరిచేరా । కీజై నాథ హృదయ మహం డేరా
'దోహా' పవనతనయ సంకటహరన । మంగల మూరతి రూప
రామ లఖన సీతా సహిత హృదయ బసహు సురహభూప్.

**తాత్పర్యము** ॥ శ్రీగురుచరణ కమలములోని రజస్సుచే నా మనస్సును అద్దమును శుభ్రము చేసికొని ధర్మార్థ కామ మోక్షములను చతుర్విధ పురుషార్థముల నొసంగు శ్రీరామ చంద్రుని విమలకీర్తిని వర్ణించెదను. ఈ శరీరము బుద్ధిహీనతచేఁ గలిగినదని తెలిసి కొని పవనకుమారుని స్మరించెదను, అతఁడు నాకు బలమును బుద్ధిని విద్యను నొసంగుటయే గాక కామాది వికారముల వలన గలిగిన క్లేశములను హరించుగాక జ్ఞాన గుణ సాగరుఁడైన ఓ హనుమంతా ! నీకు జయమగు గాక ! త్రిలోకములను ప్రకాశింపఁ జేయు నో కపీశా ! నీకు జయమగుగాక ! రామదూతా ! సాటిలేని బలమునకు ఉనికిపట్టయినవాఁడా ! అంజనీ సుతా ! పవనసుతుఁడను పేరు కలవాఁడా ! మహావీరా ! విక్రమ స్వరూపా ! వజ్రమువంటి శరీరము కలవాఁడా ! చెడ్డబుద్ధిని బోఁగొట్టువాఁడా ! మంచి బుద్ధిగలవారికి తోడ్పడువాఁడా ! బంగారము వంటి శరీరచ్ఛాయ గలవాఁడా ! మంచి వేషముతో నొప్పెడువాఁడా ! కర్ణములకుఁగుండ లములు ధరించినవాఁడా ! జుట్టు ముడివైచుకొనిన వాఁడా! చేతిలో వజ్రమును, ధ్వజమును విరాజిల్లువాఁడా ! స్కంధమునందు ముంజను జందెమును గలిగినవాఁడా ! శంకరునకు పుత్రుఁడా ! (శివ వీర్యము వలన పుట్టిన వాఁడు) కేసరి (అంజనకు భర్త) తనయా! గొప్ప తేజస్సు ప్రతాపములు గలవాఁడా! సమస్త జగములచే నమస్కరింపఁడువాఁడా ! విద్వాంసుడా ! కళ్యాణగుణములు కలవాఁడా ! మిక్కిలి చతురత్వము కలవాఁడా ! రామ కార్యమును నెరవేర్చుటకు అతురతపడువాఁడా ! శ్రీరామప్రభువు చరిత్రమును విను రసికుఁడా ! సీతా రామలక్ష్మణులను మనస్సున ధరించినవాఁడా ! సూక్ష్మరూపమును ధరించి సీతకు గానఁబడితివి. వికటరూపమును ధరించి లంకను (దేహబుద్ధి) గాల్చి వేసితివి. భయంకర రూపమును ధరించి అసురులను (అరిషడ్వర్గములు) సంహరించితివి. రామచంద్రుని కార్యమును నెఱవేర్చితివి. సంజీవిని దీసికొనివచ్చి లక్ష్మణుని బ్రతికించితివి. దానికి శ్రీరాముఁడు సంతసించి హృదయమున హత్తుకొనెను. శ్రీరామచంద్రమూర్తి నిన్ను గొప్పగా బొగడి "సోదరా! నీవు నాకు భరతునితో సమానమైనవాఁడ" వని పలికెను. వేయినోళ్ళ నీయశమును గానముచేసి శ్రీరాముఁడు నిన్ను గౌగించుకొనెను. సనకాది దేవర్షులు, బ్రహ్మాదిదేవతలు, మునీశ్వరులు, నారదుడు, సరస్వతి, ఆదిశేషువు, యమ, కుబేరాది దిక్పాలకులు, కవులు, పండితులు మొదలయినవారు నీ యశోగానమును నేమిచేయఁగల్గుదురు? నీవు సుగ్రీవున కుపకార మొనర్చితివి. రామునితో నాతనికి సఖ్యము కావింపఁజేసి రాజ్యపద మిప్పించితివి. నీ ఆలోచనమును విభీషణుఁ డంగీకరించి లంకకు రాజైన సంగతి లోకమంతకును దెలిసినదియే. రెండువేల ఆమడల దూరమున నున్న

సూర్యుని మధురఫలముగా భావించి లీలగా గ్రహించితివి. శ్రీరామ ముద్రికనునోట నుంచికొని సముద్రమును లంఘించితి వనుటలో నాశ్చర్య మేమున్నది ! జగమునందు దుర్గమమగు కార్య మేది కలదో అది నీ యనుగ్రహమున సుగమము కాఁగలదు. నీవు రామద్వారమును గాచువాఁడవు, నీయాజ్ఞలేక లోనికి వెళ్ళుటకు వీలులేదు. నిన్ను శరణువేఁడిన సమస్త సుఖములునులభింపఁ గలవు, నీవు రక్షకుండవుగా నుండిన నెవరికిని భయపడవలసిన పనిలేదు. నీ తేజమును సంబాళించుకొనఁ గలవాఁడవు నీవే. నీ వొక్క కేకవేసిన మూఁడు లోకములు వణకఁగలవు. మహావీరా! నీనామమును విన్నచో భూతప్రేత పిశాచములు దగ్గరకు రాఁజాలవు. నిరంతరము వీరహనుమానుని జపించినచో సమస్త రోగములు నశించును సమస్త పీడలు తొలఁగును. మనోవాక్కాయములచే నెవఁడు హనుమంతుని ధ్యానించునో వానినాతఁడు సమస్త సంకటముల నుండి బయటపడవేయును. రాముఁడు రాజులందఱకు మకుటమువంటివాఁడు. తాపసులందఱకు ప్రభువువంటివాఁడు ఆయన కార్యము లన్నింటిని నీవు చక్కగ సవరించు చుందువు. ఎవ్వరేయే మనోరథము కలిగియున్నను, వానికి జీవనఫలిత మమితముగ లభించును. నీ ప్రతాపము నాలుగు యుగములలోను గలదనుట ప్రసిద్ధము. దానిచే జగత్తు ఉజ్జ్వలమైనది. సాధుసజ్జనులను నీవు రక్షించుచుందువు. అసురలను జంపి, రామునకుఁ బ్రియుఁడవై తివి. అష్టసిద్ధులు, నవనిధుల నొసంగువాఁడవను వరమును జానకీదేవి యొసంగెను. రామరసాయనము నీయొద్ధ గలదు. నీవు రామ చంద్రునకు శ్రద్ధాళువైన దాసుఁడవు. నిన్ను (మేము) భజించుట రామచాంద్రున కానందదాయుకవు జన్మజన్మాంతర దుఃఖములను మరపింపజేయును. ఎచ్చట జన్మించినను హరిభక్తులని పిలువఁబడు దురు. శ్రీరాముని పురమునకు అంత్యకాలమున బోవుదురు. ఇంకొక దేవతను చిత్తమున ధరింపకహనుమంతుని సేవించిన సర్వసుఖముల నాతఁ డొన గూర్చును. బలవీరుఁడగు హనుమంతుని స్మరించిన సంకటము లన్నియు తొలఁగును. పీడ లన్నియు నశించును. హనుమత్ప్రభువునకు జేజేలు. శ్రీ గురుదేవునివలె గృపఁజూడుము. దీనిని నూఱుసార్లెవరు పఠనము చేయుదురో వారికి బంధములు వీడి మహాసుఖము కలుగును. హనుమాన్ చాలీసా యను నీ స్తోత్రము నెవరు పఠించెదరో వారికి పార్వతీపరమేశ్వరుల సాక్షిగా సిద్ధి కలుగును. తులసీదాసు ఎల్లప్పుడు హరిదాసే. ఓనాథా! నీవు నా హృదయములో నుండుము. కష్టములను పోగొట్టువాఁడవు, మంగళ స్వరూపుఁడవు నగు ఓ పవనపుత్రుడా! సీతారామలక్షణ సహితుఁడవైన సమస్త దేవతలతో నీవు నా హృదయమున నుండుము.



నంకీర్తనాచార్య : [illegible] సరస్వతీస్వామి.

## నామమహిమ

విష్ణుం నారాయణం కృష్ణం మాధవం మధుసూదనం
హరిం నరహరిం రామం గోవిందం దధి వామనం

### శ్రీ హనుమంతుని ద్వాదశ నామములు

హనుమా నంజనాసూనుః వాయుపుత్రో మహాబలః,
రామేష్టః ఫల్గుణ సఖః పింగాక్షో౽మితవిక్రమః ॥

ఉదధిక్రమణశ్చైవ సీతాశోకవినాశకః,
లక్ష్మణ ప్రాణదాతాచ దశగ్రీవస్య దర్పహా ॥
ద్వాదశైతాని నామాని కపీంద్రస్య మహాత్మనః
స్వాపకాలే పఠేన్నిత్యం యాత్రకాలే విశేషితః
తస్య మృత్యుభయం నాస్తి సర్వత్ర విజయీభవేత్ ॥

బుద్ధిర్బలం యశోధైర్యం నిర్భయత్వ మరోగతా,
అజాడ్యంవాక పటుత్వంచ హనుమత్స్మరణాద్భవేత్

కృష్ణాయ వాసుదేవాయ హరయే పరమాత్మనె
ప్రణతః క్లేశనాశాయ గోవిందాయ నమోనమః


శే. శ్రీ ప్రాతూరి గోపాలక్రిష్ణమూర్తి గారు


కీ.శే. శ్రీ కాసోజి సత్యనారయణ,
సతీమణి శ్రీమతి కమలమ్మ గారు


.శే. శ్రీమతి పత్రి కమలమ్మ గారు


కీ.శే. శ్రీ జూలూరి జగదీశ్వరయ్యగారు


కీ.శే. శ్రీమతి భట్టిప్రోలు మందాకిని గారు



శ్రీ కోటాసత్యనారయణగారు,
ధర్మపత్ని శ్రీమతి అన్నపూర్ణమ్మగారు


ప్రింటింగ్
**శ్రీ కళా ప్రింటర్స్**
గాంధీనగర్, హైదరాబాద్ - 80
ఫోన్ : 7611864

లేజర్ టైప్ సెట్టింగ్
**సమంతా గ్రాఫిక్స్**
గాంధీనగర్, హైదరాబాద్ - 80

